# హాస్యకథలు

చింతా దీక్షితులు

నవ్యసాహిత్య పరిషత్తు
గుంటూరు

# మనవి

చింతా దీక్షితులుగారు వ్రాసిన కథలు అనేకమున్నవి. ఇదివరలో ఏకాదశి, దీక్షితులు కథలు అనే పేళ్లతో రెండు గ్రంథములు మాత్రమే వెలువడ్డవి. వారి కథలు వేర్వేరు వర్గములుగా విభజించుటకు వీలుగా ఉండటచేత, అట్లు విభజించి ప్రకటించడము మంచి దిని తోచింది. వటీరావు కథలు ప్రకటితమైనవి. హాస్యకథలు, సూరిసీతి వెంకికథలు, ఫెయిరీకథలు, ఏకాంకికలు మున్నగునని ప్రకటించవలసి యున్నది. ఇట్లు వర్గీకరణము చేయడంలో వెనుక ప్రకటించిన కథా సంపుటములలోని కథలను ఆయా వర్గముల క్రింద వేయుటకు తీసుకోవలసి వచ్చింది. అందువల్లనే ఏకాదశి నుండి ఒక కథా, దీక్షితులు కథల నుండి ఒక కథ ఇందులో వేయ వలసి వచ్చింది. ఇతర సంపుటములు కూడా ప్రకటించడానికి ఏర్పాటు చేస్తున్నాము.

నవ్యసాహిత్య పరిషత్తు

# అనుక్రమణిక

# ఆంధ్ర-దోమల సభ

౧

యోగాభ్యాసం చేస్తూన్నవాడు ఒక స్థితిలో పశు పక్ష్యాదుల భాషలు తెలుసుకో గలుగుతాడట! నేను ఎంత వద్దన్నా వినకుండా నా స్నేహితుడొకడు యోగాభ్యాసం మొదలు పెట్టాడు. తెల్లారకుండా ఒక గదిలో తలుపులు వేసుకొని కూర్చుని ఏవో ముగ్గులు వేస్తుండేవాడు. అవేమిటంటే ఆసనాలని నాతో రహస్యంగా చెప్పేవాడు. అంతే కాకుండా ఇంజనుగొట్టములో ఆవిరిలాగ చప్పుడుచేస్తూ గాలి లోపలికి ఎగపీల్చి బయటకు వదలి పెట్టుతూ ఉండేవాడు. అదేమిటంటే ప్రాణాయామం—ఎవరితోనూ చెప్పవద్దన్నాడు. క్రమ క్రమంగా ఆపిచ్చిలో పడిపోయాడు. కొన్ని నెల్లయ్యేసరికి ఏవేవో కొత్తశక్తులు తన కబ్బేయని చెప్పాడు. అందులో ఒకశక్తి పశువుల, పక్షుల, కీటకముల భావాలు వాటిచేష్టల ద్వారా శబ్దములద్వారా ఇతరవిధములుగాను గుర్తించడం.

అతగాడు చెప్పే మాటలు యథార్థమో కాదో అని అప్పుడప్పుడు ఒక్కొక్క మృగాన్నుద్దేశించి దానిభావము చెప్పమనేవాడిని. ఏదో చెప్పుతూఉండేవాడు. అయితే అతడు చెప్పింది నిజమో కాదో నిర్ణయించడం ఎలాగ?

గోదావరి ఒడ్డున గడ్డికి ప్రత్యామ్నాయము కాగితాలు తింటూన్న ఒకగోవును చూపి ఇది ఏమనుకొంటోంద చెప్ప

మంటే అతడు అక్కడ నిలబడి దానికేసి నిదానించి చూచి కళ్లుమూసుకొని చెప్పేవాడు. "ఇది—ఈగోవు—ఈగోవు ప్రస్తుత సమయాన్ని మనదేశములో ధర్మము క్షీణించిందని విచారిస్తోంది. ఈ మానవులు తను కాగితాలు తినడంచూచి గోవుల కుండదగ్గ హక్కులమాట అటుండగా అధమపక్షం కడుపునిండా గడ్డేనా వేస్తారేమో అని ఆలోచిస్తోంది."

ఈమాటలు విన్న నేను ఏమనుకోవాలి ?

ఒకనాడు ఒక ఆంబోతు తానే పట్టణ మేలుతూన్నట్లు చూస్తూ రోడ్డు కడ్డంగా నిలబడింది. మనుష్యులూ బళ్లూ తప్పుకుపోతున్నారు కాని దాన్ని ఎవరూ పక్కకు తోలడం లేదు భయంచేత.

దాని చిత్తవృత్తి ఎటువంటిదో తెలుసుకోవా లని అడిగాను మా స్నేహితుణ్ణి. అతడు చెప్పుతున్నాడు—"ఈ మనుష్యులకు బుద్ధి లేదు. లొంగితే బళ్లకు కట్టుకు తిప్పుతారు. ఎదురుకొంటే దూరంగా తొలిగిపోతారు................ బోలెడంత గందరగోళంచేసి, పసుపు రాసి, కుంకుం పెట్టి, ఊరేగించి, పూజించి, అచ్చుపోసి వదలిపెడతారు. మర్నాడు దానికి తిండి దొరికిందా, లేదా అనే సంగతైనా ఆలోచించరు............చస్తే రెండెడ్ల బండిలో ముస్తాబుచేసి పడుకోబెట్టి ఊరేగిస్తారు. బదికున్నప్పుడు పట్టెడు గడ్డిపోచలైనా వెయ్యరు....ఈ మానవుల్ని ఏం చేసినా పాపం లేదు."

ఈ విధంగా నా స్నేహితుడు జంతు హృదయాన్ని వెల్లడిచేసేవాడు. అతడిమాటలను బట్టి చూస్తే వాటికి మనుష్యుల పట్ల సద్భావ మున్నట్లు తోచదు.

మనుష్యులు తమ కుపకారము చెయ్యడం లేదని వారిని నిందించడమే కాకుండా అకారణంగా మానవుల ఆచార వ్యవహారాలను గురించి కూడా అవి ప్రసంగించుకోవడమూ నిందించడమూ కూడా కద్దు.

ఊరిబైలపల చిట్టడవిలోకి మే మిద్దరమూ షికారుగా వెళ్లినప్పుడు అతడు ఒకపక్షి దంపతుల సంభాషణ ఈవిధంగా చెప్పాడు.

"చూడు చూడు, ఇద్దరు ద్విపాత్తులు అలా వెడుతున్నారు.

"వాళ్లబళ్లు అలాగ వేళ్లాడిపోతోందేం పాపం?"

"ఒళ్లు కాదు వేళ్లాడుతూంట—అవి వాళ్లు తొడుక్కునే బట్టలు."

"ఎందుకు పాపం వాళ్లవి తొడుక్కోవడం — వాళ్లకి ఒంటిమీద చర్మం గాని వెంట్రుకలు గాని లేవూ?"

"ఉన్నాయి, ఉన్నా ఎందుకో అవి తొడుక్కుంటారు."

"పాపం మనకు భగవంతుడు రెక్కలూ వెంట్రుకలూ ఇచ్చినట్లు వాళ్ల కివ్వలేనట్లుంది. నిజంగా భగవంతుడు పక్షపాతం చేస్తాడా?"

జంతువులలో ఉత్కృష్ట జంతువులూ నీచ జంతువులూ అంటూ లేవూ? ఉత్కృష్ట జంతువుల కుండే సదుపాయాలు నీచజంతువుల కుంటాయా? భగవంతుడి దయకు పాత్రమైన వాళ్లు ఉత్కృష్టజంతువులై పుడతారు. పాపం చేసుకొన్న వాళ్లకి ఏ నరజన్మమో, ఏ సర్పజన్మమో వస్తుంది."

"అవును పాపం—చూడు తలమీద బుట్టలు బోర్లించుకొన్నారు. మెడకు గుడ్డపేలికలు చుట్టబెట్టుకొన్నారు. కళ్లకు

గంతలు కట్టుకొన్నారు. కాళ్లకు డెక్కలు తగిలించు కొన్నారు........"

"తోడిజంతువులు నవ్వుతారనేనా లేదు సిగ్గు—"

"వాళ్లదగ్గరగా వెళ్లకూడదు. వాళ్లకళ్లు మంచివికావు...."

ఈవిధంగా సంభాషణ వెడుతోంది. నా స్నేహితుణ్ణి ఆపి అన్నానుగదా, "పూర్వకాలాల్లో పక్షిదంపతులు రాచ కొమార్తెలనుగురించీ రాచికొమాళ్లనుగురించీ మాట్లాడు కొంటూ ఉండేవిట—ఈకాలంలో ఈవిధంగా మారాయేమి? మళ్లీ జాగ్రత్తగా విను—మన యువరాజుగారి పెళ్లినిగురించి కాని మన మంత్రిగారి కుమారుడి పెళ్లినిగురించి గాని మాట్లాడుతాయేమో."

మా స్నేహితుడు వినాలని మళ్లి మనస్సు నేకాగ్రము చేసుకొంటూండగా అవి ఎగిరిపోయాయి.

ఈవిధంగానే తమకు బలిభుక్కులని పేరుపెట్టినీన్నీ మనుష్యులు తమకు బలులు వేయడం లేదని కాకులు అడ్డమైన తిట్లూ తిడుతూన్నట్లు ఒకమాటు నా స్నేహితుడు చెప్పాడు.

వినోదంగా కొంతకాలం ఈమాదిరిగా కాలక్షేపం చేశాము. ఒకనాటిసాయంకాలం నా స్నేహితుడు మా యింటికి పరుగెత్తుకు వచ్చి—"లే, లే, వెడదాం, రా, చప్పున—కండువా వేసుకో."

"ఏమంత తొందర" అన్నాను.

"టైము లేదు. రావాలి, రావాలి చప్పున" అన్నాడు.

"ఏమిటి సంగతి?"

"దోమల సభ."

"అంటే?"

"నీకు మతిగానే పోయిందా ఏమిటి—ఇప్పుడు దోమలు సభ చేసుకొంటున్నాయి. రా, కాగితాలు, కలం తీసుకురా, వ్రాసుకొందువుగాని—"

"ఎక్కడ ఈ సభ?"

"దానవాయిగుంటలో."

"అక్కడ దోమ లుండవే. ఆరోగ్యకరంగా ఉండే తావుల్లో దోమలు సభ చేస్తవా?"

"అదే తమాషా—వాటికీ ఆరోగ్యకరంగా ఉన్న స్థలాలు కావాలిట—"

"ఈసంగతి నీ కెలా తెలిసింది?"

"రెండు దోమలు నా చెవిదగ్గిర చెప్పుకొంటూంటే విన్నాను."

ఇద్దరమూ బయల్దేరి వెళ్లాము దోమలసభకి.

౨

కుంటకు సమీపంలో ఒకదోమలపంపు ఎగురుతున్నది. చుట్టూ చెట్లు. ఆ ఎగరడంలో ఒకమోస్తరు శబ్దము పుడుతోంది. కుంటసమీపానికి వచ్చేటప్పటికి నా స్నేహితుడు "అయిపోతోంది, సభ, అయిపోతోంది" అన్నాడు.

"దోమ లింకా ఎగురుతూనే ఉన్నాయి" అన్నాను.

"ఎగురుతూనే అవి సభచేసుకోవడం" అన్నాడు. అని అక్కడ ఒకబండమీద కూర్చున్నాడు. కళ్లుమూసుకొన్నాడు. వింటూన్నట్లు అభినయిస్తూ "వ్రాసుకో" అన్నాడు.

అతడు చెప్పగా నేను వ్రాసింది ఇదిగో. ఇందులో ఏమీ మార్పులు చెయ్యలేదు. చెప్పింది చెప్పినట్లు వ్రాశాను. ఇందలి నిజానిజాలు బుద్ధిమంతులే తేల్చుకోవాలి.

"సోదర సోదరీ మణులారా — పవిత్రమైన గౌతమీ తీరాన్న జన్మించిన మనము తత్ప్రాంతములలోనే సభ చేసుకోక ఈ కుంటవద్ద సభ చేసుకోవడం మీకు వింతగా తోచవచ్చు. మనలను తరతరములనుండీ పోషించిన గౌతమి నేడు మన ఉదాసీనతకు కారణ మయిందని మనము విచారించవలసి ఉన్నది. కాని యీ మార్పుకు బాధ్యులము మనము కాము. పవిత్రమైన గోదావరిని కలుషితము చేస్తున్నది మానవులు. తత్ఫలము ననుభవిస్తున్నది మనము. మానవరక్తమే ప్రధానాహారముగా గల మన మాప్రాంతములందలి మానవరక్తమును గ్రహించడమువల్ల రుజాపీడితుల మాతున్నాము. ఆరోగ్యము చెడుతున్నది. అయితే దేశాంతరము పోరాదా అనే ప్రశ్న పుట్టనచ్చును.

"మన పూర్వులు సంపాదించిన ఈ క్షేత్రమును మనము నేడు కాదని విడిచి వెళ్లడము వివేకము కాదు. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అన్న పాతమాట సభ్యులకు కొత్తమాట కాదు. ఏ మహాక్షేత్రమును రాజరాజు, రెడ్డిప్రభువులు, నవాబులు పాలించి మన వంశమును పోషించారో, ఏ మహారాజ్యము చిరకాలమునుండియు ఆంధ్రత్వమునకు నిలయమై యున్నదో, ఏ పవిత్రభూమి శ్రీనాథాది మహాకవుల వాణి కాటపట్టయినదో అట్టి రాజమహేంద్రవరమును మన మెన్నటికైన విడిచిపోగలమా? ఒక్కమాట మరవవద్దని

సభ్యులను నేను మరీమరీ వేడుకొంటున్నాను. మన పూర్వీకు లను పోషించినది ఆంధ్రసామ్రాట్టయిన రాజరాజురక్తము. మన వంశమునకు ఆదిభిక్ష పెట్టింది ఆంధ్రకవితాపితయైన నన్నయ్యరుధిరము. మన కులములకు ప్రాపుగా నిలిచినది కవిసార్వభౌముడైన శ్రీనాథుని నెత్తురు. నానావిధ భక్ష్య భోజ్యముల ననుభవించిన మహారాజుల, మహావీరుల, మహా కవుల, గాయకగ్రామణుల, పతివ్రతాతిలకముల రక్తమే—వారి ఆంధ్రరక్తమే నేడు మన నాళములలో ప్రవహించుచున్నది. ఈమాటలు తలుచుకొన్న ఏ మశకశిఖామణి రక్తనాళ ములు ఉబుకవు, ఉడుకెత్తవు? మరవకండి, సోదరసోదరీమణు లారా, మరవకండి, మశకశేఖరులారా మరవకండి—మన మాంధ్రుల మన్నమాట మరవకండి. ఆంధ్రరక్తము మన నాళములలో ప్రవహించుచున్న దన్నమాట మరవకండి. ఆనాడు ఆంధ్రశత్రువుల రక్తము ఆంధ్రవీరుల కరవాలము లతోపాటు త్రాగినది మన తొండములే. ఉత్కళరక్తమును చవిచూచితిమి. యవనరక్తమును త్రాగితిమి. ఆంగ్లరుధిర మును రుచిచూచితిమి. అరవరక్తమును పానమొనరించితిమి. వలందులరక్త మెట్టి రుచి కలదో గ్రహించితిమి. ఆంధ్ర సామ్రాజ్యస్థాపనకు, తద్వ్యాప్తికి, స్థిరత్వమునకు మనమున్నా కారణ మన్నమాట మరవకండి. ఆంధ్రతటాకములు మన కాటపట్టులు. ఆంధ్రగిరులు మనకు విహారసీమలు. ఆంధ్రులు మన భోజనంబులు. వంశపారంపర్యముగా వస్తూఉన్న ఇట్టి హక్కులను వదలి స్థానభ్రష్టుల మైపోవుటకు మీరు ఇష్ట పడుదురా? ఆంధ్ర-దోమలారా! ఒక విన్నపము. భగవదను

గ్రహామువల్ల మన వంశము నాడునాటికి వృద్ధిచెందుచున్నది. చల్లనిరాజులు మన దేశము పాలిస్తున్నారు. మనపట్ల గౌరవాభిమానములుగల మన ఆంధ్రమానవ సోదరులు మన పట్టణమునకు పాలనకర్తలై ఉన్నారు. మన వంశాభివృద్ధికి కారణభూతులైన వారిపట్ల మనము కృతజ్ఞులమై ఉండవలెను. కిందటి జనాభాలెక్కలతో పోల్చి చూడగా నేడు మన జనసంఖ్య నూటికి నెయ్యిరెట్లు పెరిగినట్లు తేలుతున్నది. ఈవృద్ధికి మనము సంతోషించవలసినదే కాని ఒక ప్రమాదము మాత్రము సంభవించుచున్నది. మన జనసంఖ్య యింతగా పెరగడమువల్ల మనకు తగినంత ఆహారము దొరకడములేదు. అంతే కాకుండా ఈకాలపు మానవరక్తము తగినంత ఆరోగ్యకరముగా ఉండకపోవడము ఒక కారణం. దురాచారములకు లోనైన నేటి మానవులు తమ రక్తము మనకు సరిపడడము లేదనిన్నీ రోగకారణ మగుచున్నదన్నినీ గ్రహిస్తే బాగుండును. పురపాలకు లీ విషయము గ్రహింతురుగాక. ఇక మన కాహారము సరిపోకపోవడానికి కారణ మేమై ఉంటుందని శాస్త్రజ్ఞు లాలోచించగా తేలిన విషయం ఏమంటే—మానవుల జనసంఖ్య తగ్గుచున్నదట. అందుకు కారణము వారు సంతాననిరోధమును కొన్ని ఉపకరణములద్వారా చేసుకొంటున్నారట. ఈవిధముగా వారి జనసంఖ్య తగ్గి మన జనసంఖ్య పెరుగుతూ ఉన్నట్లయితే కొంతకాలానికి మనకు కూడు దొరకదేమో ననే భయము కలుగుతున్నది. కాబట్టి పెద్దల అనుమతిని నేను యువతీయువకులకు ఒక సలహా ఇస్తున్నాను. మానవుల మార్గమును మనమున్నూ అవలంబించి సంతాన

నిరోధమునకు ప్రయత్నిస్తే బాగుంటుందేమో ఆలోచించుండి. ('కూడదు, కూడదు' అని కేకలు.) తరువాత తమ చిత్తము.

"పైని నేను చెప్పిన వాక్యములవల్ల మనము మానవులపట్ల ఎంత అభిమానము వహించియున్నామో అందరికీ విదితమే. ఎంతటి ఆంధ్రాభిమానులమో సుగమ్యమే. ఇట్టి అభిమానపూరితులమైన మనయెడల మానవులు కృతజ్ఞులై ఉండవలెను గదా! మనలను సోదర సోదరీ భావముతో చూచుకోవలెను గదా! ఆంధ్రజనని గర్భోద్భవులమైన మనమున్నూ మానవులున్నూ ఏకోదరులవలె మెలగవలెను గదా. కాని అట్లు జరుగుచున్నదా? లేదు. ఇందు కెవరు కారణం? మన మెంతమాత్రమూ కాదని మన యంతరాత్మ మనకు బోధించుచున్నది. మానవులపై ఆధారపడి బ్రదుకవలసిన మన మెన్నడైన మానవులయెడ కృతఘ్నభావము వహించి ఉండగలమా? లేము. కాబట్టి యిట్టి స్థితికి కారణభూతులైన మానవుల నేమనవలెను? వారు కృతఘ్నులు కారా? అవివేకులు గారా? వారిని పోషించే ఆంధ్రగౌతమీనది మనలను పోషించుచున్నది గదా! వారిపై ప్రసరించే ఆంధ్ర వాయువులు మనపైనిన్నీ ప్రసరిస్తున్నవి కదా! వారి అస్థికల గర్భస్థము చేసుకొనుచున్న ఆంధ్రభూమి మన కళేబరములను కూడ గ్రహిస్తున్నది కదా? వారికి చాందినీయైన ఆంధ్రాకాశమే గదా మనకున్నూ మేలుకట్టై ఉన్నది? వారిపై తన కిరణముల ప్రసరించు ఆంధ్రసూర్యుడే గదా మనలనుకూడ

తనకిరణములలో ముంచుతున్నాడు! వారి రాజులే గదా మన రాజులున్నూ; వారి మహాకవులే గదా మన మహాకవులున్నూ; వారి కళాప్రవీణులే గదా మన కళాప్రవీణులున్నూ!

"ఈ సంగతి మానవులు గ్రహించారా? లేదు. సరి గదా మనలను వారి శత్రు కోటిలో చేర్చి అంతరింపజేయడమునకు ప్రయత్నిస్తున్నారు. ('సిగ్గు, సిగ్గు' అని కేకలు.) మన వలన వారికి క్రొత్తజబ్బులు పుట్టుతున్నవట—మలేరియాకు మనమే కారణమట; బోదకాళ్లకు మనమే కారణమట. ఇంకా ఏమేమో జబ్బులకు మనమే కారణమట—రాజరాజుకాలములో ఎన్నడైన ఇట్టిమాట పుట్టినదా? శ్రీనాథు డెన్నడైన యిట్టి యసత్యముల వక్కాణించియున్నాడా? పోతనమహానుభావు డెన్నడైన యిట్టి అవాచ్యముల పల్కి యున్నాడా? కృష్ణదేవరాయలనాడైన యిట్టి కింవదంతి పుట్టినదా? విన్నారా సోదరసోదరీమణులారా! నా అనుంగు ఆంధ్ర-దోమలారా! మానవులు మనపై పెద్దపెద్ద పుస్తకములు వ్రాసినారు! మన చిత్తరువులను అచ్చొత్తినారు! మనలను చంపు ఉపాయములను కనిపెట్టి ప్రచారము చేస్తున్నారు! ఇట్టి సందర్భములలో మనము చేతులు కట్టుకొని రెక్కలు ముడుచుకొని కూర్చొనవలసిన దేనా? 'చేతగానివాళ్లు మనిపించుకోవలసిన దేనా? ఆంధ్రరక్తము మీ నాళములలో ప్రవహించడము లేదా! గతించిన ఆంధ్రవీరుల ప్రతాపము మీ స్మృతికి తగలడము లేదా! మానవరక్తపానము మన జన్మహక్కు గాదా? భగవంతుని ఉద్దేశ మేమి? మనల నెందుకు పుట్టిస్త? మొదట మానవులను పుట్టించి వారి రక్తము త్రాగి బ్రదకమని భగ

వంతుడు మనలను తరువాత పుట్టించియున్నాడు గదా ? ఇట్టి జన్మ హక్కును మనము వదలుకోగలమా ? భగవదాదేశ మునకు వ్యతిరేకముగా నడచుకోగలమా? స్వామిద్రోహమున కొడి గట్టగలమా ? దేశద్రోహము చేయగలమా ?

"ఆప్తులారా ! ఈసందర్భమున మీ కోసంగతి జ్ఞాపకము చేస్తున్నాను. మన మూలపురుషులు పూర్వము అడవులలో సంచరించేవారు. తృణకాష్ఠజలసమృద్ధిగల ఆస్థలములలో వారు సుఖముగా దైవచింతలలో మునిగి ఉంటూండగా ఈ మానవులే వారిని పట్టణవాసమునకు రమ్మని ఆహ్వానము చేశారు ! అమాయకులైన మన పూర్వులు వారిమాటలు మన్నించి పట్టణములలో కాపుర మేర్పాటు చేసుకొన్నారు. ఇప్పుడు, యిన్నియుగములు గడచినతర్వాత ఈ మానవులు మనలను చంపుటకు—హత్య చేయుటకు ప్రయత్నిస్తున్నారు. చూచారా ఎంత కృతఘ్నులో ?

"వాదముకొరకు వారికి మనవల్ల జబ్బులు వస్తున్నవనే సంగతి ఒప్పుకొందాము. వారిలో కొందరిమరణమునకు మనమే కారణ మన్నమాట అంగీకరింతాము. అయితే ఆతప్పుకు ఇట్టిశిక్షలా విధించడం ? మన వంశక్షయము చేయుడమునకు మానవుడు పూనుకొంటాడా ? మనలను ఆబాలవృద్ధము అంతరింపజేస్తాడా ? ఇది న్యాయమేనా? ఈ మానవుడు మనల నెంతటి చేతగానివారిక్రింద కట్టివేసి నాడు? మనలో వీర్యము చచ్చినదనుకొంటున్నాడు కాబోలు! మన పరాక్రమ మంతరించిం దనుకొంటున్నాడు కాబోలు ! మనలోఆంధ్రత్వముఇంకిపోయిం దనుకొంటున్నాడుకాబోలు!

"కడుపుకక్కుర్తికి మనము మానవరక్తము త్రాగుతున్నా మన్నమాట మరవకండి. అది భగవదుద్దిష్టము కాకపోతే మన కీతుచ్ఛరక్తము కావలసివచ్చునా? ఈ మానవులేనా మహా రక్తముతో నిండినవారు? ఎందరులేరు. కాని మనము భగవంతునిఉద్దేశమునకు భిన్నముగా నడుచుకోలేము.

"ఇట్టి చిన్నతప్పుకు—నిజముగా తప్పు కాదు, మన జన్మ్రహాక్కు—మనలను మారణహోమము చేయదలచాడే మానవుడు! ఈ మానవుడిని ఏమి చేయవలసింది చూడండి అతడు చేసే తప్పులకు? నిష్కారణముగా ఏ కపటమూ ఎరుగని తియ్యాటి పక్షులను అతడు ఇష్టము వచ్చినట్లు చంపుతున్నాడే! దీని కేమిశిక్ష? అడవులలో సంచరిస్తూ తమ బ్రదుకు తాము బ్రదికే అనపరాధులైన మృగములను వధిస్తున్నాడే! దీని కేమిశిక్ష? తనపిల్లలతోపాటు తాను సాకి, పిమ్మట పక్షులను, మేకలను, గొర్రెలను పీకలు కోసి తింటున్నాడే! దీని కేమిశిక్ష? భగవంతునిసృష్టికి కళంకప్రాయుడై ఉన్నాడే! భగవంతుని శాసనములను బ్రద్దలు కొడుతున్నాడే! దీని కేమిశిక్ష? భగవంతుడు లేడూ? న్యాయాన్యాయ పరిపాలనము చెయ్యడూ?

"కాని సోదర సోదరీమణులారా! ఒక్కవిషయము మనవి చేస్తున్నాను. అది గుడ్డిలో మెల్ల. మనపై కత్తికట్టి మనలను సంహరించవలెనని పూనుకొన్న మానవుడు పుస్తకములు వ్రాయడముతోనూ, మన బొమ్మలు అచ్చొత్తించి ప్రదర్శించడముతోనూ, మనలను చంపే ఔషధములంట— వాటిని కనిపెట్టడముతోనూ తృప్తిజెంది ఊరుకొన్నాడు. ఇది

మనము సంతోషించదగ్గ విషయం. ఇందుకు మనము మానవులయెడ కించిత్తు కృతజ్ఞులమై ఉండవలెను. మానవు డెంత వాక్శూరుడో అంత కార్యశూరుడూ ఖడ్గశూరుడూ అయి ఉన్నట్లయితే మనకు నిలవ నీడ లేకుండా ఉండేది. కాని మన అదృష్టమువల్లను భగవదనుగ్రహమువల్లను అత డట్టివాడు కాడు. అందువల్ల మన కంతగా ప్రమాదము లేదు. ఆలోచించగా నాకు తోచినవిషయం ఏమిటంటే—ఈ మానవుడు బదుకుతెరువు కోసమని ఈపుస్తకాలు రాసుకొంటున్నాడే కాని నిజముగా మనపై ద్వేషభావము కలిగి కాదు! చూడండి ఎంతమంది మనపేరు చెప్పుకు బతుకుతున్నారో! పుస్తకాలు రాసేవాళ్లు, బొమ్మలు చెక్కేవాళ్లు, అచ్చువేసేవాళ్లు, సినిమాలవాళ్లు, మాజిక్ లాంతర్లవాళ్లు, ఆసుపత్రులవాళ్లు, ఆరోగ్యశాఖవాళ్లు, ఉపాధ్యాయులు, ఉపన్యాసకులు! ఇంతమందికి మనము జీవనాధారము కల్పిస్తున్నందుకు మనము గర్వపడవలెను; మానవులు మనయెడల కృతజ్ఞత చూపవలెను.

"పులిమీద పుట్ర అన్నట్లు ఈమధ్య ఆరోగ్యవారము లంటూ లేవనెత్తి ఈమానవులు మనలను నిందించడం మొదలుపెట్టారు. మన వంశనిర్మూలనము లక్ష్యముగా పెట్టుకొన్నట్లు ఉపన్యసించారు. ఇందువల్ల మనకేమి ప్రమాదము సంభవిస్తుందో అని చాలాభయపడ్డాము. కాని క్రియకు వచ్చేసరికి ఆరోగ్యవారోత్సవాలన్నీ ఉపన్యాసములతో అంతరించాయి. విందులతో సమాప్తమయ్యాయి. ఇట్టి ఆరోగ్య వారోత్సవాలలో మనమున్నూ హృదయ పూర్వకముగా

వారికి సాయపడి నిర్విఘ్నముగా అవి జరిగేటట్లు ముందు ముందు చేయవలెను. ఇట్టి ఆరోగ్యవారములు నిరంతరమూ జరపగలందులకై ఈసభతరఫున మానవులను నేను ప్రార్థిస్తున్నాను. అరవ ఉద్యోగస్థులు వచ్చి ఆరోగ్యవార సందర్భమున మనలను పారదోలవలెనని ఉపన్యాసము లిస్తూన్నట్లు తెలియుచున్నది. అరవవారి ఉపన్యాసాలకు బెదిరి పారిపోయే దుస్థితి యింకా ఆంధ్ర-దోమలకు పట్టలేదని మనవి చేసుకొంటున్నాను.

"సోదర సోదరీమణులారా! ఒక ముఖ్యవిషయమును గురించి నేను మీకు యింకను మనవిచేయవలసి ఉన్నది. మనము చిరకాలమునుండి పట్టణములో, అనగా పాతఊళ్లో, కాపుర మున్నాము. కాని మానవజన సమ్మర్దము చేతనూ ఆరోగ్యకరమైన మానవరక్తము మనకు దొరకనందువల్లనూ మనలో కొందరము ముఖ్యముగా ఆరోగ్యముకొరకై ఇన్నీసు పేట వలసపోయినాము. అక్కడకూడ పరిస్థితులు చెడినవి. అనారోగ్యము హెచ్చుతున్నది. వంశక్షేమము ప్రధానము కాబట్టి మనము — అధమపక్షము కొందరమైనను వేరొకచోటికి వలసపోవలసిన అవసరము గోచరించుచున్నది. ఆర్యాపురమూ, వీరభద్రపురమూ, మన మిప్పుడు సభ చేసిన దానవాయిగుంటా వాసయోగ్యములని వింటున్నాను. తీరా ఆరోగ్యము చెడ్డతరువాత చేసేదేమిన్నీ లేదు. కాబట్టి ఇప్పుడే జాగ్రత్తపడడము మంచిది. 'శరీర మాద్యం ఖలు ధర్మసాధన' మ్మని గదా పెద్దలు చెబుతారు.

అరుగో, అరుగో, మానవులు; చుట్టుకోండి, వాలండి, పొడ వండి, తాగండి రక్తం..................."

నా స్నేహితుడు తటాలున లేచి "రా, రా, పారి పోదాం రా! మన్ని చూచాయి ఈ దోమలు. ఇక్కడ నిలిస్తే బతక నివ్వవు. రా, రా" అంటూ నన్ను లాక్కుపోయాడు. ఈలోపుగానే వందలాది దోమలు మామీద పడి చెడ కుట్టాయి. బతుకు జీవుడా అంటూ ఏలాగైతే నేమి యింటిలో వచ్చి పడ్డాము.

నా స్నేహితుడు ఎవరో తెలుసుకోవాలని పాఠకులు పరిశోధనలు చెయ్యవచ్చు. అతగాడిపేరు చెప్పడానికి పీలు లేదు. కాని అత డింకా యోగాభ్యసం చేస్తూనే ఉన్నాడు. జంతుహృదయాలు తెలుసుకొంటూ ఉన్నాడు. అత డిప్పుడు నెల్లూరులో ఉన్నాడు. సాయంకాలాల్లో పెన్నఒడ్డున షికారు చేస్తూఉంటాడు. చేపల సంభాషణ తెలుసుకోడానికి ప్రయ త్నిస్తూన్నట్లు మొన్ననే ఉత్తరం వ్రాశాడు. పర్యవసానం ఇంకా తెలియలేదు. ఇప్పటి కింతటితో సరి.

తాజాకలం — చివరకు దోమలసభ ఏమైనదో, అవి ఎట్టి తీర్మానాలు చేసుకొన్నాయో తెలియదు. కాని దేశ ములో దోమలబాధ మాత్రం ఎక్కువైనది.

1935

# పాకశాస్త్రపరీక్ష

"అమ్మాయీ, - చంటిపిల్ల ఏడుస్తూ ఉంది. కొంచెం ఎత్తుకో అమ్మా" అని కేకవేశాను. మా అమ్మాయి గదిలో కూర్చుని తదేకధ్యానంగా చదువుతూ మాట్లాడలేదు ఏమి చదువుతూ ఉందో అని జాగ్రత్తగా విన్నాను. ఈవిధముగా చదువు వినిపించింది.

"వంగకాయకూర నాలుగు విధంబులు. వంగకాయ కూర నాలుగు విధంబులు. పులుసుకూర, ఇగురుకూర, పప్పు కూర, కారపుగూర - పులుసుకూర, ఇగురుకూర, పప్పు కూర, కారపు గూర. కారపుగూరకు నెండుమిరెపకాయలైనను బచ్చిమిరెపకాయలైన నుపయోగింపందగు"

మళ్లీ మా అమ్మాయిని పిలిచాను.

"తీరుబడి లేదు నాన్నా. ఈవేళ పరీక్ష" అంది.

"ఏం పరీక్షమ్మా" అన్నాను.

"పాకశాస్త్రపరీక్ష-చదువుకొంటున్నాను,నాన్నా"అంది.

మారోజుల్లో పాకశాస్త్రపరీక్షలు లేవు. కనుక్కోగా తేలినవిషయం ఏమిటంటే : ఈ కాలంలో పాకశాస్త్రంమీద శాస్త్రపరీక్షే కాకుండా ప్రత్యక్షంగా వంటచేసే పరీక్షకూడా ఉందని తేలింది. నిజంగా ఈకాలములో ఇదొకకొత్తలాభం మనకు చేకూరిందని సంతోషిస్తూ మా అమ్మాయి పాక శాస్త్రపారీణతను వినియోగపరిపించాలని ఆలోచించినాను. పూర్వకాలపు ఆడవాళ్లు — అంటే పాకశాస్త్రాదులు బళ్లల్లో

చదవని రకంవాళ్లు....వంటచేస్తే మనముపడే అవస్థలు వేరే బహిరంగంగా చెప్పడము వివేకము కాదు. ఇక పాకశాస్త్ర పరీక్షలో ఉత్తీర్ణులైన యీకాలపు ఆడవాళ్లు నిజముగా వంటంటూ చేస్తే——అది నలపాక భీమపాకములను మించి ఉంటుందని వేరే చెప్పక్కర్లేదు గదా! ఇంతే కాకుండా ఇంకోవిశేషం. ఇదివరదాకా అష్టమైనవాళ్లూ వంటచెయ్యడమే! ఆడదై పుట్టిందీ అంటే పెళ్లి చేసుకోవడం ఎంత సహజమని భావిస్తున్నారో వంటచెయ్యడము కూడా అంత సహజమని భావిస్తున్నారు. నిజానికి వంటఅనేది ఒక 'లలిత కళ' అనే విషయం ఇంతవరకూ ఎవరూ కనిపెట్టలేదు.

ఇప్పుడు పాకశాస్త్రపరీక్షలు చేసి కృతార్థులైనవాళ్లకి తగిన సర్టిఫికేట్లు ఇచ్చి, 'ఇటువంటి సర్టిఫికేట్లు ఉన్నవాళ్లే వంటచేయుడమునకు అర్హులు, మిగిలినవాళ్లు కారు. 'అర్హులు కానివాళ్లు వంటచేసినట్లయితే పీనల్‌కోడు (నూతన ముద్రణము) ప్రకారము శిక్షాపాత్రులు' అని నిర్ణయము చేయడమువల్ల పాకశాస్త్రమునకు మిగిలిన శాస్త్రములకు వలెనే గౌరవస్థానం లభించిందని ఊహించవచ్చు.

ఈవిధంగానే ముగ్గులశాస్త్రం, అలుకుశాస్త్రం మొదలైన శాస్త్రాలలో పరీక్షలు పెట్టి అందులో నెగ్గినవారే ముగ్గులు పెట్టడానికీ, ఇళ్లూ, వాకళ్లూ, గోడలూ అలకడానికీ అర్హులని ఏర్పాటు చేసినట్లయితే——ఈ విధంగా కొంతవరకు భరతదేశానికి శ్రేయస్సు కలగవచ్చును.

పాకశాస్త్రానికి వలెనే ముగ్గులశాస్త్రానికీ, అలుకుశాస్త్రానికీ కూడా తెల్లదొరలే తగిన పుస్తకాలు వ్రాసినట్లయితే

మరీ భేషుగ్గా ఉంటుంది.

ఇక మా అమ్మాయి సంగతి—

పాకశాస్త్రపరీక్ష కని మా అమ్మాయి ఇంట్లో పనులు ఏమీ ముట్టుకోకుండా రాత్రి ఒంటిగంటదాకాను, పగలు పగలంతాను కష్టపడి చదివి చదివి ఎలాగైతేనేమి పరీక్షకు వెళ్లింది.

పరీక్షలో ఏమి వ్రాసిందో ఏమి మానిందో గాని ఇంటికిమాత్రం ముఖమంతా చిరునగవుతో వచ్చింది.

"అమ్మాయీ, పరీక్ష ఎలాగ వ్రాసావు" అన్నాను.

"చాలాబాగా వ్రాశాను నాన్నా" అంది.

"శాస్త్రపరీక్షలో ఇచ్చిన ప్రశ్న లన్నింటికీ సమాధానం వ్రాశావా" అన్నాను.

"వ్రాశాను - కాని ధనియాలకి పాకశాస్త్రములో ఉన్న స్థానము వ్రాయమన్నారు - అదిమాత్రం వ్రాయ లేదు నాన్నా - తెలిసిందికాదూ."

"ప్రాక్టికల్ పరీక్షో" అన్నాను.

"అల్లం పెసరెట్టు వెయ్యమని ప్రశ్న యిచ్చారు నాన్నా. కొంచెం మాడింది గాని 'మినిమం' పరీక్షమార్కులు వస్తాయినాన్నా" అంది.

"ఒక్క పెసరెట్టేనా, ఇంకా ఏమైనా వండమన్నారా" అన్నాను.

"ఛాయస్ ఇచ్చారు నాన్నా. అల్లం పెసరట్టేనా సరే, లేకుంటే అరటికాయబజ్జీ అయినా సరే."

మా అమ్మాయి తన పరీక్ష పత్రాలు నాచేతిలో పెట్టింది.

పాఠకులుకూడా కుతూహలంతో ఉంటారు కాబట్టి వాటిని వారికికూడా చూపిస్తాను.

## శాస్త్రపరీక్షలు

### ౧. పాకశాస్త్రపరీక్ష (శాస్త్రభాగము)

మూఁడుగంటలు

౧. వంగకాయ పులుసు ఇగురుకూరలకు భేదమేమి? వంగకాయతోఁగూడ నేయేకాయగూరలను నాకుగూరలను జేర్చి వండవచ్చును?

౨. (అ) మనము సాధారణముగా నుపయోగించు వానిలో నేకాయగూరలు, నే దుంపకూరలు, నేయాకు గూరలు పచ్చడిఁ జేయుటకై పనికివచ్చును?

(ఆ) నల్లేరువడియంబులఁ బెట్టువిధానంబును బూర్తిగా వ్రాయుడు.

౩. (అ) అన్నమును వార్చునప్పుడు చేయిపట్టుకొనుట కేయేవస్తువు లుపయోగింప వచ్చును.

(ఆ) పులుసునకుఁ బెట్టిన తాలింపు చారునకుఁ బనికి వచ్చునా?

(ఇ) కారపు గారెలకును, వడలకుంగల భేదసాదృశ్య ముల నెఱిగింపుడు.

౪. (అ) ఏయే కూరలలో గరివేపాకు వెయ్యవచ్చును? వేనిలో వేయరాదు?

(ఆ) ఇంగువ, ఆవాలు, మెంతులు, మిరియాలు, ధని యాలు, జీలకర్ర — పాకశాస్త్రమున వీనికిగల స్థానంబుల నిర్ణయింపుడు.

౫. (అ) దక్షిణాదివారి చారునకును, ఆంధ్రుల చారునకును గల భేదములను విశదీకరింపుడు.

(ఆ) పప్పుకూరలలో నెయ్యేది మిక్కిలి రుచికరమైనదో సకారణంబుగ నిర్ణయింపుడు.

౬. కుక్కుటము, హారిణము, ఛాగము, లావుకపిట్ట, పావురము — పాకకళ కివి యెట్లు తోడ్పడుచున్నవి!

౭. (అ) అజీర్ణవ్యాధి ఎందువలన కలుగుచున్నది. దానిని వారించుమార్గము లెయ్యవి?

(ఆ) అజీర్ణవ్యాధిచే బాధపడు ముగ్గురు ఆంధ్రకవులు, ఇద్దరు న్యాయాధిపతులు, పదుగురు ఆంధ్రవైద్యులు, పదునేనుగురు న్యాయవాదులు—వీరిపేర్లను వ్రాయుడు.

౮. (అ) గోగుకూర, దోసకాయ, పనసకాయ, మామిడికాయ—ఏ దేశమందు ఫలించునవి మిక్కిలి రుచికరముగా నుండును?

(ఆ) ష్టవ్ వంట, కుక్కరువంట, సాదావంటల మంచిచెడ్డల నిర్ణయింపుడు.

## శాస్త్రపరీక్షలు

### ౧. పాకశాస్త్రపరీక్ష : ప్రాక్టికల్

#### మాంధుగంటలు

[షరా; ఈ క్రింది ప్రశ్నలను బాగుగా చదువుకొని ఒకప్రశ్న మాత్రమే యత్నించవలెను. కారము, ఉప్పు ఎక్కువగాని తక్కువగాని యున్నచో గుణములు తగ్గించబడును.

౧. అల్లపు పెసరట్లు నయిదింటిని వేయుము. [పెసరి పప్పు కొలతయును అందులో వేయు పదార్థముల మానమును వ్రాయవలెను. పెసరట్లు దోరగా వేగవలెను.]

లేక

౨. అరటికాయ బజ్జీలను అయిదుగురకు సరిపోవు నట్లు తయారుచేయుము.

[బజ్జీలకు కావలసిన వేర్వేరు పదార్థముల మానమును సూచింపవలెను.]

పరీక్షపత్రాలు చదువుకొన్నాను. సంతోషించాను.

కొన్నాళ్లవరకూ మా అమ్మాయి పరీక్షపత్రములు దిద్దేవాళ్ల ఇళ్లకు తిరగడముతో సరిపోయింది. చివరకు ప్రాక్టికల్ పరీక్షలో పోయినట్లూ శాస్త్రపరీక్షలో బాగా మార్కులు వచ్చినట్లూ — మొత్తంమీద ఎలాగైతేనేమి పరీక్ష ప్యాసైనట్లూ తెలిసింది.

"ప్రాక్టికల్లో ఎందుకు పోయిందమ్మా" అని మాఅమ్మాయిని అడిగాను.

"అయిదుగురు జడ్జీలకి అయిదు పెసరట్లు వేయించుకొన్నారు..—"

"అయిదుగురు జడ్జీలేమిటి?"

"మరి ప్రాక్టికల్ పరీక్షలో సరిగా వ్రాసిందీ లేనిదీ చూడడానికీ, వండిన పదార్థాలు రుచిగా ఉన్నదో లేదో చూడ్డానికీ జడ్జీ లక్కరలేదు నాన్నా?"

"ఈ అయిదుగురూ రుచిచూచి మార్కులిస్తే వాటినిబట్టి పరీక్షాఫలం నిర్ణయిస్తారా?"

"అయిదుగురు యిచ్చిన మార్కులూ కలిపి సరాసరి చేసి అప్పుడు నిర్ణయిస్తారునాన్నా."

"సరే ఏమి జరిగింది?"

"అయిదుగురూ కూర్చుని అయిదు పెసరట్లూ తినడానికి మొదలెట్టారుట."

"ఏం జరిగింది."

"తినలేక పోయారట."

"ఎంచేత ?"

మా అమ్మాయి సందేహంగా చెప్పింది, "కారం ఎక్కువై తినలేక అరగంటదాకా నోరు స్వాధీనం అయింది కాదట."

"అంత కారం ఎందుకు వేశావమ్మా."

"మిరపకాయలు తూచడంలో పొరపాటువచ్చింది నాన్నా. ఒక ఔన్సు పచ్చిమిరపకాయలూ, పాతిక ఔన్సు ఎండు మిరపకాయలూ వెయ్యడానికి బదులు తప్పుతూనికరాయి తీసుకోవడంవల్ల ఎక్కువకారం పడిందినాన్నా."

"ఎన్ని ఔన్సులు వేశావు."

"ఎనిమిది ఔన్సులు పచ్చిమిరపకాయలూ, రెండు ఔన్సులు ఎండు మిరపకాయలూ వేశాను."

"పోనీలే - ఎలాగో ప్యాసయ్యేవు అదీ కావలసింది" అన్నాను.

"పొరపాటు వచ్చింది కాని - అసలు చాలా బాగా వండుతాను నాన్నా" అంది మా అమ్మాయి.

"సరే, ఒకమాటు నీవంట చూపిద్దువుగాని" అన్నాను.

"ఎప్పుడు; నాన్నా, ఎప్పుడు."

"చెప్తాతాలే" అన్నాను.

ఇంట్లో పొయ్యిమీద మామూలుగా వండుతుం దను కొన్నాను మా అమ్మాయి. కాని ఆవిధంగా తాను తరిఫీతు కాలేదనీ తాను తరిఫీ దైన విధంగా వంటచేయడానికనీ పాతిక రూపాయలు నాచేత ఖర్చు పెట్టించింది.

మిరపకాయలూ, ఉప్పూ, ఆవాలూ, మెంతులూ, కరివేపాకు మొదలైనవి తూచడానికి ఒక సున్నితమైన తులా మానమూ, "గ్రాము" తూనికరాళ్లు ఉండే పెట్టీ కొన్నాను. బియ్యములోనూ, పప్పులోనూ, కూరలలోనూ, పచ్చళ్ల లోనూ, ఉప్మా మొదలైన వాటిల్లోనూ పొయ్యడానికి నీళ్లు కొలవడానికి రెండు మూడు రకాల గాజుకొలతపాత్రలు కొన్నాను.

పోగుపులకు నూనె, నెయ్యి కొలవడానికి చిన్న ఔన్సుగ్లాసు కొన్నాను.

అన్నంగిన్నె, పప్పుగిన్నె, పెనము, బూర్గెమూకుడు మొద లైనవి పట్టుకోవడానికి నాలుగైదు రకాల పట్టకార్లుకొన్నాను.

ఉష్ణోగ్రత తెలుసుకోడానికి రెండు మూడు రకాల థెర్మామీటర్లు కొన్నాను.

ఇంకా మా అమ్మాయి చెప్పిన చిల్లర వస్తువు లేవేవో కొన్నాను.

ఈసాధనసామగ్రి సంపాదించుకొని మా అమ్మాయి తనవంటనేర్పు నాకు చూపించ వలెనని తగిన సమయము కోసం వేచి ఉంది.

తగిన తరుణంకూడా త్వరలోనే వచ్చింది.

*　　　*　　　*

తాను బి. యల్. పరీక్ష చదవడానికి నేను డబ్బు ఇస్తానేమో నని కనుక్కోడానికి వచ్చాడు మాఅల్లుడు. మొట్ట మొదట ఈ విధంగా సామోపాయంవల్ల ప్రయత్నం చేసి, నెగ్గకపోయినట్లయితే భేద, దండములు ప్రయోగించవలెనని అతగాడి అభిప్రాయమైనట్లు నేను గ్రహించాను.

అల్లుడు వచ్చిన ఇటువంటి తరుణం ఊరికే పోనివ్వడ మెందుకని ఆరోజున మా అమ్మాయిని వంటచెయ్యమన్నాను. మా ఆవిడను చూస్తూ ఉండమన్నాను. మా అల్లుడికి ఇష్ట మైన పిండివంట గారెలు వండమన్నాను. మా అమ్మాయి వంటచెయ్యడం ప్రారంభించింది. రెండుస్టవులు వెలిగించింది. బర్రుమని శబ్దం చేస్తున్నాయి. తులామానంతో బియ్యం తూచింది. గాజుపాత్రతో నీళ్లు కొలిచిపోసింది. తను కొలిచిన మినప్పప్పు నానేసి తల్లిని రుబ్బమంది. నన్ను ఆవాలూ, జీలకర్రా మెంతులూ రెండేసి డ్రాముల చొప్పున కొంచెం తూచిపెట్టమంది.

"అమ్మాయీ, పప్పులో నీళ్లు చాలవే" అని తల్లిఅంటే, "నీకు తెలియదు ఊరుకో అమ్మా; ౨౫౦ గ్రాముల కందిపప్పుకి ౨౦౦ క్యూబిక్ సెంటిమీటర్ల నీళ్ల చొప్పున పోశాను. తక్కువలేదు" అంది మా అమ్మాయి.

బియ్యంలో నీళ్లు ఎక్కువ అయ్యాయనీ, కూరలో ఎక్కువ మెంతులు పడ్డాయనీ, పులుసులో ధనియా లక్కర్లేదనీ తల్లి చెప్పితే తల్లితో ఘర్షణ పడింది. దాని ఇష్టము వచ్చి

వట్లు చెయ్యనివ్వమనీ, ఏమీ అడ్డు చెప్పవద్దనీ తల్లిని నేను మందలించాను. ఎలాగైతే నేమి ఒక గాజుపాత్రా, రెండు థేర్మామీటర్లూ బద్దలుకొట్టి అయిదారు గంటలలో మా అమ్మాయి వంటచేసి ఒగుర్చుకొంటూ వెళ్ళి తనగదిలో కుర్చీలో కూర్చుని పాకశాస్త్ర గ్రంథము తిరగవేస్తూ తాను సరిగా వండినదీ లేనిదీ సరిచూచుకొంటోంది. మా ఆవిడ వడ్డించింది, మా అల్లుడికీ, నాకూ.

అంతవరకూ ఉత్సాహంగా మాట్లాడు తున్న మా అల్లుడు మొదటిముద్ద నోటిలో పెట్టుకొన్నది మొదలు చివర దాకా ధుమధుమ లాడుతున్నాడు.

తనభార్య పాకశాస్త్రపరీక్ష ప్యాసయిందనీ, అదే ఆరోజున వంట చేసిందనీ నేను చెప్పినా అతడు సుముఖుడు కాలేదు.

అర్ధాకలిగా లేచిపోయి, బి. యల్. చదువుకు డబ్బు అడగకుండానే అతగాడు సాయంత్రం బండిమీద ఇంటికి వెళ్ళి పోయాడు.

“అతని కేం కోపం వచ్చిందో గారెముక్కైనా ముట్టు కొన్నాడు కాదు. ఎందుకో కనుక్కోండి” అంది మా ఆవిడ.

“ఎందుకు కోపం?” అన్నాను.

“అన్నం చిమిడింది, పప్పు ఉడకలేదు, కూర చేదుగా ఉంది, గారెలు కొన్ని మాడాయి, కొన్ని అసలు ఉడకనే లేదు — అతడు ఏమనుకొన్నాడో, పాపం” అంది.

“భార్యవంటే నచ్చకపోతే—పాకశాస్త్రపరీక్ష ప్యాసయిన

భార్యవంటే నచ్చకపోతే అతనికి ఎవరివంట నచ్చును" అన్నాను.

మా అమ్మాయి మా మాటలు విన్నది. తనభర్త ఏమీ అననిదే మేమే అతనికి అన్నిమాటలూ ఆరోపిస్తున్నామని భావించింది. కోపంవచ్చి అన్నదికదా "ఇలాగు పరీక్షలో వండి ఉన్నట్లయితే తప్పకుండా ఫస్టుక్లాసులో ప్యాసై ఉందును. ఎంత బాగా వండినా బాగాలేదంటున్నారు — పోనీ, లెండి" అని కంట తడిపెట్టి ఏడ్చింది. అనలేదు కాని తన భర్త తిండి తినకుండా లేచిపోవడానికి మేమే కారణమని మా అమ్మాయి ఊహించినట్లు స్పష్టము.

1931

# అగ్రాసనాధిపత్యము

౧

ప్రొద్దున్నే లేచి, లేచీలేవడంతోనే పిల్లిముఖమూ, నితంతువు ముఖమూ, దాసీదానిముఖమూ చూడకుండా, ఏ పునిస్త్రీ ముఖమో, లేకపోతే, యిష్టంగావున్నట్లయితే సొంత భార్యా ముఖమో, తులసెమ్మ ముఖమో చూచి, ఈ రోజుమట్టుకు ప్రపంచకంతో మనము ఖులాసాగా కాలక్షేపం చేయ వచ్చును గదా అనుకొని, కాలకృత్యములు తీర్చుకొని, కాఫీ పుచ్చుకొని, "ఈజీ" కుర్చీలో కూచుని న్యూసుపేపరులోని బొమ్మలలో, ప్రకటనలో చూసుకుంటూండగా ఈసుఖోన్న తికి ఆటంకంగా ఎవరో వీధిగుమ్మందగ్గిరకు వచ్చి "ఫలానా వారున్నారండీ" అని పిలుస్తారు. ఈజీకుర్చీలోంచి లేవడానికి బద్ధకించి "ఎవరువారు? లోపలికి రావచ్చు" అంటాము. క్రాపింగు దువ్వుకొని, కరెక్టుడ్రెస్సు వేసుకొని, ఒక పెద్ద మనిషి ప్రవేశించి సలాంచేసి ఎదురుగా నిలబడుతాడు.

"అలా దయచెయ్యండి. ఎవరికోసం తమరు?"

"తమకోసమే వచ్చానండి. ఈవేళ మాస్కూల్లో డిబే టింగు సొసయిటీ మీటింగండి. (లేకపోతే) ఈవేళ టవున్ హాలులో మీటింగండి. తమరిని అగ్రాసనాధిపతిగా వుండ మని కోరడానికి వచ్చేనండి" అంటాడు.

"నేనేమీ లోకానికి అపకారం చెయ్యలేదే! నాఖర్మాన్ని నేను బతుక్కుపోతుంటే యీ ఉపద్రవ మేమిటి? ఎవడిమట్టుకు

వాడు బ్రతుకుతూవుంటే ఈలోకంలో ప్రజలు వాడిని ఆలాగ బ్రదకనివ్వరేమి?" అని మనస్సులో అనుకొని పైకిమాత్రం గౌరవంగా "అయ్యా మీాస్కూలుసంగతి నాకు ఏమీా తెలియదు. మీాకో స్కూలు ఈవూళ్లో వుందనే సంగతే మీారిప్పుడు చెప్పిందాకా నాకు తెలియనే తెలియదే! ఆలాగంటి సందర్భంలో మీాస్కూలు మీాటింగుకు నేనగ్రాసనాధిపతిగా ఎట్లాగ వుండగలను" అంటాము. అంటే ఆ ఆసామీా ఏమైనా వెనక్కు తగ్గుతాడా. వాదనప్రారంభిస్తాడు. ఆర్గ్యూ చేస్తాడు. బంకనక్కిరికాయలాగ పట్టుకు వదలడు. ఉచితానుచిత జ్ఞానం ఏమైనా వుంటేనా ?

"అయ్యా! మీాకు స్కూలు తాలుకుయావత్తు సంగతులూ మేము తెలియజేస్తాము. తప్పక మీా రుండితీరాలి"

"ఈగొడవలు తెలిసేవాళ్ళను కోరక నాదగ్గర కెందుకు వచ్చావయ్యా"

"అలాగ గాదండి. తమరు తప్పకుండా ప్రెసయిడ్ చెయ్యాలి. నే నందర్నీ అడిగేను. ఎవరుమట్టుకు వారు ఏదో పనుందంటున్నారు. తమరుకూడా అలాగు సెలవి స్తే యింక విద్యావ్యాపకము విద్యాభిమానమూ—" ఇంకా ఏమేమో యీాధోరణిని చెప్పుతాడు.

అతని వుద్దేశంలో నేను అగ్రాసనాధిపతిగా వుండడానికి వప్పుకోకపోవడం చాలా హీనమైన నేరముగా పరిణమించి నట్లు స్పష్టము.

పోనీ తీరామొహమాటపడి వొప్పుకుంటామయ్యా. ఏమిటి దానికి పర్యవసానం? కోటుబూటూ తలపాగా తగిలించుకొని

కట్టి చేత్తో పుచ్చుకొని చిరునవ్వులు నవ్వుకుంటూ సభా భవనము ప్రవేశించడం! ఈ చిరునవ్వు నిజంగా సంతోష సూచకము కాదు. ఇది విషపు చిరునవ్వు. మనస్సులో నిజంగా వున్నది బెంగ. మానవజాతిపై అసహ్యము, విరోధము. అందరూ వచ్చి సభ నలంకరించిన పిమ్మట—అలంకరించడం అంటే నిజంగా అలంకారము కాదు. కుర్చీలు నింపి కునికిపాట్లు పడడము. పెడతారన్న ఫలహారాలు యింకా పెట్టరేమి అనే ధుమధుమలు. ఎప్పటికి మీటింగు అంతమవుతుందో గదా ఎప్పటికి ప్రజలలో పడతామో అనే ఆదుర్దా—అందరూ వచ్చి సభ నలంకరించిన పిమ్మట ఒకడు లేచి వెఱ్ఱినవ్వునవ్వుతూ—

"ఫలానావారిని నేనగ్రాసనాధిపతిగా ఉపపాదిస్తున్నాను. అంటాడు. ఇంకోడు కుర్చీలోంచి సగం లేచి "నేను సెకండు చేస్తున్నా"నంటాడు. అందరూ చప్పట్లుకొడతారు. ఈవిధంగా నాటకం సాగుతుంది. ఇంక అగ్రాసనాధిపతో! తాను ఎప్పుడూ అనుకోని, తాను నిజముగానమ్మని విషయములను చేర్చి విద్యమీద పెద్దఉపన్యాసం చేస్తాడు. పెద్దపెద్ద బోధలూ ఉపదేశాలూచేస్తాడు. తాను ఆకాశాన్నుంచిఊడిపడ్డట్టూసభికులందరూ మానవమాత్రులైనట్టూ నటిస్తాడు. ఉపన్యాసం ముగుస్తుంటే. అతడు సంతోషిస్తాడు. ఎందుకని? అమ్మయ్యా ఈగండం గడిచిందికదా అని! "ఈ గండం గడిచి ఈ పిండం బయటపడితే మొగుడుపక్కలో ముద్దులు పెడతానం"దట ఒక యిల్లాలు. ఆలాగుగా ఇతడుకూడ ఇంక బ్రతికివుండగా అగ్రాసనాధిపత్యం చెయ్యకూడదు అని దృఢసంకల్పం చేసుకుంటాడు. కాని ప్రజ లూరుకుంటారా! ఇంకో రెండురోజు

లకి మళ్ళీ యింకోచోట అగ్రాసనాధిపత్యము.

ఊరేగింపులూ, పూలదండలూ, కరతాళధ్వనులూ, యీ గౌరవములు పొందిన ఆసామీ తనఉచ్చస్థానము నిలుపుకొని, చెప్పుచేతలలో వుండే పదిమంది సహాయం పొందుతూవుంటే బాగుండును. ఆలాగు కుదరదే. తెల్లవారిలేస్తే యీ అగ్రాసనాధిపతి బజారుకు వెళ్ళి ఒకచేత్తో నేతిచెంబూ, ఒకచేత్తో తెలకపిండీ, చంకలో ములకకాడలూ, బుజాన వంకాయలమూటా మొయ్యవలసివస్తోంది. అతడు బుర్ర వంచుకు నడిచేడంటే అతనిదా తప్పు!

కాని అగ్రాసనాధిపత్యం అందరికి యీమోస్తరుగా వుండదు. ప్రతివూళ్లోనూ కొందరు పెద్దమనుష్యులు, తినడానికి కాస్తవున్నవాళ్లు, యీ వుద్యోగానికి దేవుళ్లాడుతూ వుంటారు. దీనిని వారు ఒకవృత్తిగా ఏర్పాటుచేసుకున్నారు ఇతరవృత్తులు లేకపోబట్టి. ఈ తెగ మనుష్యులు ఎక్కడేనా మీటింగులు పెడతారా, ఎక్కడికేనేమన్ని పిలుస్తారా, అని రోజురోజూ వుబలాటపడుతూవుంటారు. ఈ జాతి మానవులు ఎక్కడేనా మీటింగులు లేక కొంచెం మార్కెటు మందగించినట్లయితే క్రొత్తసభలూ క్రొత్తసంఘాలూ లేవదీస్తారు. 'అఖిలభారత మేకలసభా', 'అఖిలభారత చింతగింజలసభా,' 'సర్వాంధ్ర దర్జీసభా,' యిత్యాదిసభలు! సంఘాధ్యక్షులతో, సంఘోపాధ్యక్షులతో, కార్యదర్శులతో, కార్యనిర్వాహక ఉపసంఘములతో బయలు దేరుతాయి. మీటింగులమీద మీటింగులూ ఈమానవులకు పండుగ. ఈ జాతిమనుష్యు

లుపదేశింపలేని విషయములులేవు. వారికి తెలియని విష
యము లంతకన్నాలేవు.

రాచకీయసభలు కానీయండి, సాంఘికసభలు కానీయండి, సంగీతసభలు కానీయండి, సాహిత్యసభలు కానీయండి, ఏవేనాసరే అగ్రాసనాధిపతులుగా ఉండడానికి వీరుతయారే !

వీరిట్లుండుటకు వుద్దేశము దేశోద్ధరణమే అని కొందరంటారు.

కాదుకాదు, వీరి ప్రయత్నములకు పరమావధి బిరుదులని కొందరంటారు. ఈ జాతిమనుష్యులు ప్రతివూళ్ళోనూ వుండబట్టే మనబోటి ఏమీ ఎరగని మంచివాళ్లకు ఉపద్రవాలు సంభవిస్తూ వుంటాయి. వారికి జబ్బుచేసినా వారు యితర గ్రామాల్లో అగ్రాసనాధిపత్యం చెయ్యడానికి వెళ్లినా యీ ఉపద్రవం మనమీాద వచ్చి పడుతుంది.

౨

"శాస్త్రమపారమైనది. కాలము పరువులెత్తుకుపోతోంది" అన్నాడు ఒక ఆంగ్లకవి. మనవంశములోవున్న ఈ తక్కువ కాలాన్ని అగ్రాసనాధి పత్యములక్రింద వృధపుచ్చకుండా ఏదో లోకోపకారకమైన కార్యములను చెయ్యడానికి ప్రయత్నించవలసినభారము ప్రతివానిమీాద వున్నది.

ఈసంగతి గుర్తెరిగి సత్కార్యములకై కాలమును వినియోగము చేస్తూన్న ఒకపెద్దమనిషివున్నారు. ఆయన అసలు పేరు సత్యనారాయణశాస్త్రి. అయినప్పటికీ ఆయన తరుచు అష్టావధానముచేస్తూ వుండడాన్నిబట్టి ఆయనపేరు అష్టావధాని అయిపోయినది. ప్రతివాడూ ఆయనను అష్టావధాని

అని పిలుస్తూవుంటారు. ఆయన బాగా చదువుకొన్నవాడనీ మంచికవిత్వం చెప్పుతాడనీ చాలా ప్రసిద్ధి. ఈయునికి సత్పాండిత్యముకలగడానికి ప్రధానకారణము ఆయనతండ్రిగారే. తండ్రిగారు తెలుగులలో మంచిప్రవేశంకలవాడుకావడంవల్ల కుమారుడిచేత చిన్నప్పుడే కావ్యాలన్నీ వల్లెవేయించినాడు. అరసున్నలుండే దేశ్యపదాలన్నీ బట్టవేయించినాడు. శకటరేఫలన్నీ మాటలపే ర్లన్నీ పద్యరూపకంగా వల్లె వేయించినాడు. తాళ్లపాకవారి గ్రంథాలలోవున్న మాదిరిగా! ఆయనతండ్రిగారిది అంతపాండిత్యం. కొడుకుకుకూడా అంతపాండిత్యం వచ్చింది. ఈ అష్టావధానికి సారస్వత పరిశోధనలపై కొంత మట్టుకు బుద్ధిపారింది. కవిత్వంతోబాటు పరిశోధనలు చెయ్యడంకూడా మొదలుపెట్టేడు. ఈమధ్య ఆయన వ్రాసిన ఒకటి రెండు వ్యాసములు చాలా ప్రశంసనీయములు.

ఒకటి ఆయన ఆమధ్య పేదరాసిపెద్దమ్మమీాద ఒక వ్యాసం వ్రాసి పత్రికలలో ప్రకటించినాడు. వేగి పత్రికలో దానిని చాలా ప్రశంసించినారు. ఆవ్యాసమునుండి కొద్దివిషయము లీక్రింద నుదహరిస్తున్నాను.

"పేదరాసిపెద్దమ్మ చారిత్రికస్త్రీ. ముసలమ్మలకథలలో ఆవిడ ప్రధానస్థానము నాక్రమించుకొని వున్నది. కథకునకు ఆమె చాలా సహాయకారిణి. కథాసందర్భము చాలా కష్టదశకువచ్చి కథ జరగ కుండా వున్నసమయములో ఈపెద్దమ్మ ప్రవేశించి కథను అవ్యాహతంగా నడిపిస్తుంది. ఆమె సకుటుంబముగాకూడా కథకునకు సహాయము చేస్తూవుంటుంది. ఆవిడకు తెలియని భోగట్టాలేదు. ప్రయాణీకులు,

యాత్రికులు, పురుషులు, స్త్రీలు, జంతువులు, పక్షులు, అందరూ ఆమె సలహా పుచ్చుకుంటూనే వుంటారు. ఈకాలంలో, దిన, వార, మాసపత్రికలు చేసేపని ఆవిడ ఒక్కర్తే చేస్తూవుండేది పూర్వము.

ఆమె ఆంధ్రయువతి. ఆంధ్రలక్షణములు ఆమెయందు పూర్తిగా వున్నవి. ప్రతిభాశాలినియైన ఈ యాంధ్రకాంతను తలుచుకొని ఏ ఆంధ్రుడు గర్వపడడు!

బహుశా ఆమె పూటకూటింటిపునిషి కావచ్చును. లేక పోతే సత్రాధికారిణి కావచ్చు. పూటకూటిండ్లూ సత్రములూ చూచు తెలుగువారికి ఆమె పరిచయము తప్పకుండా కలిగి వుంటుంది.

కథలలో యిట్టి అద్వితీయ చాకచాక్యముచూపిన యీ చారిత్రిక స్త్రీని ప్రశంసింపని వారుండరు. ఇంగ్లీషులో ఛాసరు దొరగారు వ్రాసిన కావ్యాలలో "హోస్టు" "మైన్‌హోస్టు" అనే పురుషునకు యీమెకు కొంతవరకు పోలికలు కలవుగాని యీమెను సర్వవిధాలా పోలినవారు లోకంలో లేరు. ఇంగ్లీషు కావ్యములలోని వ్యక్తులకూ తెలుగు కథలలోని పేదరాసి పెద్దమ్మకూగల పోలికలను బట్టియూ ఇంగ్లీషుపదములకూ తెలుగుపదములకూ వున్నపోలికలను బట్టియూ ఇంగ్లీషువారికిని ఆంధ్రులకును రెండు చేతులా భోంచెయ్యడము ఆచారము కాబట్టిన్నీ (పరిషేచన చేసేటప్పుడు ఎడమచేతితో విస్తరిని తాకికుడిచేత్తో ప్రాణాహుతులు పుచ్చుకుంటారు ఆంధ్రులు.) ఇంగ్లీషువారియింటా ఆంధ్రులయింటా నిత్యాగ్నిహోత్రము లుండుట ఆచారము కాబట్టిన్నీ, ఇంగ్లీషువారు ఆంధ్రు

లగుదురా. అనేవిషయము ఇంకొకవ్యాసమున చర్చింపబడెను.

వేదరాసి పెద్దమ్మ దాత. ఈమె యింటికి వచ్చినవారిని ఆదరించి ఆతిథిసత్కారము చేస్తూవుండేది. అందరియెడలా ఆమె సానుభూతి చూపేది.

ఈగ తన పేరు మరిచిపోయి ఈమెదగ్గిరకు వెళ్లి తనపేరడిగినప్పుడు తనకొడుకు నడగమంటుంది.

ఒకమారు యీవిడ కాళ్ళు పొయ్యిలో పెట్టుకొని అట్లు వండుతూవుండగా కోతి ఒకటివచ్చి ఆమెకు కట్టెలుయిచ్చి అట్లు పుచ్చుకొన్నది. ఇత్యాది విషయములబట్టి ఈమె గుణముల పుట్టయనీ, బుద్ధులపోగనీ, తోచకపోదు. ఇట్టి స్త్రీవతంసము నేడు విస్మరణీయమగుట విచారకరము"

ఈ అష్టావధానిగారు యింకొక వ్యాసము యీ మధ్య ప్రకటించినారు.

" రాజమహేంద్రవరము రాజమహేంద్రవరముకాదు "

అనువిషయమును గురించి.

రాజరాజ నరేంద్రుడేలిన రాజమహేంద్రపురము నేడు వ్యవహారములో రాజమంద్రియని చెప్పబడుచున్న పట్టణము కాదని యీయనవాదము.

ఈ వాదమును బలపరుచుటకు అనేకములైన విషయముల నాయన ఉదహరించెను.

మహారాజులు పాలించిన మహాపట్టణమైతే యెంతకాలముగడచినప్పటికీ కొద్ది చిహ్నాలేనా వుండక్కరలేదా ?

ఆ మహాపట్టణము ప్రాకారములూ కందకములూ ఇంతలోనే రూపుమాసిపోయినవా ?

సమీపమున రాజానగరమనే వూరువున్నది. నిజముగా రాజుగారి ఆవాసస్థానమదియేమో? రాజమహేంద్రవర మా ప్రాంతములలోనే వున్నదేమో ?

శ్రీనాథుడు వ్రాసిన పద్యమునుబట్టి దాఖలా అగుపిస్తున్నదంటారేమో ! ఏవో రెండు దేవాలయములు ఆ దేవుళ్ల పేర్లతో వుంటేసరా? శ్రీనాథుడు వర్ణించిన ముల్లగూరిశక్తి ఎక్కడవున్నది? ప్రసిద్ధిజెందిన కోటిలింగ దేవాలయముమాట శ్రీనాథుడు చెప్పకపోవడ మేమి?

గోదావరి పూర్వము ప్రవహించే మార్గాన్నే యిప్పుడూ ప్రవహించుచున్నదని అనుకోవడమేమి? దానిమార్గము నది మార్చుకొన్నదేమో? ఇత్యాది పెక్కువిషయాలతో ఆయన వ్యాసము నిండియున్నది.

కొందరీ వ్యాసమును చదివి 'అష్టావధానికి మతిపోయిం ద'న్నారు. కొందరు 'ఆలోచించవలసిన విషయమే'అన్నారు.

ఈరీతిగా కాలక్షేపం చేస్తూన్న ఈ పెద్దమనిషిని, అష్టావధాని అనీ, పరిశోధకుడనీ, గొప్పవాడనీ గ్రహించి ఊళ్లో యెవళ్లో పెద్దమనుష్యులు ఒకసభకు అగ్రాసనాధిపతిగా వుండమని కోరినారు!

ఏమిటో అనుకొని ఈ బ్రాహ్మడు సరే అన్నాడు. అన్ని సందర్భాలు తెలిసిన ఒక స్నేహితునిదగ్గరకు పరుగెత్తుకువెళ్ళేడు.

"ఏమయ్యోయి అష్టావధానీ యిలాగవచ్చేవు?"

"ఏముంది ఉన్నవాడిని వుండనియ్యకుండా ఈ ప్రజలు–"

"ఏమిచేసారు?"

"నన్ను ఒకసభకు అగ్రాసనాధిపతిగా వుండమనికోరినారు"

"ఒప్పుకున్నావా?"

"ఆ"

"ఇంకెందుకూ? నీకూ నాకూ ఈవేళతో స్నేహంసరి"

"ఏమి అది అంత అకార్యకరణమా?"

"ఇంకా నిమ్మళంగా అడుగుతున్నావా"

"ఎందుచేత?"

"లోకంలో ప్రసిద్ధిచెందడానికి అనేకమార్గాలున్నాయి. హత్యలుచేసి గొప్ప హంతకుడని పేరుపొందవచ్చు. చోరీలు చేసి గొప్ప చోర శిఖామణి అని ప్రతిష్ఠ సంపాదించవచ్చు తప్పుడుసాక్ష్యాలు తప్పుడు సంతకాలు, దోవలు కాయడాలు, గవర్నమెంటువుద్యోగాలూ ఎన్నిలేవు—నీవు అగ్రాసనాధిపతిగానే వుండాలా పేరు సంపాదించడానికి?"

"తీరా ఒప్పుకున్నాను మరి"

"ప్రపంచములో నాకు అన్నహితవు తప్పించేవిషయాలు కొన్ని వున్నాయి. ఇద్దరు ఆడవాళ్ళుచేరి సంభాషించుకొంటూంటే వారి మాటలుగానే నాచెవిని పడ్డట్లయితే ఆరోజు నాకు అన్న హితవు పోతుంది. ఖర్మించాలక ఏరోజునేనా నేను ఇంగ్లీషువాడిముఖం చూడడం సంభవించినట్లయితే ఆరోజల్లా నాకు అన్నహితవుండదు. ఇంక ఎవరేనా అగ్రాసనాధిపతిని చూచినట్లయితే నాలుగయిదు రోజులదాకా నాకు లంకణములే."

"ఛొఛ్ఛొ, ఎంతపనికి ఒప్పుకున్నాను! ఈ హీనకార్యానికి నన్ను ఒడబరచినందుకు వాళ్ళమీద క్రిమినల్‌గా చర్యజరిపించాలి అనివుంది. నీ సలహాఏమిటి?"

"అది గౌరవకార్యంగా ప్రజలూహిస్తున్నారయ్యా"

"పోనీ దీనిని నిషేధించడానికి ధర్మసూత్రాలేమీ లేవూ?"

"వుంటే యిక కావలసిందేమిటి?

"పోనీ శాసనసభలలో ఒకచట్టము ఈ సభ్యులందరూ ఏర్పాటుచేస్తే వారిపేరు శాశ్వతంగా వుంటుంది కాదూ?"

"నామొగుడే ప్రయోజకుడైతేనా అందిటఒకయిల్లాలు?"

"మరేమిటి సలహా?"

"శీఘ్రబుద్ధిః పలాయనం"



అనుకొన్నరోజున ఆవూళ్లో సభజరగలేదు. అగ్రాసనాధిపతిలేనికారణాన్ని అష్టావధాని ఆరులంకణములుచేసి ఎలాగో తేరుకొని మళ్లీ ఆవూళ్లో అడుగు పెట్టలేదు.

1923

# నీతిపాఠము

ఈకాలంలో కుర్రాళ్లకి పాఠశాలల్లో నీతిబోధ చెయ్యక పోవడం చాలా పొరపాటని చాలాకాలంబట్టి నావుద్దేశ్యం. చదువయిపోయినతర్వాత కుర్రవాణ్ణి ప్రపంచకంలో వదలి పెట్టినప్పుడు వాడికి ఎక్కువ సహాయకారిగా వుండి సంసార సాగరాన్ని యీదడానికిగాని దేశపురోభివృద్ధికి తోడ్పడ డానికి గాని అర్హత కలిగించేది నీతిబోధ అవుతుంది గాని—ఈ గణితశాస్త్రాలు, దేశచరిత్రలు, భూగోళ ఖగోళ చరిత్రాదులు కానేరవు. దైవభక్తి, పితృభక్తి దేశభక్తి యిత్యాది భక్తులు కుర్రతనంలోనే నూరిపొయ్యక పోయినట్లయితే పిల్లవాడు ప్రపంచకంలో ప్రవేశించడం తోనే వ్యసనాలకి లోబడిపోతాడు. నీతిబోధ లేకపోవడం వల్లనే యీకాలపు కుర్రవాళ్లు తల్లిదండ్రులకు లొంగక యిష్టంవచ్చినట్లు సంచరిస్తూ దేహాన్నీ బుద్ధినీ పాడుజేసుకుం టున్నారు. తల్లిదండ్రులు చెప్పినట్లే ప్రపంచకంలో కుర్ర వాళ్లందఱూ నడచుకొన్నట్లయితే ఈ ప్రపంచకం యిప్పు డున్న విధంగావుండక సీదాగా క్రొత్తప్రపంచమై వుండేది. ఈ క్రొత్త ప్రపంచంలో జైళ్ల అవసరంలేదు. సంఘసంస్క ర్తల అవసరంలేదు. మతబోధకు లుండక్కరలేదు. కోర్టులు అసలే అక్కరలేదు. కాని యీకాలం కలికాలంగదా! అం చేతనే పితృవాక్యపరిపాలకులు చాలా అరుదుగా వున్నారు. అయినప్పటికీ నీతిబోధ తల్లిదండ్రులు చెయ్యకపోవడం చాలా

తప్పు. పోనీ వాళ్లు చెయ్యకపోతే పోయిరి, బదులలోనైనా చెయ్యక్కరలేదూ? ఈలోపం తీర్చడానికనే కొందరు ప్రముఖులు, దేశభక్తిచే పురిగొల్పబడి, విద్యార్థులకోసమని కొత్త కొత్త పత్రికలు పెట్టి, ఉపన్యాసాలిచ్చి పాటుపడుతున్నారు. వీరివంటివారే మరికొందరు పనిపాటలు లేక వుద్యోగాలు దొరకక ఏమి చెయ్యడానికీ తోచక—పోనీ విద్యార్థుల కీ నీతిబోధేనా చెయ్యవచ్చును. దానివల్ల పుణ్యం పురుషార్థం కూడా—అనుకొని, కొత్తకొత్త విద్యార్థి పత్రికలు లేవనెత్తి దేశసేవ చేస్తున్నారు. దేశసేవతోబాటు వీరు భాషాసేవ కూడా చేస్తూన్నట్లు అనుకొంటున్నారు. 'ఏకా క్రియా ద్వ్యర్థకరీ బభూవ' అన్నట్లు వీరిని ప్రజలు మెచ్చుకుంటున్నారు గాని కుర్రాళ్లు వీరిపత్రికలు చదవకపోవడం చాలా నీచమైన పని. వీరికోసమని ధనప్రయాసలకు వెనుదియ్యక పత్రికలు పెట్టితే వాటిని వీరు చదవకపోవడంకన్న తప్పుపని మరి ఏమున్నది? చదవక ఈ కుర్రవాళ్లు యథాప్రకారం కాఫీహోటల్కుకి వెడుతున్నారు. గ్రామ్యాన్నే గ్రంథాలు వ్రాస్తున్నారు. క్రాపింగు లుంచుకుంటున్నారు. భావగీతాలు వ్రాస్తున్నారు. నవలలు చదువుతున్నారు. నాటకాల్లో వేషాలు వేస్తున్నారు. పెద్ద పిన్న తారతమ్యం తెలియకుండా ప్రవర్తిస్తున్నారు. ఈ పత్రికలు చదవకపోవడానికికూడా కారణం యుక్తవయస్సులో నీతిబోధ చెయ్యకపోవడమే కాని మరి వకటి కాదు. ఈ సంగతి గుర్తెరిగి మా కుర్రవాళ్లకి ఏడాది వెళ్లినప్పటినుంచీ నీతి బోధచెయ్యడానికి పూనుకొని ఆవిధంగా చేస్తున్నాను. నేను చేస్తూన్న యీ వుత్తమకార్యమును

మెచ్చుకొని వాళ్ళూ కృతజ్ఞత చూపడం లేదు. లోకమూ చూపడం లేదు. నిజంగా దేశాభివృద్ధికి తోడ్పడే వారికి యీ కాలంలో మెప్పు లేదు.

ఒకనాడు మా చంటబ్బాయి—రెండేళ్ళవాడు — కొంచెము అల్లరి చెయ్యడం మొదలుపెట్టేడు. ఆసమయంలో నేను కొంత వాఙ్మయపరిశోధన చేసుకుంటూ తదేకదీక్షతో వున్నాను. ఆపరిశోధన ఏమిటీ అంటే పూర్వము మన దేశము నేలిన 'మల్కిభరాముడు' ఎవరూ అని. కొందరితడు సబాబంటూరు గాని అది విశ్వసనీయము కాదు. క్షత్రియుడే అయితే సూర్యవంశపువాడా, చంద్రవంశపువాడా? ఒకవేళ బ్రాహ్మణుడైతే నియ్యోగా వైదీకా? అని. ఇంతవరకూ కవి చరిత్రకారులు ఆంధ్రకవులను సాధ్యమయినంత మట్టుకు నియ్యోగులనుగా పరిగణించినారు. ఆకవులను పోషించిన రాజుల విషయమై వారు ఆట్టే వ్రాయలేదు. నేను ఆపనికి పూనుకొని ఆయేలికలుకూడా నియ్యోగులే అనడానికి ప్రబలమైన కారణాలు సంపాదిస్తున్నాను. 'మల్కిభరాముడు' నామతంలో నియ్యోగి కావచ్చునేమో అని తోస్తుంది. ఈపరిశోధన కార్యానికి నేను రెండుపద్యములు సంపాదించినాను.

క. ఆకుండ గల్పవృక్షమ
వీకుండన్ లోభివగుదు విహాపరములకున్
మీకుండగ మాకిచ్చుట
మాకుండగ నడుగబోము మల్కిభరామా!

ఉ. ఓరి విధాత యోరి వినరా కనరా తలకొట్లమారి ని
స్సారపులోభిరాజులను జంపక మల్కిభరామచంద్రునిన్
సారయశోనిధిన్ ఘనుని జంపితి వందున నేమి? దక్కె-
చేరువనింత రాజును సృజింపగ నీతరమే వసుంధరన్!

ఈ పద్యములను ఆధారముగా చేసుకొని నా వాదం నిలవ బెట్టుకోడానికి ప్రయత్నం చేస్తూంటే మా రెండేండ్ల పిల్లవాడు శ్రీనాథుని కాశీఖండం తీసుకొని, దానిలో పేజీలన్నీ ఒకదాని వెనుక నొకటి చింపి వెయ్యడం మొదలుపెట్టినాడు. కొంతపుస్తకం కాళీ అయిన తర్వాత ఆసంగతి నేను గ్రహించి సమయం వచ్చినప్పుడు ఊరికే పోనియ్యకూడదను కొని వాడికి నీతిబోధచెయ్య తలుచుకొన్నాను. నా కెదురుగా వాడిని మఠంవేయించి కూచోబెట్టి చేతులు కట్టించి ఈరీతిగా వుపన్యాసం ప్రారంభించేను. "నీవింకా కుర్రవాడవు. వస్తువు యొక్క సరియైన విలవ నీకు తెలియడం లేదు. శ్రీనాథుడు మహాకవి. ఆమహాకవి వ్రాసిన గ్రంథమును చింపడము చాలాతప్పు. అదిగాక పుస్తకం సరస్వతీదేవి రూపము. ఈపని నీవు చేయడంవల్ల మహాకవియెడలా సరస్వతియెడలా అప రాధం చేసినవాడవయినావు. కాబట్టి యింక ముందెప్పుడూ పుస్తకాలు చింపబోకు. అదిగాక నీకు సంసారకష్టాలు యింకా ఏమీ బోధపడలేదు. రూపాయిన్నరయిచ్చి కొన్న పుస్త కాన్ని నీవు తృణప్రాయంగా చూచి చింపివేయడంవల్ల ధన విషయమున నీకు సరియైన అభిప్రాయంలేనట్లు స్పష్టము. 'ధనమూలమిదం జగత్త'ను ఆర్యోక్తి నీవు మరచిపోకు. ఎంత కష్టపడితే వస్తుంది రూపాయిన్నర! చెమట ఊడ్చి ఈడబ్బు

సంపాదించిన నా పైకూడా నీకు గౌరవం లేనట్లు నాకు తోస్తూంది. 'పితృదేవోభవ' అనేమాట ఎప్పుడూ మరచి పోకు. వెళ్లు'' అని మావాడిని పంపించివేసినాను. మావాడు వంటింట్లోకి వెళ్లి అక్కడ మజ్జిగతప్పేలా కిందకు పడదోసి నాడు. ఇంతబోధాచేస్తే యిలాగ చేస్తాడా అని వాడిని రెండుతన్ని ఎన్నటికైనా ఈనానీతిబోధ ఫలించకపోతుందా అని వూరుకొన్నాను.

అడపా తడపా మాచంటి కుర్రవానికి నీతిబోధన చేస్తూ వుంటాను గాని మా పెద్దకుర్రవాడి విషయంలోమాత్రం ఎక్కువ జాగ్రత్తతీసుకొని ప్రతీదినం ఏదో పాకవిధంగా సమయంచూచి సూక్తిరత్నములు నాలుగయిదు యిస్తూ వుంటాను. సాధారణంగా సాయంకాలం భోజనాలుచేసిన పిమ్మట ఆరుబయట మావాడిని కూచోబెట్టి నీతిబోధచెయ్యడం నా అలవాటు. వాడు అప్పుడే కునికిపాట్లుపడడం వాడి అలవాటు. నీతిబోధ చెయ్యడానికిగాని, ఒకపాఠము మొదలు పెట్టడానికి గాని కొంత తంతువుంది. బోధను ఒక్కమారు కూచునీ కూచోవడంతోనే హరిఃఓం అని మొదలుపెట్ట కూడదు. ముందుముందుగా కుర్రవాడి మనస్సు కొంత దోహదంచేసి పిమ్మట నీతిబీజాలు నాటవలెను. భూమికి దున్నడం ఎటువంటిదో బోధకు ఈదోహదము అటువంటిది. ఈనాటి విద్యాబోధకు యిది కీలకము—మూలసూత్రము. ఆ సంగతి గ్రహించినవాడ నగుటచేత నేను ఒకనాడు మా వాడిని కూచోబెట్టి నీతిబోధకు దోహదం ప్రారంభించేను. అసలు మావాడికి చెప్పదలచుకొన్న నీతిపాఠము మాతృ

భక్తిని గురించి. మావాడు తరుచు తనతల్లితో భోజనం చేసేటప్పుడూ, బళ్లోకి వెళ్లమన్నప్పుడూ, ఏదేనాపని చెప్పి నప్పుడూ యతిఅంటే ప్రతంటూ వాదం చేస్తూవుంటాడు. ఆ దురభ్యాసం మానిపించాలనే వుద్దేశంతో యీ పాఠం మొదలు పెట్టేను. ఏమంటారా—ఫలానా శీతారామయ్యగారి అబ్బాయి నీతిమంతుడూ బుద్ధిమంతుడూ అనిపించుకుంటే తండ్రిగారికి ఘనతగాని వట్టిఅల్లరి పిల్లవాడనిపించుకుంటే తండ్రికేమి ఘనత? బాల్యంలో పిల్లవాడు చేసినతప్పులన్నీ తండ్రివేగా!

"అబ్బాయీ, మనవూళ్లో పెళ్లిళ్లు అవుతున్నాయి చూస్తు న్నావురా?"

"ఆ, నేచూస్తున్నా, నాన్నా;—ఎంచక్క-వాళ్లంతా—"

"ఏమిటి చెప్పు"

"నాన్నా, వాళ్లంతా పల్లకీ ఎక్కి ఊరేగుతూంటే చూశాను"

"ఇంకేమేమి చూశావుచెప్పు"

"నాన్నా, పల్లకీలో ఎక్కితే ఏలాగవుంటుంది?"

"బాగానేవుంటుందిగాని, ఇంకా ఏమేమిచూశావో చెప్పు"

"నాన్నా—మరి—పల్లకీలో ఎక్కాలంటే—మరి—పల్ల కీలో ఎక్కడం ఏలాగ?"

"పల్లకీలోనా—పెళ్లిచేసుకుంటే సరి. కాని నీవింకా ఏమేమి చూశావు చెప్పు"

"నాన్నా, మరినేను పల్లకీలో ఎక్కాలని వుంది. నాకు పెళ్ళిచెయ్యవు?"

"ఆఁ, ఆఁ, ఏమిటీ అంటున్నావు"

"నాన్నా, నాకు పెళ్లిచేస్తే నేను అయిదురోజులూ పల్లకీలో కూచుంటా కాదూ"

"తప్పు; తప్పు; విను. పెళ్లంటే నీవు పల్లకీలోకూచోవడం అనుకుంటున్నావు. పెళ్లి జీవితంలో ఒక పరమపవిత్ర కార్యము. దానిని చుల్కనగా చూడకూడదు. నీకింకా ఆ రేండ్లు నిండ లేదు. అప్పుడే పెళ్లా?"

"ఏం నాన్నా!"

"నాకెప్పుడైందో పెళ్ళి ఎరుగుదువా? నాకు జీవితయాత్ర జరిపించడానికి శక్తిసామర్థ్యాలు కలిగినపిమ్మట నేపెళ్లయింది."

"నీపెళ్లికి నన్ను పల్లకీలో కూచోబెట్టుకున్నావా, నాన్నా!"

"ఏమిటీ?"

"అప్పుడు నేను చిన్నపిల్లవాణ్ణి కాదు నాన్నా!"

"కుర్రవాళ్లు అట్టే పెండ్లిసంగతి మాట్లాడగూడదు. చూడు ఆకాసంకేసి చూడు. దానిమీద ఏముందో చెప్పు"

"నాన్నా, దాన్నిఆకాశం అంటావేం, అదికొండగాదూ?"

"రెండూ వొకటే. ఆకాశంమీద ఏముందో చెప్పు"

"మరీ నాన్నా, నాన్నా! మొన్న నన్ను అన్నవరపు కొండ మీదికి తీసికెళ్లావుకాదు"

"అవును"

"మరి నాన్నా, అక్కడికొండ చేతికందింది గాదే?"

"కొండంటే పర్వతమన్నమాట."

"మరి నాన్నా, ఆకొండమీద మరి చందమామా వాళ్లూ వుండరూ"

"పర్వతంమీాద వుండరు. ఆకాశంమీాద వుంటారు. చూడు. ఈమాటుచూసి చెప్పు ఏముందో ఆకాశంమీాద"

"చందమామవుంది. చుక్కలున్నాయి. మేఘాలున్నాయి"

"ఆఁ. మేఘాలసంగతికేంలే, మరి చందమామ ఎప్పుడగుపిస్తాడు మనికి?"

"బయటికివచ్చి చూస్తేను"

"అదిగాదురా, పగలా, రాత్రా?"

"నాన్నా, మరి రాత్రిగాదూ చందమామ వచ్చేది"

"మరి పగలు ఎవరుంటారు?"

"పగలా నాన్నా, సూర్యుడు."

"సరే. మరి ఇద్దర్లోకి ఎవరికెక్కువ వెలుగుంది?"

"నాన్నా, నాన్నా చంద్రుడిలోకి వెలుగేలాగ వచ్చింది."

"సూర్యుడిలో కెలాగవచ్చిందో మొదట చెప్పు."

"నాన్నా, చంద్రుడిలో సూర్యుడు దీపంపెట్టాడా?"

"అవునుగానీ మనకు రాత్రి చంద్రుడు పగలు సూర్యుడు ప్రత్యక్ష దైవాలు."

"అంటే యేమిటి నాన్నా"

"అంటే దేవుళ్లన్నమాట"

"మనం దండంబెట్టాలా నాన్నా!"

'అం. వీళ్లిద్దరూకాక ఎప్పుడూ మన కగుపించే దేవుళ్లెవరు?'

"దీపం, గౌరీదేవి"

"అదిగాదురా, ఎప్పుడూ నీతో తిరిగేవాళ్లు."

"నువు చెప్పవునాన్నా!"

"ఆలోచించి నువు చెప్పుకోవాలి."

"కొంచెం చెప్పు నాన్నా!"

"మీ అ...."

"ఇంకా కొంచెం చెప్పు నాన్నా"

"మీ అమ్మ వొకటిరా."

"మా అమ్మ ఏఁవిటే నాన్నా"

"మీ అమ్మ వొక దేవుడు."

"అమ్మ దేవుడా నాన్నా?"

"ఆఁ. నాన్న ఒక దేవుడు."

"నువ్వూ దేవుడవే నాన్నా!"

"ఆఁ. మ్మాతృదేవోభవ, పితృదేవోభవ, అచార్య దేవోభవ, అతిథిదేవోభవ, అన్నమాట జ్ఞాపకం వుంచుకో."

"మరి నాన్నా మీరిద్దరూ దేవుళ్లయితే మరీ...."

"నేను చెప్పేది కొసాకే విను. తొమ్మిది మాసములూ మోసి కనీ పెంచీ, నిన్ను పెద్దవాణ్ణిచేసిన మీఅమ్మ దేవుడు కాదటరా? ప్రజయాపితృభ్యః అనేవాక్యం వినలేదూ?"

"మీరిద్దరూ దేవుళ్లయితే మరీ........"

"ఛట్ వుండు. మీఅమ్మని ఎప్పుడూ పూజిస్తూవుండు. తెల్లవారగట్టే లేచి, లేచీలేవడంతోనే, మీ అమ్మముఖం జూసి మీఅమ్మకు దండం బెట్టినట్లయితే భూప్రదక్షిణం చేసినంత పుణ్యం?"

"మరి నీకు దండంపెట్టొద్దూ నాన్నా!"

"నాసంగతి చెపుతాను. ముందుగా వినూ. మీఅమ్మ మాటకెప్పుడూ ఎదురాడగూడదు. చెప్పినట్లల్లా చేస్తూం డాలి."

"మరి నాన్నా!అమ్మ అస్తమానవున్నూ కుంకుడుకాయలు గొట్టమంటుంది. నీళ్ళపొయిలో కర్ర లెగసన తొయ్యమం టూంది. కాళ్లు కడుక్కోటానికి నీకస్తమానం చెంబుతో నీళ్లు అందివ్వమంటుంది. తమ్ముణ్ణి ఆడించమంటుంది. అన్నంలో మావిడిపండు వెయ్యకుండా ఆవకాయ వేసుకోని తినమం టూంది మరి"

"ఓహోహో, మీఅమ్మ యేంచెప్పితే అది చెయ్యవల సిందే. మీఅమ్మ వొకదేవుడు. నేనొకదేవుణ్ణి తెలిసిందా?"

"నాన్నా మరి, మీరిద్దరూ దేవుళ్ళయితే; మరి నేనో...."

"నువ్వా? నువ్వు భక్తుడివి."

"కాదు నాన్నా! మీరిద్దరూ పెద్దదేవుళ్ళూ నేనో చిన్న దేవుణ్ణి. కాదూ నాన్నా!"

ప్రపంచకంలో ఆశ లేందే యెవరూ బతకలేరు. నానీతి బోధకు ప్రతిఫలం వుండకపోతుందా అనే ధైర్యమే నన్ను నిలబెడుతూంది.

# జాతకము

త్రమ తమ జన్మలలో మనుష్యులు చేస్తూ ఉన్న కర్మలూ వాటిఫలములూ చిత్రగుప్తులో వారి కింది గుమాస్తాలో జాబితాలు వ్రాసి ఉంచుకొంటారు. ఈజాబితాలన్నీ వారు బ్రహ్మదేవుడికి పంపిస్తారు. వీటినిబట్టి బ్రహ్మదేవుడు ఒక్కొక్క మనిషికీ ఒక్కొక్క జాతకం తయారుచేసి ఆ జాతకాల నను సరించి మనుష్యులను పుట్టిస్తాడు. అంటే మనుష్యుడు పుట్ట డానికి పూర్వమే అతని జాతకం బ్రహ్మదేవుడు తయారుచేసి తన ఆఫీసులో ఉంచుకొంటాడన్నమాట.

మనుష్యుని సౌందర్యాదులూ, మంచిచెడ్డలూ, కష్టసుఖ ములూ వగైరావిషయములన్నీ అతడు పుట్టడానికిముందే నిర్ణయింపబడి ఉంటవన్నమాట స్పష్టము.

ఇక మనుష్యుడు భూమిమీద పడ్డతరువాత అతనిజాతకం వ్రాద్దామని యితర మనుష్యులు ప్రయత్నిస్తారు. జాతకం వ్రాయడ మనగా బ్రహ్మదేవుడు వ్రాసిన జాతకంలో విషయ ములు ఏవిధముచేతనైనా గ్రహించడముకు ప్రయత్నిం చడమే. జననకాలమును బట్టీ, దేశమునుబట్టీ, గ్రహాదులగతు లనుబట్టీ, యీరహస్యభేదనము చేయడముకు మనుష్యులు ప్రయత్నిస్తారు. జాతకము లేనిబ్రతుకు దీపము లేని యింటివంటి దని వారు సూత్రముచేసి ఆసూత్రప్రకారముప్రతివాడూ జాతకము వ్రాయించుకోవాలని నిర్దేశిస్తారు. ప్రతివాడూ జాతకం వ్రాయించుకొంటాడు. కాని ఆ జాతకం నిదర్శన

మియ్యాదు. ఏమండీ జాతకము నిదర్శన మివ్వడం లేదంటే జోస్యానికి పార్వతీదేవి శాపం ఉన్నదని వారు సమాధానం చెప్పుతారు. ఇటువంటి జాతకాలవల్ల లాభమేమిటి ? ఈగుడ్డి దీపం యింట్లో ఉంటే ఎంత లేకపోతే ఎంత అని అతడు నిరుత్సాహపడతాడు.

న్యాయానికి అతడు నిరుత్సాహ పడవలసిన అవసరము లేదు. మనుష్యుని సౌందర్యాదులు తెలుసుకోడానికీ మాతాపితాదులను గురించి తెలుసుకోడానికి జాతకము అవసరము లేదు. ప్రతిరోజూ యీ విషయములు అతనికి అనుభవైకవేద్యములే. ఇంక కష్టసుఖములు లాభనష్టములు తెలుసుకొనడముకు కూడా జాతకాలు అవసరము లేదు. జాతకాలున్నప్పటికీ అవి సరియైన నిదర్శనమివ్వడం లేదు. కాబట్టి అవి ఉన్నా లేనివాటిలోనే జమ.

అయితే కష్టసుఖాదులు తెలుసుకోవడం ఎలాగంటే దానికి ఒక సూక్ష్మమార్గ మున్నది. ఈ సూక్ష్మమార్గము ననుసరించి ఎవరిమట్టుకువారు తమతమ భావిఫలములను గ్రహించుకోవచ్చును. దీనికోసం జోస్యుల నాశ్రయించడం, డబ్బు ఖర్చుపెట్టడం, ప్రకటనల కోసం పత్రికలను తిరగవెయ్యడం ఇత్యాపదిసులు చేయవలసిన పనిలేదు. ఈ మార్గం ఏమిటంటే —

ప్రొద్దున్నే లేచి ఎవరిమొహం చూస్తే ఏయేఫలాలు సంభవిస్తాయో, రాత్రుళ్ళు ఏయేకలలు గంటే ఏయే ఫలాలు వస్తాయో, వీధిలోకి వెళ్ళేటప్పుడు ఏయే శకునాలు వస్తే ఏయే ఫలాలు ముట్టుతాయో, వెనక తుమ్ము ముందు తుమ్ముల

ఫలం యేమిటో, పంచాంగము పరిశీలించేవారి కందరికీ తెలిసినవిషయమే. వాటినిగురించి యిక్కడ చెప్పదలచుకో లేదు. నేను చెప్పదలచిన విషయము లేమంటే —

ఆ యింట్లో నీవు పదేళ్ళబట్టి కాపురమున్నావు. వీధి గుమ్మందాటి లోపలికి వెళ్ళడం, లోపలినుంచి గుమ్మందాటి వీధిలోకిరావడం, చాలాసారులు జరిగి ఉంటుంది. కాని ఎప్పుడూ ఏమీ ప్రమాదము కలగలేదు. కాని దశాచ్ఛిద్రము వచ్చినా, అంతర్దశ విదశలు జబ్బిచ్చినా, గుమ్మం దాటే టప్పుడు ద్వారబంధం టక్కున బట్టతలకు తగిలి బొప్పి కట్టడమో, లేకపోతే గడప కాలికితగిలి సాష్టాంగంగా బోర్లా పడడమో జరుగుతుంది.

ఈరీతిగా చాలామారులు జరిగినట్లయితే దశ మారిపోయిం దని ఊహించుకోవాలి. ఒకమారు అజాగ్రత్తవల్ల గుమ్మం తగిలి తలబొప్పికట్టిందని నీవు చాలాజాగ్రత్తగా నడుస్తూ వంగుని, కాలెత్తి జాగ్రత్తగా గుమ్మందాడడానికి ప్రయత్ని స్తావు. జాతకం బాగుంటే సరేసరి; బాగులేకపోయినట్లయితే ఎంతజాగ్రత్తగా ఉన్నాసరే జరిగేదేమో జరగకమానదు. ఎంతో వంగుని నీవు గుమ్మందాటేటప్పుడు నీతోపాటు ద్వారబంధం కూడా వంగి తలకు తగిలితీరుతుంది. లేదా కాలెత్తి ఎంతోజాగ్రత్తగా నీవుగడపదాటుదా మనుకుంటే, కాలితోపాటు గడప పైకిలేచి (లేచినట్లుమాత్రం అగుపడదు) కాలికి అడ్డువచ్చి భూమిని ఆలింగనం చేయిస్తుంది.

ఎన్నోమార్లు ఆరోడ్డున నడచిఉంటాము. ఆరోడ్డుసంగతి అన్నివిషయాలూ — ఎత్తులు, పల్లాలు, రాళ్ళు, గోతులు

ఇత్యాది — మనకు కంఠతా వచ్చి ఉంటని. కాని జాతకం జబ్బిచ్చినప్పుడు గోతులో కాలుపడి కాలికి ఇరుకు నొప్పిపట్ట డమో. రాళ్ళు లేనిచోటకు రాళ్ళువచ్చి బొటనవ్రేలికి తగిలి పొప్పరూడిపోవడమో, కాలితో కూడా రాళ్ళుపైకిలేచి ఆరాళ్ళు కాలికి గట్టిగాతగలడమో ఏదోఒకటి సంభవించి తీరు తుంది. ఇటువంటి వేవిసంభవించినా వీటినిబట్టి భావిఫలము లను జాతక మక్కర లేకుండా తెలుసుకోవచ్చుగదా! ఇంకో సంగతి —

మనము చేసేసహవాసాలవల్లకూడా మనకు మనజాతకం కొంతవరకు తెలుస్తుంది. ఒకనికి ఒకమాటు ఒకకపీశ్వరుడి స్నేహంచెయ్యడం తటస్థించింది. ఎలా తటస్థించిదంటే — ఆకపీశ్వరు డొకనాడు చేత్తో నల్లేరుకాడలు పట్టుకొని అతనికి కనిపించాడు. "నల్లేరుపట్టుకువెడుతున్నారు. ఏమిచేస్తారండోయి కపీశ్వరుడుగారూ?" అని ఆయన కుశలప్రశ్న చేశాడు. అప్పుడు కపీశ్వరుడు నవ్వుతూ అన్నాడుగదా "మన పూర్వులు ఏమన్నారంటే-—ఒక నుయ్యైనా తవ్వించాలి, ఒకచెరువైనా తవ్వించాలి, ఒక గుడైనా కట్టించాలి, ఒకమొక్కైనా పాతిం చాలి అని. పోనీ మనపెద్దలమాట ఎందుకు కొట్టివెయ్యడం అని ఆలోచించి యీనల్లేరుమొక్క మాదొడ్లో పాతుదామని తీసుకు వెళ్ళుతున్నాను."

ఆ క్షణమే అతడు కపీశ్వరుడితో జట్టుకట్టాడు. అంతే కాకుండా ఆ కపీశ్వరుడికి తనయింట్లో ఒకభాగం అద్దెకు కూడా యిచ్చాడు. హ్రస్వదృష్టితో ఎప్పుడైతే యీపని చేశాడో అప్పటినుంచీ అతని పాట్లు వర్ణించ నలవి కావు.

పాపము అతనికి వేళపట్టున తిండిలేదు, వేళపట్టున నిద్రలేదు. తెల్లారితే సరి, కవీశ్వరు డాయన్నిచూచి "ఆఁ లేచారా, రండి. రాత్రి వ్రాశాను ఈపద్యాలు, ఏలా ఉన్నాయో చూడండి" అని కూర్చోబెట్టి ఆపద్యాలు చదివి ప్రతిపదార్థా దులు చెప్పి అలంకారాలు చెప్పి పూర్వకవుల పద్యాలతోనూ ఆధునికుల పద్యాలతోనూ వాటిని పోల్చిచూపి వాటి ఆధిక్యత నచ్చజెప్పి పన్నెండు గంటలకో భోజనానికి వదలిపెట్టే వాడు. మొహమాటం కొద్దీ ఆతడు కవీశ్వరుడు పెట్టుతూ ఉన్న యమయాతన సహించి ఊరుకొన్నాడు. ఆయన యీ మధ్య ఒట్టు పెట్టుకొన్నాడు. బ్రతికిఉండగా కవీశ్వరుడన్న వాడితో మాట్లాడననీ, తన యిల్లు అటువంటివాడికి అద్దెకు ఇవ్వననీ.

అతని జాతకం ఎన్నాళ్ళైతే జబ్బుగా ఉందో అన్నాళ్ళూ ఆ కవీశ్వరుడి సహవాసం తప్పలేదు. జాతకం అక్కరలేకుం డానే యిటువంటి నిదర్శనాలు ఉంటూ ఉంటే ఇంకా జాతకం వ్రాయించుకోవడ మెందుకు ?

కవీశ్వరులు రెండురకాలు — ఒకరకం తుమ్మెద కవీశ్వ రులు, ఇంకోరకం సాలె పురుగు కవీశ్వరులూను. తుమ్మెద కవు లేమిచేస్తారంటే ఆ పువ్వునూ ఆ పువ్వునూ ఆశ్రయించి వాటిలో మకరందమూ, పుప్పొడీ తీసి యింటికివచ్చి తేనె పట్టుపెట్టి అందులో మకరందం దాచి అదే తమ ప్రయోజ కత్వం అని లోకానికి వెల్లడిచేస్తారు.

ఇక సాలెపురుగుకవు లేమి చేస్తారంటే గూడుకు కావలసిన సామగ్రిఅంతా తామే సమకూర్చుకొని, సాధనాలన్నీ చూచు

కొని, గూడు ఎప్పుడు ఎక్కడ ఏరీతిగా కట్టాలో ఆలోచించు కొని ఆరీతిగా కట్టుతారు.

జాతకఫలాలు తెలుసుకోవడం విషయములో ఈఉభయుల సహవాసం ఒక్క మోస్తరు ఫలములనే ఇస్తుంది కాబట్టి పాఠకులు జాగ్రత్తగా ఉండవలసి ఉంటుంది.

జాతకం దశ మారడానికి సిద్ధంగా ఉన్నపుడు మన ప్రశ్న లకు సరియైన సమాధానాలు రావు. ఈసంగతి గ్రహించి మనజాతకం మారుతూ ఉన్నదన్నసంగతి మనము గ్రహించు కోవాలి. ఒక ఆసామి తన కొడుకును పిలిచి "అబ్బాయీ! యీ ఉత్తరం పోస్టులోపడేసిరారా" అంటే కొడుకు అన్నాడు గదా "ఆపోస్టులో ఉత్తరాలు వెళ్ళవు నాన్నా, నేను చూశాను. ఆపోస్టు ఎపుడూ అక్కడే ఉంటుంది." ఆ ఉత్తరం కొడుకు పోస్టులో వెయ్యలేదు. తండ్రే వేశాడు ఎండలో పరు గెత్తుకువెళ్ళి! వెళ్ళదనే నిశ్చయంతో కొడుకు ఉత్తరం పోస్టులో వేస్తే అది వెళ్ళదలచి ఉన్నా నెళ్ళడం మానుతుం దని అతని భయం.

ఇంక కొందరిజాతకం సాధారణంగా నెల నెలంతా సరిగ్గా ఉండీ మధ్య మధ్యను మాత్రం చాలా నీచలోకి దిగుతుంది. అది శీతాకాల మనుకోండి. చలిచేత పక్కలు వంచుకుపోతు న్నాయి. నెచ్చని పరపుమీాద వెచ్చనికంబళీ కప్పుకొని తెల్ల వారిన తరువాత తాగబోయే వెచ్చ వెచ్చని కాఫీనిగురించి సుఖస్వప్నము కంటున్నా డనుకోండి ఒకపెద్దమనిషి. అప్పుడే తెల తెల వారుతోంది. అతడు పూర్తిగా నిద్రా లేని పూర్తిగా మెలకువా లేని స్థితిలో ఉన్నాడు. ఆసమయంలో

ఎక్కడో సమీపంనుంచి వచ్చి మధురధ్వని అతనిచెవులో పడుతుంది. "ఏమండీ, ఏమండీ, తెల్లారుతోందండీ" అనే ధ్వని. ఆ ధ్వని లక్ష్యముచేయక అతడు మరింత గట్టిగా కంబళీని తన్నిపెట్టి స్వప్నము చెడిపోకుండా ఉండడానికి దానిమీదనే బుద్ధినిలిపి ఉంటాడు. మళ్ళీ ఆ ధ్వని. "ఏమండీ; ఇంకా నిద్రేనా; ఇదిగో చూడండీ; ఏమండీ; వినబడ్డంలేదూ." అని ఉండుండీ ఆ ధ్వని చెవులో పడడముచేత అతడు ఆ ధ్వని తన భార్యదిగా గ్రహించి ఇంక మాట్లాడక ఊరుకుంటే ఏమి కొంప మునుగుతుందో అని బద్ధకంగా "ఊఁ" అంటాడు. ఇతర సమయాల్లో ఆ ధ్వనిని అతడు 'కలస్వనంబు' అనీ 'మధురమంజుల కంఠరవంబు' అనీ అనే వాడేగాని ఈ సమయములో "ఏమిటా వెధవగోల" అనదలచి నోటిదాకా వచ్చిన ఆ మాటలను దిగమింగి, ఆ మాటే అంటే కొన్నాళ్ళదాకా ఇంట్లో తనకు పరువుదక్కదనుకొని, పెద్దమనిషి తరహాగా 'ఊఁ' అంటాడు. ఆవిడ మళ్ళీ "ఏమండీ, ఆ కంబళీ తీసి ఒకమాటు, కూచోండీ; ఇదిగో; ఎంతపిలిచినా పలకరేమిటమ్మా; ఏమండీ" అని అంటుంది. అతడు స్వప్నము చెడినందుకు విసుగుకొంటూ మోటుతనంగా ఏమాట అనడానికీ భయపడి, చలిని ఒకమారు తలచుకొని "ఎందుకూ" అంటాడు. "తెల్లవారిన తరువాతకూడా ఆ నిద్రయేమిటి? ఒకమాటులేచి దాసీది వచ్చింది కాబోలు, అంట తప్పేలాలు దాసీదాని కోమాటు పడవేసి, వంటిల్లు కొంచెం బాగుచేసి, పొయ్యిలో నిప్పువేస్తేనే గాని కచేరికి ఆలస్యం అవుతుందేమో! తరవాత మీ యిష్టం; కుర్రాళ్ళు

లేచి చద్దన్నం కోసం ఏడుస్తారుకూడాను" అని ఆవిడ చల్లగా జారవిడుస్తుంది.

తన విధిని తిట్టుకొని, ఇటువంటి అనుభవాలు తనకు రావడానికి పూర్వజన్మంలో ఏమి కర్మలుచేసి ఉండాలో ఒకమారు ఆలోచించి, తన జాతకం ఆనాడు మొదలు మూడు రోజులదాకా చాలా నీచలోకి దిగిం దనేసంగతి గ్రహించి, ఎవరిని ఏమనడానికీ భయపడి, నిమ్మళంగా లేస్తాడు.

ఆక్షణం మొదలుకొని మూడురోజులదాకా తన భార్య ఉత్తరవులను తూచా తప్పకుండా అతడు నిర్వహించడముకు పూనుకొంటాడు —

పొయ్యిలో నిప్పువెయ్యడానికి ఊరంతా తగులబెట్టడానికి సరిపడే అరడబ్బా కిరసనాయిలూ, నాలుగు అగ్గిపెట్టెలూ ఖర్చుపెట్టి, కర్రలనూ, కిరసనాయిలూ గట్టిగా తిట్టి తన భార్యను మాత్రం మనసులో తిట్టుకొని నీళ్లోడుతూ ఉన్న పొయ్యికేసి చూచి బిక్కమొహం వేసి బియ్యం కడగడానికి నూతిదగ్గిరికి వెళ్ళుతాడు. పొయ్యి మహా తెలివైనవస్తువు; ఆడవాళ్ళ అదుపాజ్ఞలలో ఉంటుంది. వాళ్ళను చూచేటప్పటికల్లా అది రాజి భగ్గున మండుతుంది. ఆడవాళ్ళంటే దానికి భయమో అభిమానమో ఏదో ఉండి ఉండాలి. ఇంక మొగవాళ్లను చూస్తే ఆ పొయ్యే లోకువ గట్టుతుంది. మండించడానికి మగవాడుగానే ప్రయత్నం చేశాడా, పొయ్యి కిక్కురమనకుండా నీళ్ళు గారుతుంది. మంట అక్కర్లేదు. అన్నం అడుగంటుతుందని అతడు అనుకున్నాడా,ఆ పొయ్యి భగభగమండిపోయి ఆర్పడానికి ఎన్ని ప్రయత్నాలు చేసినా లక్ష్యపెట్టదు.

తన భార్య వంటచేసినప్పుడు అతడు ప్రతివస్తువుకూ అనేక వంకలు పెట్టడం అలవాటు. తాను వంటచేస్తూ ఉన్నప్పుడు అతడు నలపాక భీమపాకాలని మించి వండదలచుకొంటాడు. కాని ఫలితమేమిటంటే, అన్నం అడుగంటనైనా అడుగంటుతుంది; లేకపోతే చిమిడిపోతుంది; లేకపోతే అంతా బియ్యమే. మిగిలిన వస్తువులలో ఉప్పూ కారమూ మొదలైన పదార్థాలు వేటికవి స్వరాజ్యం చేస్తూ ఉంటాయి.

కుర్రవాళ్ళకి అన్నంపెట్టడం ఒక పెద్ద పేచీపని. వాళ్ళు తినమంటే తినరు. పోనీ అని పెట్టపోతే నోరుపట్టరు. అతని అనుభవాన్నిబట్టి ఇటువంటి చిక్కులలో పడే ప్రజలందరూ నేర్చుకోవలసిన విషయమొకటుంది. పిల్లవాడు అన్నం తినక నోరుపట్టక పోయినట్లయితే నిమ్మళంగా తొడపాశం పట్టాలి. అప్పుడు వాడు నోరు తెరిచి ఏడుస్తాడు. ఒక ముద్ద వాడి నోట్లో పెట్టి నోరు ముయ్యాలి. అప్పుడు తినక ఏమిచేస్తాడు! ఈ ప్రక్రియ అనేకచోట్ల జయప్రదంగా నెరవేరింది. పిల్లలున్న వాళ్ళందరూ యీ ప్రక్రియ తప్పకుండా అవలంబించవలెనని లోక కల్యాణమును కోరే అతని అభిప్రాయము.

ఏలాగైతే నేమి ఆరోజుకు వంటముగించి పిల్లలకీ భార్యకీ యింత పెట్టి తానింత తిని, కాలిన చేతివేళ్ళ కేసి ఎర్రబడి నీళ్ళు కార్తుతూ ఉన్నకళ్ళతో చూచి ప్రపంచమంతా తన విరోధులే అనే దృఢ విశ్వాసముతో అతడు కచేరికి వెళ్ళుతాడు.

ఆ మూడురోజులకే జాతకం వ్రాయడమెందుకు? మొదటి రోజు "ఏమండీ" అనే శబ్దం అతని చెవులో పడిందిమొదలు అతని జాతకం స్పష్టముగా తెలుసుకోవచ్చునుగదా!

కొందరు మనుష్యులకు చిన్న చిన్న చిక్కులు ఆజన్మాంతం సంభవిస్తూనే ఉంటవి. అవి జాతకాన్ని తెలుసుకోవడముకు కొంతమట్టుకే పనికివస్త వనే సంగతి అందరూ గ్రహించ వలసి ఉంటుంది.

ఆయన చాలా చదువుకొన్నవా డనిపేరు. నే నొకమారు ఆయన దర్శనం చేయడానికి వెళ్ళాను. నే వెళ్ళేటప్పటికి ఆయన భాగవతం చదువుతున్నాడు. నేను సమస్కరించి కూర్చుని వింటున్నాను. ఒక అరగంటసేపయింది. ఆయన భాగవతం కిందబెట్టి యిటూ అటూ చూచాడు. వెదకడం మొదలుపెట్టాడు. చుట్టూఉన్న పుస్తకా లన్నీ తల్లకిందులు చేశాడు. వ్యాసపీఠం ఎత్తిచూచాడు. భాగవతం ఎత్తి కింద చూచాడు. భాగవతం కాగితా లన్నీ తిరగవేసి చూసాడు. లేచాడు. కూర్చున్నాడు. మధ్యమధ్య పెళ్ళాన్నీ కొడుకులనీ తిట్టాడు.

''ఇక్కడే పెట్టానండీ, ఇప్పుడేనూ" అన్నాడు. మళ్ళీ భాగ వతమంతా తిప్పి పరిశీలించాడు. బట్ట తడముకున్నాడు. "ఇంతట్లోకే ఎక్కడకు పోయిందో; ఎప్పుడూ యింతే" అని విసుకుకున్నాడు. పుస్తకాలు ఇటూ అటూ విసరికొట్టాడు. చివరకు దొరికింది—పొడుంకాయ! రొండినున్న పొడుం కాయసంగతి మరచిపోయి యింత బాధపడ్డాడు. ఒకపట్టు పొడుంపీల్చుకొని భాగవతం పుస్తకంకోసం వెతికి, తరవాత పేజికోసం వెతికి, వ్యాసపీఠంమీాద పెట్టి, మళ్లీ పురాణం చెప్పడం మొదలుపెట్టాడు. అరగంట అయింది. పొడుం పీల్చుకోవాలని బుద్ధి పుట్టింది. మళ్ళీ పొడుంకాయ వేట

ప్రారంభం. గుర్తుగా ఉండాలని కాలిక్రింద పెట్టుకొన్నపొడుం కాయ కనబడదు. యథాప్రకారం మళ్లీ చేయవలసిన పను లన్నీ చేసి భార్యనీ పిల్లలనీ తిట్టినతరువాత గావంచాలో పొడుంకాయ దొరికింది.

ఆయన చాలా తమాషామనిషి. ఒకమారు ఆయన పంక్తిని కూర్చుని భోజనము చేస్తున్నాను. ఆయన భార్య పచ్చడి వడ్డించేటప్పుడు చెయ్యి జారి సగం పచ్చడి కిందా, సగం విస్తట్లోనూ పడింది. ఆయన ఏమీ కోపం చెయ్య లేదు. నెమ్మదిగా "ఏదీ ఒసే, కొంచెం బుర్రవంచు. ఆ నెత్తి మీాదా అవి యేమిటి?" అన్నాడు. ఆవిడ ఏమిటో అనుకొని బుర్ర వంచింది. ఆయన పరిశీలనగా రెండు నిముషాలు చూచి 'అబ్బే మరేమీాలేదు. నెత్తిమీాదకుగానే వచ్చా యేమో నని చూచాను' అన్నాడు. ఆవిడ ఏమిటంది. ఆయన వికటంగా 'కళ్ళు' అన్నాడు.

ఇంకోమారు ఆయనా నేను భోజనము చేస్తూఉన్నాము. ఆవిడ చారు వడ్డించింది. ఆయన పురిపెడు చారు పుచ్చు కొని ఒకమారు సకిలించి, పెళ్ళాన్ని పిలిచి "చూడొసే; నాలుక ఎలాగ ఉందో ఒకమాటు చూడు," అన్నాడు. ఆవిడ చూచి బాగానే ఉన్నదన్నది. ఆయన "బాగా చూడు. చిల్లులూ ఏమీా పడలేదుగదా" అన్నాడు. ఆవిడ బుర్రవంచుకొని వెళ్లిపోయింది.

ఇంక ఆవిడ సంగతి. ఆవిడ మొగంనిండా చక్కగా బొట్టు పెట్టుకొంటుంది. ఎంత పెద్దబొట్టు పెట్టుకుంటే అంతకాలం అయిదో తనం అనుభవించ వచ్చునని ఆవిడ ఊహ.

మొగుడు తనతో సంతోషంగా మాట్లాడిన రోజున—అంటే నీకు కొత్తచీరకొనిపెట్టనా అనీ, తెల్ల ముక్కుపుడక చేయించనా అనీ, కాసులు గుచ్చుకోడానికి దారం పేనిపెట్టనా అనీ ఈరీతిగా మాట్లాడిన రోజున—ఆవిడ పెద్దబొట్టు పెట్టుకొనేది. తనకు భర్తమీాద ఏరోజునైనా అనురాగం కలిగినప్పుడుకూడా—అనగా తనకు ఇష్టమైన పెరుగుతోటకూర బజారునుంచి తెచ్చినప్పుడూ, పొరుగూరు వెళ్లి వచ్చేటప్పుడు కొత్తవుట్టిగాని పేలాలకి పచ్చజొన్నలు కాని తెచ్చినప్పుడూ—ఆవిడ పెద్దబొట్టు పెట్టుకొనేది.

తనమీాద ఎందుచేతనైనా భర్తకు కోపం వచ్చినపుడూ, లేదా తనకు భర్తమీాద కోపం వచ్చినపుడూ - అనగా దొండకాయకూర వండవద్దన్నపుడు అది వండినా, అత్తిసరు రాత్రిళ్లు పెట్టవద్దన్నా, పప్పులో బెల్లం గుమ్మడికాయ ముక్కలూ వెయ్యవద్దన్నా, పొరుగింటి వెంకమ్మ మొగుడుతో మాట్లాడినా (ఆవిడకూ వెంకమ్మకూ అలుకుగుడ్డ విషయమై ఆమధ్య పేచీవచ్చింది) ఆవిడ చాలా చిన్నబొట్టు పెట్టుకొనేది.

చాలా కోపం వచ్చినపుడు అన్నం వండడం మానివెయ్యడమే కాకుండా బొట్టు పెట్టుకోవడంకూడా మానివేసేది. తన బొట్టుకీ భర్త ఆయుర్దాయానికీ పరస్పర సంబంధం ఉన్నదని ఆవిడ అభిప్రాయము.

ఇటువంటి చిక్కులు ఆజన్మం ఉండేవే కాబట్టి దీనినిబట్టి జాతక ఫలములను సరిగా చెప్పడం కష్టము.

కొందరి చర్యలవల్ల వారి జాతకమే కాకుండా గ్రామము జాతకము దేశము జాతకమూ కూడా చెప్పవచ్చు. మాఊళ్లో

సీతయ్యగారనే ఒక పెద్దమనిషి ఉన్నాడు. ఆయనకు ఇళ్ళు కట్టించడం అంటే ఎంతో సరదా. ఆయన పునాదులు తీయించి గోడలు పెట్టడానికి అడుసూ లేకపోతే సున్నం కలిపి వీధుల్లో పెట్టి, సగం గోడ లేవదీసేటప్పటికల్లా ఎంత మండు వేసంగిలోనైనా సరే ఏకాలమునైనా సరే వాన కురిసి తీరుతుంది. పంచాంగం సహాయము లేకుండా, గవర్నమెంటువారి వాతావరణశాఖోద్యోగి సహాయం లేకుండా, వాన రాకను గురించి సీతయ్యగారి గోడల సహాయముతో చెప్పవచ్చును. ఆయన భార్య రామమ్మగారి విషయం కూడా అంతే. ఆవిడ వడియాలు పెట్టడానికి గుమ్మడికాయ తరిగి, పప్పు రుబ్బడం తరవాయిగా వాన కురిసి తీరుతుంది. ఆ వడియాలన్నీ యింట్లో ఉండి బూజుపట్టేదాకా వాన వెలవనే వెలవదు. అందుచేతనే ఆ వూరి వారంతా వానలు వెనకబట్టి నప్పుడు కుంభాభిషేకాలు మొదలైనవి చెయ్యడం తలపెట్టక సీతయ్య గారి దగ్గిరికి వచ్చి ఏదైనా గోడ కట్టమనీ, లేకపోతే రామమ్మ గారి దగ్గిరకు వచ్చి రెండు గుమ్మడికాయలూ కుంచెడు మినుములూ యిచ్చి తప్పకుండా వడియాలు పెట్టమని ప్రార్థిస్తారు. ఆ వూరికి ఎప్పుడూ అనావృష్టిదోషం పట్టలేదు. చూచారా గ్రామంయొక్క జాతకం ఒక కుటుంబంవారి చర్యలనుబట్టి ఏరీతిగా చెప్పడానికి అనుకూలముగా ఉంటుందో!

ఇక పిల్లలున్నవాళ్ళకి ఎపుడూ జాతకం మంచిది కాదని ఒక విధివాక్యము చెప్పవచ్చును. కావ్యాలలో మాత్రం, పిల్లలవల్ల భూలోకస్వర్గ మనుభవిస్తామని చెప్పబడి ఉంటుంది. కాని పిల్లలున్నవాళ్ళ అనుభవము వేరుగా ఉంటుంది.

శుభ్రముగా బట్టలు కట్టుకొని అపేక్షతో తన చిన్నపిల్ల వానిని ముద్దుపెట్టుకోవలెనని ఎత్తుకోవడంతోనే వాడు నవ్వుతూ నవ్వుతూ బట్టలన్నీ పాడుజేసి పారేస్తాడు. అనుభవించిన వాళ్లకిగాని ఇందులో సుఖం కనిపించదు.

సుఖంగా రాత్రి నిద్రపోతూంటే గొల్లున గోలపెట్టి తను నిద్రపోకుండా ఇంట్లో ఎవరినీనిద్రపోనీకుండా చేస్తాడుపిల్లవాడు. వాడిని ఓదార్చడానికి బ్రహ్మదేవుడు దిగిరావాలి. తీరా ఓదార్చేటప్పటికి తెల్లవారుతుంది. ఇంక వాళ్లు రాత్రీపగలూ చేసే అల్లరికీ, పాడుచేసే వస్తువులకూ, చింపే పుస్తకాలకూ మితిలేదు. మిగిలిన విషయాలు చూద్దామంటే— తెలివి తేటలా సున్న. ఎవరికైనా జాలిపుట్టించేస్థితిలో ఉంటారుగాని పిల్లలు ఎవరినీ మెప్పించే స్థితిలోఉండరు. ఇటువంటి పిల్లలను పెట్టుకొన్నవాళ్ల జాతకం మంచిదని ఎలాగ చెప్పవచ్చును ?

కాని యిందులో ఒక మెరుగుఉంది. ప్రతికష్టానికీ ఒక విరుగుడు ఉండిఉంటుంట. పిల్లవాళ్ల విషయంలో ఆ విరుగుడు బూచాడు. బూచాడంటూ ఒకడుండబట్టి—నిజంగా ఉన్నా లేకున్నా—పిల్లలుగలవాళ్ళు వాడిధర్మమా అని బ్రతుకుతున్నారు. లేకపోతే వాళ్ళపాట్లు చెప్పాలా ?

పూర్వకాలంలో బూచాడితోపాటు బడిపంతులు పిల్లల విషయంలో యములాడికింద ఉండేవాడు. కాని యీమధ్య ఆ హక్కు అతడు వదలుకో వలసి వచ్చింది.

జాతకం తెలుసుకోడానికి పైవిషయాలతో పాటు ఈకింది సలహా కూడా అందరూ గమనించవలసి ఉంటుంది.

ఎవరికైనా కష్టాలు తటస్థించి నపుడు అతడు – ఇది నా

ఖర్మం అనీ, లేదా విధి అనీ, లేదా జాతక మహిమ అనీ అనుకుంటాడు. 'విధి' అనేది లేక పోతే-అనేవాడు ఒక సరదా మనిషి. మనుష్యులను కష్టపెట్టడం దాని సరదా. ఎవరు ఎక్కువ లొంగుతారో వారి నది ఎక్కువగా కష్టపెట్టుతుంది. కాబట్టి మనము విధికి లొంగినట్లు ఎంతమాత్రమూ కనబడ కూడదు. మనమే విధిని లొంగ దీసుకొన్నట్లు దానికి కన బడాలి. అందుచేత ఎప్పుడూ విధిని గురించి ఫిర్యాదు చెయ్య కూడదు. విధితో కలహించకూడదు. విధికి లొంగనట్లు నటిం చాలి. ఈ విధంగా చేసినట్లయితే విధి బుర్రవంచుకొని సిగ్గు తో లేచిపోతుంది. "అయ్యో ఎంత ఖర్మం వచ్చింది" అని అన్నావా, విధి నెత్తికి తొక్కుతుంది.

గుమ్మం తలకి తగిలి బొప్పికట్టినప్పుడు తల తడుముకొని కళ్లవెంబడి నీళ్లు కార్చగూడదు. అలాగా చేస్తే విధికి లోకు వవుతాము. ఏమిచెయ్యాలంటే గుమ్మం టక్కున తగలడం తోనే నవ్వాలి. గుమ్మంకేసి చూచి గుమ్మాన్ని ఒకమాటు దువ్వాలి. గుమ్మంకర్ర చాలా గట్టిదని ప్రశంసించాలి.

రైలుబండికోసం ప్రయాణమై వెళ్ళితే జాతకం బాగు లేనపుడు అది తప్పిపోతుంది. అలాంటపుడు 'అయ్యో బండి తప్పిపోయిందే' అనకూడదు. బండి తప్పిపోవాలనే ఉద్దేశ్య ముతోనే తానక్కడకు వెళ్లినట్లు నటిస్తే విధి లొంగిపోతుంది. లేకపోతే విధి అనేక చిక్కులు పెట్టుతుంది.

ఒకకూలివాడిచేతికి నేతిచెంబిచ్చి నేను ముందు నడుస్తు న్నాను. అపుడు నాకు జాతకం జబ్బురోజులు. నాజాతక ప్రభావమువల్ల వాడు రాతిని తన్ని కిందబడి నెయ్యి పార

పోశాడు. వాడితో నేను దెబ్బలాడతానని విధి అనుకొన్నది. నే నాసంగతి గ్రహించి వాడితో సాదరంగా మాట్లాడి కాలికి దెబ్బతగలలేదుగదా అని ఊరడించి నిర్ణయించిన కూలికంటె అర్ధణా ఎక్కువయిచ్చి పంపించివేశాను. విధి సిగ్గుపడి పారిపోయింది.

ఏదైనా పత్రికకు వ్యాసం గాని పద్యం గాని పంపించి దానిని చప్పున ప్రకటించక పోయినట్లయితే విసుగుకో కూడదు. ఆలస్యంగా ప్రకటిస్తారనే ఉద్దేశముతోనే వాటిని పంపినట్లు నటిస్తేనేగాని విధి లోకువ గట్టుతుంది. అందుచేత ఏమిచెయ్యాలంటే, ఆ పత్రికాధిపతికి ఉత్తరం వ్రాసి ఆల స్యంగా వేసినందుకు తన కృతజ్ఞత తెలియజెయ్యాలి. "మీరు నా వ్యాసము ఆరునెలల తరువాత మీ పత్రి కలో ప్రకటించినందుకు నేను చాలా కృతజ్ఞుడను. ఇక ముం దుకూడా యీరీతిగానే నా వ్యాసములు ప్రకటిస్తూ ఉంటే నేను చాలా సంతోషిస్తాను. మీరు అలస్యంగా వేస్తారనే షరతుమీాదనే మీకు నా రచనలు పంపుతూ ఉంటాను." అని ఈ మాదిరిగా ఉత్తరం వ్రాయాలి. విధిని జయించడానికి, ఎప్పుడూ జాతకం బాగుపడని గ్రంథకర్తలకు, ఇదేమార్గం.

ఈ వ్యాసములో సుళువు బలువులు గ్రహించి మెలకువలు తెలుసుకొని ఎవరిజాతకం వారు తమ తమ దినచర్యలనుబట్టి తెలిసికోవడముకు ప్రయత్నంచేస్తూ ఉన్నట్లయితే నా శ్రమ వ్యర్థము కాలేదని తలుచుకొనడముకు అవకాశం చిక్కు తుంది.

# సరస్వతీ పూజ

"కొయ్యబొమ్మలు మెచ్చుకళ్ళకు
కోమలుల సౌరెక్కునా?"

ఆవూరు వెళ్ళడము నాకదే ప్రథమము. ఊరంటే మరేమీ ప్రసిద్ధమైన ఊరుకాదది, అన్ని ఊళ్ళవంటిదే అని మొదట నే ననుకొన్నాను. కాని రెండురోజులపాటు ఆ ఊళ్లో ఉండడముతోనే అక్కడి విశేషమొకటి నాకు బోధపడినది. శాక్తేయులూ వామాచారులూ రామనుజకూటస్థులూ చాలా మంది ఆ ఊళ్లో ఉన్నా రనుకొన్నాను. ఒక శాస్త్రుల్లుగారు మడిబట్టలు కట్టుకొని మొగమునిండా కుంకుమబొట్టు పెట్టుకొని రాగి జారీచెంబు చేతితో పట్టుకొని కాళ్ళు ఎత్తెత్తి వేసుకొంటూ ఆదారిని వెళ్లుతున్నాడు. నేను ఆయనకు నమస్కారము చేసి కుశలప్రశ్న అడగబోయినానో లేదో "లేలే దూరంగా దూరంగా. ఊరుఅంతా మాలకూడు తీసుకువచ్చి కలుపుతున్నారు. ఒక నియమంలేదు. ఒక వ్యాకరణంలేదు- ఒక ఛందస్సులేదు—వీళ్ళబొంద. దూరంగావెళ్లు—" అని ఆయనే నన్ను కుశలప్రశ్న చేసినాడు. కిక్కురు మనకుండా తలవంచుకొని దూరముగా తొలిగిపోయినాను. ఇదేమి శాక్తేయమతము దేవుడా! వ్యాకరణ మంటాడు, ఛందస్సంటాడు, తిడతాడు, అని ఆశ్చర్యపడ్డాను.

గండభేరుండంచు పంచె కట్టుకొని నఖశిఖ పర్యంతమూ నామాలు ఒత్తుగా పెట్టుకొని ఒక ఆచార్యులుగారు తాంబూలము వేసుకుంటూ ఒక వేశ్యకు మంత్రోపదేశము చేస్తున్నాడు. ఏమిటి చెప్తాడ్రు ఈ మంత్రమని ఆలోచించి రామానుజకూటములో రహస్యాలు భేదించడానికి సామాన్యమానవులకు దుస్తరమని అనుకొంటూ ఉండగా ఆయన బిగ్గరగా "అక్కడ అరసున్న ఏదు! మరిచావా అర్ధానుస్వారనిఘంటువప్పుడే పోతున్నది, తగులబడి పోతున్నది! ఎంతని మొత్తుకొనేది ? కవిత్వానికల్లా శృంగారరసం ప్రధానంకదా. చెపితే కవిత్వం వేశ్య చెప్పాలి, అని నేను ఎంత అఘోరించినా ఏ అరసున్నో ఏ బండిరాఁ వదలిపెట్టి కవిత్వాన్ని చంపేశేస్తున్నావు!" అని ఆపెడమీాద కోపపడుతున్నాడు.

ఆఊళ్లో చాలామంది ఈ మాదిరిజనము ఉండడము కనిపెట్టినాను. నే ననుకొన్నట్టు వాళ్లు శాక్తేయులూకారు, రామానుజకూటస్థులూకారు. అయితే మరి యెవరని ప్రశ్న వచ్చింది. మరి యెవళ్లో అయితే ఈ కుంఖంబొట్లేమిటి ? ఈ యెఱ్ఱబడ్డ కళ్లేమిటి? ఈ పంగనామము లేమిటి ? ఈ గంధాక్షతలపూత లేమిటి ? ఈ మడికట్టుకోడా లేమిటి? అనిపించింది.

ఆలోచించగా ఒకసంగతిస్ఫురించింది. మతవిషయాలలో వామాచారమూ రామానుజకూటమూ బయలుదేరదీసినట్లే భాషావిషయములోకూడా తత్తుల్యమైన ఒకకూటముబయలుదేరదీశారు కాబోలు ఈ ఊళ్లో బుద్ధిమంతులు అనుకొన్నాను. చూచినకొద్దీ నా అభిప్రాయము దృఢపడ్డది. దీనిసంగతి సందర్భాలు తెలుసుకోవలెనని నాకు ఇచ్ఛపుట్టింది. అందుకోసము

ఒక శాస్త్రుర్లుగారి స్నేహము చేశాను. ఆయన కిష్టప్పశాస్త్రుల్లు గారు. శాస్త్రుల్లుగారు సరసులు. కొంతమంది కవిత్వమంటే చెవికోసుకొంటారు. ఆయన చెవే కాకుండా ముక్కూ చేతులూ కాళ్ళూ వగైరా అవయవాలు కోసుకొంటారు. అందుచేతనే నేను ఆయన్ను పట్టాను. ఆయన పరిచయము కోసము కష్టపడి ఒకపద్యము కూడా సంపాదించాను.

అసలు కిష్టప్ప శాస్త్రుల్లుగారు కవిత్వముకోసము మడి మాన్యాలు అమ్మివేశారు. ఆయన కష్టపడి వ్రాసిన కొన్ని పద్యాలు మాత్రము వార్ధకములో మిగిలినవి. అవే సంతానముగా అవే ఆస్తిగా అవే సిరీ సంపత్తుగా ఆయన చూచుకొంటున్నారు. ఆ పద్యాలను పురస్కరించుకొని ఆయన భాషకు సంబంధించిన రామానుజ కూటములో ప్రవేశించిన మాటవిని ఆయనను ఆశ్రయించాను. నేను కిష్టప్ప శాస్త్రుల్లుగారు ఆ కూటానికి మూలవిరాట్టు లయినారు. ఆయనను ఆశ్రయిస్తే నాకు లభ్యము కాని దేమిటి?

ఒకనాడు ఉదయమే నేను మడి కట్టుకొని గంధాక్షతలు ఒత్తుగా పెట్టుకొని పూర్ణానుస్వారవంటి తావళాలు మెళ్లో వేసుకొని, చేతిలో అప్పకవీయము బాల వ్యాకరణము కవి కంఠపాశమూ పట్టుకొని కిష్టప్ప శాస్త్రుల్లుగారి యింటికి వెళ్ళి నాను. తోవలో కనిపించిన కత్తిరింపు జుట్టు కుర్రవాళ్ళను చూచి దూరముగా తొలిగిపోయి వాళ్ళను నాలుగుతిట్టి వాళ్లచేత నాలుగుపడి శాస్త్రుర్లుగారింటికివచ్చి కాళ్లుకడుక్కొని ఆచమనము చేసి, సంగతిఅంతా ఆయనతో క్రమముగా చెప్పినాను.

ఇంట్లో ప్రవేశించగానే ఆయనకు మొదట అమాంత ముగా సాష్టాంగప్రణామముచేసి సున్నాలపన్నము ఏక రువు పెట్టినాను. నన్ను కూచోబెట్టి ఆయన నాబళ్లు నిమిరి దీవించారు. నాసంగతి సందర్భాలు నేను చెప్పకముందే ఆయన ఇలా ప్రారంభించారు :-

"విన్నారండీ, కలికాలమాహాత్యము ! రాజన్నవాడు అపరాధులను దండించకపోతే అటువంటివాడు ఉండిన నేమి తాను మఱి యూడిననేమి ధరాతలంబునన్ ఏ మంటారు ? మాట్లాడ రేం ? "

"చిత్తం చిత్తం" అన్నాను నేను.

"దేశద్రోహమే ద్రోహమా ? భాషాద్రోహం ద్రోహం కాదూ ? మాట్లాడ రేం ? "

"చిత్తం చిత్తం."

"తగల బెట్టేస్తున్నారు భాషని ! అరసున్న లక్కర లేదట, శకటరేఫలు—ఊఁ. మాట్లాడ రేం ? "

"చిత్తం చిత్తం."

"నేనే రాజునైతేనా వీళ్లందరికీ ద్వీపాంతరవాస శిక్ష వేతును, వీళ్ళను కొరత వేయింతును ! "

"చిత్తం, తప్పకుండా చేయించేవారే."

"మరి మనలోమాట. నే నొక్క ప్రశ్న అడుగుతాను, చెప్పండి. అందరూ జట్కాబండి జట్కాబండి అంటారుగదా నిజంగా అది జట్కాబండా ? "

"నాకు తెలియదు. తమరే సెలవియ్యాలి."

"అదినిజంగాజట్కాబండికాదు అవునంటారాకాదంటారా?"

"తమరు సెలవిచ్చాక ఎందు కవుతుంది ?"

"అది చట్కాబండి అండీ. సరళాదేశమువల్ల వచ్చిన జకారాన్ని పట్టుకొని.... మాట్లాడ రేం ?"

"చిత్తం పూర్వకవులుకూడా, అందులో కవిత్రయము వారు ముఖ్యంగా వాడారని తోస్తుంది."

"వాడరుటండీ ? మీకు చాద స్తమా యేమిటి ? చట్కా బండిమీద పెట్టి ఈవాదమంతా కావ్యం వ్రాస్తున్నాను. విన్నారా ?"

"చిత్తం."

"ఈ అల్లరి సజ్జు కుర్రవాళ్ళను గురించి మొన్న ఒక ప్రహసనం వ్రాశాను. చిత్తగించారా ?"

"చిత్తం చిత్తం."

"వాళ్ళంతా తల నేలకు వేసి కొట్టుకోవా లన్నమాట– ఏదో కవిత్వంటండీ, దానిపేరు నాకు రాకుండా ఉంది. దాని బొంద! అదిటండి ఈకాలంలోకవిత్వమనిపించుకుంటోందట."

"చిత్తం చిత్తం."

"మీరు గాని వాళ్ళను మీదరిమానాకు రానివ్వకండి సుమీ."

"చిత్తం చిత్తం. ఎంతమాట సెలవిచ్చారు! వాళ్ళ మూలాన నాకు రోజుకు నాలుగైదుమార్లు స్నానం తప్పడం లేదు."

"అవును. ఇప్పు డంతా తెలుగు మీరి పోతున్నారు. ఈ వార్ధక్యంలో స్నానాలు చెయ్యలేక నేను ఇల్లు కదలడమే లేదు ఈ మధ్య."

"చిత్తం చిత్తం తమరు ఈ మధ్య వ్రాయించిన దిగ్విజయయాత్ర బహు ఆనందముతో చదివాను."

"ఆలాగటండీ. చెప్పారుకారు. శ్రీపతి దిగ్విజయము సుమండీ అది."

"చిత్తం చిత్తం. ఫణితి బహు రమ్యంగాఉంది."

"ఆఁ. అదీ అదీ. అయితే మీరు మారామానుజకూటం లో ప్రవేశించారా లేదా ?"

"లేదు. తమబోటివారి పరిచర్య కొంతకాలం చేసిన తర్వాత—"

"బాగుబాగు. రోజూ వస్తూ ఉండండి. సద్గ్రంధకాల క్షేపం చేయవచ్చును."

"చిత్తం చిత్తం. చూచారండీ ఈ పద్యం ఎవరో పూర్వ కవి వ్రాసిందండి. తమబోటివారికి చూపించి స్వారస్యము గ్రహింతామని—"

"ఏదీ చదవండి."

"కంధరము ధరము ధరమును
కంధరధర ధరము ధరము కచ కుచ కటి వా
క్సింధురమా సింధుర మా
సింధురమా వైభవంబు చెలికిం జూడన్."

"ఓహో ఏమిపద్యమండీ, ఏమి తెలుగండీ, ఏమి కవిత్వ మండీ, ఏమి కవిత్వమండీ!"

"మహాదొడ్డ కవిత్వమనే నేను—"

"ఓహోహో, ఏమి పసతన మున్నకవిత్వమండి ! ఏమి శబ్దసౌష్ఠవము, ఏమి అర్థగాంభీర్యము, ఏమి జటిలత ! ఎక్కడ

సంపాదించారో కాని మూడొడ్డ పద్యమండీ. పోనివ్వకండి. పద్యం భద్రంగా దాచండి."

"చిత్తం చిత్తం."

"ఇటువంటి కవిత్వం ఉండగా తగుదునమ్మా అని ఈ కాలంలో కుర్రకుంకలంతా—ఊఁ మాటాడరేం ?"

"చిత్తం చిత్తం,"

"ఇష్టం వచ్చినట్టు తగలేస్తున్నారండీ భావనంతానూ."

"ఎన్నివిపరీతాలేనా పుట్టుతున్నాయండీ ఈకలికాలంలో"

"సరే. ఈమారు ఈపద్యం సంగతి చూతాము నిఘంటువులు అటకమీాద ఉన్నవి లెండి, అవి తీయించిన మీాదట—"

" చిత్తం చిత్తం. "

" మీారు వెళ్ళి స్నానం చెయ్యండి మరిచిపోక. నేనూ స్నానానికి లేస్తున్నాను. చెప్పరాని వాళ్ళను గురించి చాలా మాట్లాడుకొన్నాం. స్నానం చేస్తేనే గాని .... "

" చిత్తం చిత్తం. "

౨

నాకు కిష్టప్పశాస్త్రుర్లుగారి పరిచయలాభము కలిగినతర్వాత క్రమక్రమముగా కూటస్థుల పరిచయము కూడా కలిగింది. కూటములో ముఖ్యముగా చెప్పతగ్గవారు చిట్టెయ్యగారు. అసలు ఈకూటాన్ని స్థాపించింది ఈయనే అని వదంతి. డబ్బాలు చేయించడమూ వాయించడమూ ఈయనకు బాగా తెలుసును. ప్రపంచములో డబ్బా మొట్టమొదట కనిపెట్టిన మహానుభావు డీయనే అని చెప్పుకొంటారు. ఈయన మొదట తనడబ్బా వాయించినపుడు ఆధ్వనిమాధుర్యము గ్రహించి

మిగిలినవా ళ్ళందరూ డబ్బాలు వాయించడము నేర్చు కొన్నారు; ఈ డబ్బాభాషతోనే మాట్లాడు కోవడము నేర్చు కొంటున్నారు.

ఇంతే కాకుండా ఈయన ముచ్చిబొమ్మలు చేయగల నేర్పు కలవాడుకూడాను. ఈయన చేసినబొమ్మలలో ముఖ్య ముగా ఎన్నతగ్గది సరస్వతీవిగ్రహము. ఆవిగ్రహము చాలా సొగసైన దని పండితులు చెప్పుకొంటారు. చూతామంటే విగ్రహాకారము కనబడదు. ముస్తాబు - దుస్తులు, అలంకా రాలు, రంగులు - విస్తారముగా ఉండడముమూలాన అసలు విగ్రహము ఎటువంటిదో ఇంతవరకు ఎవరూ చూచి ఉండ లేదు : ముస్తాబు చూచినవారే అందరూను. ఆవిగ్రహము జీవకళలతో ఉట్టిపడుతూ ఉన్నదని మొదట చెప్పి తర్వాత అది నిజముగా సజీవ అయిన సరస్వతీ అని నిర్ణయించినారు వారిశిష్యులు. ఈకూటానికి చిట్టయ్యే మూలపురుషుడు. కాబట్టి ఈయనను అందరూ పూజిస్తారు.

తరువాత కూటకార్యములు సరిగా నడిపించడానికి శ్రీరాములు మేస్త్రీ ఉన్నాడు. ఆయన చాలా గడుసువాడు. పిల్లిమీద ఎలుకనూ ఎలుకమీద పిల్లినీ ఎక్కించి సర్కసు చేయించే నేర్పుకలవాడు. లాభము లేని వ్యవహారము చేసిన వాడుకాడు ఎన్నడూను, చాలాకాలమునుంచి మేస్త్రీగా తరిఫీతయినమనిషి. డబ్బాలు వాయింపించడములోనూ ముచ్చిబొమ్మలు చేయించడములోనూ ముచ్చిబొమ్మలకు మొక్కుబళ్ళు చెల్లింపించడములోనూ శ్రీరాములు మేస్త్రీకి మించిన చెయ్యిలేదు. ఆయన ఆమధ్య డబ్బా వాయించడము

నేర్చుకోడానికి ప్రయత్నము చేశాడు, కాని ఆపని ఆయనకు చేతకాలేదు. సరస్వతీ విగ్రహాలు చేయించడముకోసమని అక్కడో యెముకా అక్కడో యెముకా సంపాదించి ఆయన చిట్టెయ్య శిష్యులకు ఇస్తూఉంటాడు; ఆ యెముకలు కూర్చి వాళ్ళు విగ్రహాముగా ఏర్పాటుచేసి దాన్ని పూజించుకొంటూ ఉండేటట్టు చేస్తాడు. శ్రీరాములుమేస్త్రీ పలుకుబడి కలవాడు, మాటకారి. ఆయనకు ఆశ్రయము ఉన్నది. ఏదో మిష పెట్టి రెండురాళ్ళు సంపాదించు కొంటున్నాడు. తనను ఆశ్రయిం చినవాళ్ళకు రెండురాళ్ళు ఎవరిచేతనైనా ముట్టజెప్పిస్తూ ఉంటాడుకూడాను.

ఆయన గాక పురోహితుడు వెంకటావధాను లొకాయన ఉన్నాడు కూటములో - మనిషి చాలా ఆచారవంతుడు. అసలు పుట్టడములోనే మడిగా పుట్టినాడు ఆ మహానుభావుడు మడిగా బతుకుకొంటూ వస్తున్నాడు. మడిగా ముసిలితనము గడుపుతున్నాడు. ప్రపంచములో మడికట్టుకొన్నవాళ్ళు ఎవ ళ్ళయినా ఉన్నారా అంటే వేలుమడిచి చెప్పుకోదగ్గ మనిషి వెంకటావధానులు. ఆయన చాలా తెలిసినవాడని చాలా మంది చెప్పుకొంటారు. నలభీమ పాకాలను మించి ఉంటుం దట ఆయన కవిత్వపాకము ! పైకి మడికట్టుకొన్నట్టు కనిపిం చినా క్రియకు చాలామార్లు ఆయన మడికట్టుకోనివాళ్ళు చేసేపనులు చేసినాడని నిదర్శనాలున్నవి. మడిమాట ఒక మూలపెట్టి మాట్లాడితే, వెంకటావధానులు మొత్తమువిూద చాలా సరసుడని చెప్పుకోవచ్చును.

ఈయన కాక ప్రతిసభలోనూ అగ్రతాంబూలము స్వీక

రించే సుబ్బయ్యా ఒకాయన ఉన్నాడు. ఆయన చిట్టెయ్యా శిష్యుడు. చిట్టెయ్యాడబ్బాను చూచి ఆ పంపిణీ మార్చి ఒక మోస్తరు క్రొత్తడబ్బా చేయించి దానిని వాయిస్తూ ఉంటాడాయన. డబ్బా భాషతోనే దేవుణ్ణి కొలవాలనీ అలా చేస్తే దేవుడు ప్రత్యక్షమవుతాడనీ ఆయన ఆశయము. ఇతర భాషలు దేవునికి ప్రీతికరము కావట. సుబ్బయ్యా భక్తుడు. అందుచేతనే అగ్రతాంబూలాలు పుచ్చుకోవడము.

కూటస్థ ప్రధానపురుషులలో ఒక రయిన లక్ష్మీనరసు సంగతి ఇక చెప్పవలసి ఉన్నది. ఆయన లెక్కలే నన్ని పూర్వ జన్మాలెత్తినాడు. అన్నిజన్మలలోనూ అత్తగారై పుట్టి అధికారము చెలాయించి చెలాయించి ఈజన్మలో లక్ష్మీనరసుగా అవతరించి పూర్వవాసన ఏ మాత్రమూ పోనివ్వకుండా కాపాడుకొంటూ కర్రపెత్తనము చేస్తూ ఉంటాడు. ఆయన ప్రపంచాన్నంతనూ తనకోడలుగా భావించి ఆకోడలిని ఎపుడూ అత్తగారి సాధింపులు సాధిస్తూ ఉంటాడు. చేటలతో చెరిగి దుమ్మెత్తి పోయగల నేర్పు ఆయనకు బాగా ఉన్నది. లక్ష్మీనరుసుకు వచ్చినతిట్లకూ శాపనార్థాలకూ మితి లేదు. ఆయన నాలుక నాలుక కాదు — కొరడా. క్రొత్తసరుకు తెచ్చి దానిమీద పాతసరు కని ముద్రవేసి చెలామణీ చేయించడములో ఆయన అందరినీ మించిన చెయ్యి.

వీరుగాక ఆశ్రితులు వగైరాలు చాలామంది ఈ కూటములో ఉన్నారు. వారందరితోనూ పరిచయము చేసుకొన్నాను. చేసుకొని వారి మందిరానికి రాకపోకలు చేస్తూ ఉండేవాడను. కూటమువారు సమావేశమయ్యే మందిర

ములో ఒక చీకటికొట్టు ఉన్నది. ఆకొట్లో ఉన్నది సరస్వతి విగ్రహము. ఈ బొమ్మను పూజచేయడానికీ, కంచుకోత్సవమువంటి ఉత్సవాలు జరపడానికీ కూటస్థులందరూ మందిరములో సమావేశమవుతూ ఉంటారు. ఎపుడు వెళ్ళిచూచినా మందిరములో ఎవరో కొందరు కూటస్థులు ఏదో ఒకపని చేస్తూ ఉంటారు. కొందరు చిట్టెయ్య శిష్యులను ఆశ్రయించి మచ్చిబొమ్మలు చెయ్యడము నేర్చుకొంటూ ఉంటారు. చీకటికొట్టులో బొమ్మను పూజించడమే కాకుండా ఎవరి విగ్రహము వారు చేసుకొని ఎవరిడబ్బా వారు వాయిస్తూ పూజ చేసుకొంటూ ఉంటారు. పార్థివలింగపూజ చేసేవాళ్లు ఏరోజు లింగము ఆరోజు చేసుకొన్నట్లే వీరిలో కొందరు ఏ రోజుబొమ్మ ఆరోజు చేసుకొంటూ ఉంటారుకూడాను.

మరికొందరు ఎప్పుడూ ప్రాయశ్చిత్తము చేయించుకొంటూ మందిరములో ఉండడము మనము చూడవచ్చును. వర్ణసంకరులతో సహవాసము చేసినందుకూ, వాగ్దోషము వచ్చినందుకూ—అనగా పుటలో వెయ్యవలసినన్ని అర్ధానుస్వారలు, శకటరేఫలు వెయ్యనందుకూ—వీరు ప్రాయశ్చిత్తము చేయించుకొంటూ ఉంటారు. అందుకోసమై కూటము వారు రెండు ఆవులనుకూడా పెంచుతున్నారు. మరికొందరు మేస్త్రీ నాశ్రయించి ఎముకలకొరకూ రాళ్ళకొరకూ దేవులాడుతూ ఉంటారు. మరికొందరు స్నానాలు చేస్తూనో మడి కట్టుకొంటూనో పుండ్రములు ధరించుకొంటూనో ఉంటారు.

చీకటిగదిలో బొమ్మను చూడాలని బుద్ధి పుట్టి ఆసంగతి కిష్టప్పశాస్త్రుల్లుగారితో ప్రశంసించాను.

"ఆఁ. తప్పు తప్పు! విగ్రహాము చూస్తే చాలా దోషం! కళ్లుపోతవి! మనపని ఎంతసేపూ పూజ చెయ్యడమేకాని లోపల ఏముంది బయట ఏముంది అని తర్కం ప్రారంభించ గూడదు. ఏమంటావు?" అన్నాడాయన.

"చిత్తం చిత్తం."

"చెప్పలేదూ భగవద్గీతలో—ఎంతసేపూ మనధర్మము మనము నిర్వర్తిస్తూ ఉండవలెను. ఫలము కోరకూడదు హేతువాదాలు పెట్టుకొనుటవల్ల ఏమీ లాభము లేదు. మాట్లాడవేం? అవునా కాదా?"

"చిత్తం చిత్తం."

"మేలిముసుగులో ఏముందో అనీ, చీకటి గదిలో ఏముందో అనీ, మనము కాలము వ్యర్థము చేసుకోగూడదు. అదంతా చిదంబరరహస్యముగా చూచుకోవాలి. అవునా కాదా?"

"చిత్తం చిత్తం."

"విన్నావూ చట్కాబండీకావ్యము సగము అయింది సుమా ...."

ఈరీతిగా ఆయన కథలోకి దిగినారు. ఇంక నీళ్ళను అడిగితే లాభము లేదనుకొని బాల్యచాపలము జయించలేక రహస్యభేదనము చేతామని ఊహించాను. ఎవరూ లేకుండా చూచి ఒకనాడు గదిలో ప్రవేశించి దీపము వెలిగించి చూచాను. కొట్టులో చాలా విగ్రహాలున్నవి. విగ్రహాలంటే విగ్రహాలుకావు; విగ్రహాకారముతో ఉన్న రంగురంగుల చీరలూ, ముచ్చి బంగారుతో చేసిన ఆభరణాలూ.

అన్నిటికన్నా పెద్ద విగ్రహమొకటి ఒకపీఠముమీద ఉన్నది. అదే చిట్టెయ్య చేసిన విగ్రహమని తోచింది. దానికి దక్షిణాది చీరలు దిట్టముగా కట్టబెట్టినారు. పాతసరుకు కరిగించి చేసిన నగలుకూడా ఉన్నవి. పై వేషముమాట కేమి, అసలు విగ్రహ మెంత అందముగా ఉన్నదో చూతామని పరీక్షించాను. అసలు విగ్రహము లేదు. పదకొండో శతాబ్దము మొదలుకొని నేటివరకూ దొరికిన యెముకలూ, చేత యెముకలూ మాత్రమున్నవి. ముక్కూ చెవులూ ఉన్నవో లేవో. కళ్ళు అసలే లేవు. విగ్రహానికి వాహనము శకటరేఖా కారముగా ఉన్నది. కిరీటము సున్నలతోనూ అర సున్నలతోనూ రమ్యముగా చేసినాడు.

విగ్రహా లన్నీ దీని పుత్రికలే. తేడా మాత్రము కొంచెమున్నది. సంపాదించిన యెముకలలో గాని, స్వయముగా చేసిన యెముకలలో గాని పాతకొత్తల తేడా ఒకటీ, కిరీటాకారాలలో తేడా ఒకటీ. అది కాక చీరలలో తారతమ్యము బాగా కనిపిస్తున్నది. కొందరు దక్షిణాది చీరలు తమవిగ్రహాలకు కట్టినారు; కొందరు ఈకాలపు ఉప్పాడ చీరెలు చుట్టబెట్టినారు; కొందరు నెల్లూరు పుట్టములు కట్టినారు; కొందరు చిత్తూరు ఖద్దరు బట్టలు చుట్టబెట్టినారు. తూట్లు పడ్డపూర్వకాలపు బట్టలు కప్పినారు కొందరు.

ఆగదిలో నేపూజాద్రవ్యములుకూడా ఉన్నవి. చేతపువ్వులూ, కాకితాలతో చేసిన పత్రివర్గరావస్తువులు ఏమేమో ఉన్నవి.

చిదంబర రహస్యము తెలిసినది. ప్రపంచములో ఎటువంటి వింతలైనా ఉంటవి; ఎంతటి బుద్ధిమంతులైనా ఉంటా

రని ఆశ్చర్యపోయినాను. కూటము సంగతి సందర్భములు తెలిసినవికదా ఇక ఆ ఊరు విడిచివెళ్లవలెనని ఊహించాను. కాని కూటము సాంవత్సరికోత్సవము నేడో రేపో జరగబోతున్నదని విని ఆవింతకూడా చూతామని ఆగిపోయినాను.

౪

వార్షికోత్సవము సమీపించిన దనగానే కూటస్థులందరూ ఒక్కమారు ప్రాయశ్చిత్తము చేయించుకొన్నారు. పాచి చేసుకోడానికి పారిగిండ్లవారికి కాస్త గోమయమయినా దొరకలేదు. ప్రాయశ్చిత్త మయిపోయినతర్వాత కొందరు చిట్టెయ్యనాశ్రయించి కొత్తకొత్త డబ్బాలూ డప్పులూ చేయించుకొన్నారు. శ్రీరాములు మేస్త్రీ బాజా భజంత్రీలను సిద్ధము చేసినాడు. ఆనాటికని కొత్తకొత్తగా సంపాదించిన ఎముకలతో కొత్తకొత్త బొమ్మలు తయారుచేశారు. అనాచారవంతుల నందరినీ నోటికి వచ్చినట్టు తిట్టడానికి లక్ష్మీనర్సును నియమించారు. అందుకోసమని ఆయన కత్తులూ కఠార్లూ తయారుచేస్తున్నాడు. గ్రామ్యు లందరికీ చిల్లంగిపెట్టి ప్రయోగము చేస్తానని కిష్టప్ప శాస్త్రుల్లుగారు పూనుకొన్నారు. అందుకోసమని ఆయన కొంతకాలము వరకూ చట్కాకావ్య రచన కట్టిపెట్టినాడు. శ్రీరాములుమేస్త్రీ పైహంగు యావత్తూ చేస్తున్నాడు. ఈరూపముగా రెండురాళ్ళు కొట్టుకొందామని బతుకుతెలివి కలవాళ్ళు ఆయనను ఆశ్రయించారు. కొత్తవాళ్ళను కూటములో చేర్చుకొనడానికి చాలా ప్రయత్నాలు జరిగినవి. నన్ను కూటములో చేరమని కిష్టప్పశాస్త్రుల్లు చాలా బలవంతపెట్టినాడు. "ఇంకా తమవంటివారి శుశ్రూష

కొంతకాలము చేస్తేనేగాని అంతపదవికి తగ”నని నేను సమాధానము చెప్పినాను. నేను కూటములో చేరితే నాకు కోశాధ్యక్షపదవి ఇప్పిస్తాననీ, నాచేత పుస్తకాలు వ్రాయించి టెక్స్టుబుక్కులుగా పెట్టించి లాభము వచ్చేటట్టు చేస్తాననీ శ్రీరాములుమేస్త్రీ చాలాచాలా చెప్పినాడు. కాని నాకు ప్రాప్తము ఉండవద్దూ!

కూటస్థులలో ప్రసిద్ధులూ, కూటము మీద సానుభూతి గల తత్తుల్యులూ ఆనాడు వ్యాసాలు చదవడానికి ఒప్పుకొన్నారు. కొంతమంది వ్యాసాలు సంస్కృతములోనూ, కొందరు పద్యరూపముగాను, కొందరు గద్య చిత్ర బంధ కవిత్వముతోనూ, కొంతమంది శ్లేషయమకాదులతోనూ బహుచక్కగా భారత మంతేసి గ్రంథములు వ్రాసి యిచ్చినారు శ్రీరాములు మేస్త్రీకి. ఆయన వాటన్నింటినీ పరీక్షించి చూచి ఆంధ్ర దేశము వాఙ్మయవిషయములో వెనుకంజ వెయ్యడము లేదు గదా అని సంతోషించినాడు. ఆవ్యాసములలో విషయము లివి.

౧. గ్రాంథిక కృతకవాణీ కూట ప్రాశస్త్యము.

౨. తొమ్మిదవ శతాబ్దమున ఎముక లున్నవా?

౩. టిట్టెయ్య జన్మస్థానమునకు సంబంధిచిన కంపునదీ చరిత్ర.

౪. కుసుమలు పండుటకు ఎట్టియెరువు ఉపయోగించవలెను?

౫. అర్ధచంద్రాకృతి గల అర్ధానుస్వారధారిణి యగు ఆంధ్ర భాషా యోష చంద్రముఖి కాదా?

౬. ఆంధ్రమందున్న అన్యభాషాపదముల నేల తొలగింపరాదు ?

౭. చచ్చుము శబ్ద సాధుత్వాసాధుత్వములు.

౮. దోమకు కన్నులున్నవా ?

౯. కిరసనాయిలు నూనె.

౧౦. ప్రపంచ భాషలయం దాంధ్రమున కెట్టిస్థానము లభ్యము కాగలదో కిష్టప్పగారి కావ్యములనుబట్టి నిర్ణయించుట.

ఈ వ్యాసములు చదివేవారు ప్రౌఢకవి భయంకరులూ, కవిసమ్రాట్టులూ, సాహిత్యాంబుధులూ. కూటము వారే ఉభయఖర్చును పెట్టుకొని వీరందరినీ పిలిపించినారు.

వస్తుంది వస్తుంది అనుకొన్న వార్షికదినము వచ్చింది. తద్దినమున వారందరికీ ఘెళ్ళుమని పిండివంటలతో భోజనాలు పెట్టినారు. ఆంధ్రదేశములో భాషాభిమానులయిన సంపన్నులకు లోటులేదు గదా! ఇక సంతర్పణలకు లోటు వస్తుందా? రోజుకు రెండు మూడుసార్లు ఫలహారాలు మొదలయినవన్నీ జరిగినవి. ఈ భోజనపు తొందరలో వ్యాసాలసంగతి అందరూ మరిచిపోయినారు. అందరికీ భోజనాలు ఫలహారము చెయ్యడమువల్ల అక్కడ ప్రత్యేకముగా ఏర్పాటుకాబడ్డ ఆంధ్ర భిషగ్వైద్యశాలకు కావలసినంతపని తగిలింది.

"చదవకపోతే ఏమిలెండి—వ్యాసాలు తర్వాత అచ్చు వేసుకోవచ్చును గదా" అన్నాడు శ్రీరాములు మేస్త్రీ.

ఏది జరిగినా ఏది జరగకపోయినా ఆనాడు సరస్వతీపూజ మాత్రము చాలా బాగా జరిగింది. ఎవరి విగ్రహాన్ని వారు

పూజించుకొన్న తరువాత అందరూ కలిసి నృత్యము చేస్తూ చిట్టెయ్య విగ్రహాన్ని పూజించారు. కిష్టప్పశాస్త్రుల్లు మంత్రాలు చతువుతున్నాడు. వెంకటావధానులు పౌరోహిత్యము వహించినాడు. సుబ్బయ్య అగ్రతాంబూలముకోసము తంటాలు పడుతున్నాడు. లక్ష్మీనర్సు తిట్టుతున్నాడు.

"వాయించవోయి మేస్త్రీ, డబ్బాలు బాగా వాయించు. ఏయి బాజాభజంత్రీలు, డబ్బాలు బాగా వాయించండి. కట్నాలు పుచ్చుకోండి. తెండి, ఇలా తెండి. వెయ్యండి, అడుగు బాగా వెయ్యండి." ఇత్యాది కోలాహలముతో సరస్వతీ పూజ బహు చక్కగా జరిగింది. ఆగందరగోళములో కూటస్థులందరికీ ఒళ్ళు గరిపొడిచింది. కొందరికి ఒళ్ళు తెలియలేదు. కొందరు ఆవేశము వల్ల మూర్ఛ పోయినారు.

చివరకు అందరూ సరస్వతీ మంత్రము చదివినారు. ఎవరి మట్టుకు వారు మంత్రము జపించే సాంప్రదాయము లేదక్కడ. కూటస్థులందరూ కలిసి గ్రాంధిక వాణీస్తోత్ర మహామంత్రము జపము చేశారు. నాకు జ్ఞాపకమున్నంత వరకూ వివరిస్తున్నాను.

అస్య శ్రీవాణీస్తోత్ర మహామంత్రస్య చిన్నయ సూరీ ఋషిః । అప్పకవీయంఛందః । గ్రాంధిక కృతకవాణీ దేవతా। కవి రాక్షసీయం బీజం । సంస్కృతపండిత వాదః శక్తిః । ధనార్జనం కీలకం । మమ గ్రాంధిక వాణీ సేవనద్వారా మహారాజప్రసాద సిద్ధ్యర్థం జపే వినియోగః ॥

వచ్చుము చచ్చుము రూపిణీం అంగుష్ఠాభ్యాం నమః । మీరు చేసిరి మయిూం తర్జనీభ్యాం నమః । పూర్ణార్ధబిందు

స్వరూపిణీం మధ్యమాభ్యాం నమః । కుంతురునకు బొంబాయి నకు పోషిణీం అనామికాభ్యాం నమః । నావుడు అనవుడు పదశరణ్యాం కరతల కరపృష్ఠాభ్యాం నమః ॥

ఏవం హృదయాదిన్యాసః । కవిత్రయనామ్నా గ్రామ్య వాదినాం వాగ్బంధః ॥

ధ్యానమ్

గ్రంథవాణీం కీర్తిదాత్రీం
శబ్దాలంకార శోభితామ్ ।
వ్యావహారిక శబ్దానాం
ఖండనీం పండితావనీమ్ ॥

తరువాత మంత్రము జపించారు. అంగన్యాసములలో ఇమిడిఉన్న బీజాక్షరాలే కాబట్టి వేరే మంత్రము వ్రాయ లేదు. అందరూ ఈ మంత్రము అష్టోత్తరశతము జపము చేశారు. చివరకు ఫలశ్రుతి—

గ్రంథ వాణ్యా ఇదం స్తోత్రం
యః పఠే ద్రాజసన్నిధౌ ।
సిద్ధ్యన్తి సర్వకార్యాణి
పండితః కథ్యతే ధ్రువమ్ ॥

ఇదంతా అయిన తర్వాత అందరూ సొమ్మసిల్లి పడి పోయినారు.

*　　　*　　　*

అప్పుడు జరిగింది గొప్పవింత ! మందిరమంతా నిశ్శబ్ద ముగా ఉన్నది. అపుడు వా రున్నతావుకు దివ్యసుందరవిగ్ర హము వచ్చింది. ఆ చూపులు, నడకలు, ఆ చిరునవ్వు, ఆ

ఒయ్యారము-భయమూ భక్తి,వాత్సల్యమూ అనురాగమూ కలిగిస్తున్నవి. ఆవిడ అందరి హృదయాలనూ ఆకర్షించే శక్తి గల దివ్యస్త్రీ. ఆవిడను చూచి అందరూ హృదయాలామె కప్పచెప్పినారు. అందరికీ మనశ్శాంతి కలిగింది.

ఉత్సాహము కలిగింది. ఆనందము కలిగింది.

సృష్టికర్త సృష్టీకూడా అవిడే!

ఆమె ధరించినవి పువ్వులూ చిగుళ్ళూ.

ఆమెస్నేహితులు పిల్లలు.

ఆమె పలుకుతున్నవి చిలకపలుకులు.

ఆవిడకంఠము కోకిల.

ఆవిడకన్నులు తేటనీటి బుగ్గలు.

ఆవిడపైటవిసురు మందమారుతము.

ఆవిడకిరీటము ఆకాశము.

కిరీటములో మణులు చుక్కలు.

ఆవిడ సరస్వతి !

సొమ్మసిల్లి పోయిన జన మంతా లేచి నిలుచున్నారు. "ఎవరు నీవు ? కూటస్థుల రహస్య మందిరములోకి ఎందుకు వచ్చావు ?" అని ఆవిడను వారంతా గద్దించారు.

ఆవిడ నవ్వింది. ఆవిడకళ్లు జబాబు చెప్పినవి — నేను సరస్వతి నని. వాళ్ళంతా ఒకమారు ఆవిడకేసి చూచారు, ఒకమారు చిట్టెయ్య విగ్రహముకేసి చూచారు. అన్నారు అందరూనూ; "ఆఁ ఆఁ ! ఏమిటి ఏమిటీ ! నీవు సరస్వతి వయితే ఈ విగ్రహం ఏమి కావలసింది? కలికాలంలో ఎంతటివాళ్లయినా ఉంటారు !"

శ్రీరాములు మేస్త్రీ కిష్టప్పశాస్త్రుల్లుకేసి చూచినాడు. ఆయన లక్ష్మీనరుసును పరామర్శ చేసినాడు. ఆయన మేస్త్రీకి సైగ చేసినాడు. మేస్త్రీ అన్నాడు "చూస్తారేం ఇంకా!"

అందరూ కలసి డబ్బాలు వాయించారు. కొందరు కర్రలు తీసుకు వచ్చారు—ఆవిడను జడిపించారు.

ఆవిడ అంతర్థానమయింది. నాటినుంచి నేటివరకూ కిష్టప్ప శాస్త్రుల్లు లక్ష్మీనరుసూ ఆవిడను అడ్డమైనతిట్లు తిట్టుతూనే ఉన్నారు.

కాని ఆవిడ ఆ ఊళ్ళో పిల్లలతో ఎప్పుడూ ఆడుకొంటూ ఉంటుందనీ, వాళ్ళకు కావలసిన ఆటవస్తువులు ఇస్తూ ఉంటుందనీ వినికిడి.

౫

పరా:— గ్రాంధికవాణీ స్తోత్రము తాము చదివినది కాదనీ, నేను కల్పించినదనీ, కిష్టప్పశాస్త్రుల్లుగారు నన్ను శపిస్తూ ఒక కావ్యం వ్రాస్తున్నారట. ఈమధ్య కిష్టప్పశాస్త్రుల్లుగారికీ నాకూ అభిప్రాయ భేదం కలిగింది లెండి.

కిష్టప్పశాస్త్రుల్లుగారితో అభిప్రాయ భేదం అంటే ప్రబల శత్రుత్వ మన్నమాట.

1923

# తెలుగు శాస్త్రుల్లుగారు

౧

[శాస్త్రుల్లుగారిల్లు. నడవలో తాటాకు చాపమీద శాస్త్రుల్లుగారు కూర్చున్నారు. పక్కను ఆయన కుమారుడు పలక చేత్తో పట్టుకు కూర్చున్నాడు. ఇంట్లో శాస్త్రుల్లుగారి భార్య వంట చేస్తోంది]

కుమారుడు

నాన్నా, మరీ,…………

శాస్త్రుల్లుగారు

ఎన్నిమాఱులు నీకుం జెప్పవలయును. "నాన్నా" యన కూడదు. "నాయనా" యనవలయును. మఱియు "మరీ" యన రాదు. "మఱియు" ననవలయును. తెలిసినదా?

కుమారుడు

తెలిసింది, కాని, నాయనా, నాకు కా గుణింతం వచ్చే సింది. కావలిస్తే అప్పజెప్తా.

శాస్త్రుల్లుగారు

ఓరీ, నీవు మాట్లాడునదంతయు గ్రామ్యము. నీవటుల మాటలాడరాదని జెప్పితినిగదా! మాటిమాటికి నేల నా రీతి నుడివెదవు?

కుమారుడు

అవునుగాని నాన్నా—కాదు నాయనా—కా గుణింతం అప్పజెప్పుకోవూ?

శాస్త్రుల్లుగారు

ఎన్నండును గ్రామ్యంబు మాట్లాడవుగదా?

కుమారుడు

మాట్లాడను. కాని అమ్మతో నువ్వెందుకు, నే మాట్లాడి నట్లే మాట్లాడతావూ? నువ్వుకూడా అల్లా మాట్లాడుతూంటే నేనూ అమ్మాకూడా మాట్లాడతాముగదా.

శాస్త్రుల్లుగారు

సరియే, నీవు సెప్పునది బాగైయొప్పెడిని. ఈ దినమున మీ యమ్మతోగూడ పరిశుద్ధ భాషనే మాటలాడెదను. కానిమ్ము, గుణితముం జెప్పుము.

కుమారుడు

విను నాన్నా చెప్పుతాను. కా, కాకుదీర్ఘమిస్తే కా; కాగుడిస్తే కి; గుడ్లోదీర్ఘమిస్తే కీ; కాకొమ్మిస్తే కు; కొమనా దీర్ఘమిస్తే కూ............

శాస్త్రుల్లుగారు

ఆఁ, ఆఁ, ఆగు మాగుము. ఆరీతిని జెప్పుచుంటివేల?

కుమారుడు

మా మేష్టర్లా చెప్పేరు నాన్నా

శాస్త్రుల్లుగారు

వలదు; ఎంతమాత్రంబు వలదు; అట్లు సెప్పరాదు.

కుమారుడు

ఎల్లా చెప్పా............

శాస్త్రుల్లుగారు

ఛీ, సరిగా వచింపుము

కుమారుడు

ఎట్లు సెప్పవలయును దండ్రీ!

శాస్త్రుల్లుగారు

బాగు. ఆరీతిగా భాషించుట నేర్వవలయును. ఇచ్చ వచ్చిన

మచ్చున ముచ్చటించవచ్చునే. అఖండ పారావార మహా సాగరంబు భాతి భాషాయోషామతల్లి గంభీరంబుగ వెలుంగ వలదే. చెప్పవలసిన విధానంబియ్యది యాలింపుము పుత్రకా!

కుమారుడు

ఊఁ

శాస్త్రుల్లుగారు

క. కనకు దీర్ఘమిచ్చినం గా; కనకు గుడినిచ్చినం గి; గుడిలో దీర్ఘమిచ్చినం గీ; కనకు కొమ్మునిచ్చినం గు; కొమ్మునకు దీర్ఘంబిచ్చినం గూ. తెలిసినదా ?

కుమారుడు

అదేవిటి, గా గుణింతం చెబతావు ? ఇది బాగుందికాదు నాన్నా! మాష్టారు చెప్పిందే బాగుంది.

శాస్త్రుల్లుగారు

అట్లనరాదు. నేను జెప్పిన విధంబుననే నేర్చుకొనుము.

కుమారుడు

అల్లా చేస్తే మాష్టారు కొడతారు నాన్నా.

శాస్త్రుల్లుగారు

మీ యొజ్జకుం దెనుంగురాదు. నే నింటియొద్ద నిక్కరణి బోధించితినని నొక్కి వక్కాణింపుము. కట్టా! ఇట్టిదులవల్లనే తెనుంగు తుదముట్ట నున్నయది.

కుమారుడు

చెప్పినా కొడతారునాన్నా, బళ్లో అందరూ చెప్పినట్లు చెప్పకపోతేనూ.

శాస్త్రుల్లుగారు

కొట్టిన బిమ్మట నాతోడం జెప్పుము. ప్రాథమిక పాఠ

శాలలందు దెనుంగుబాస నీసరణి కాసటబాసట సేయు చున్నారు. నే నొక్కరుండ నేమి సేయగల్గుదు? పరిషత్తు వారైన మా పండితుల మొరాలింపరే? దొరతనము వారైన నొక శాసనము నిర్మింపరే? ఏమిసేయుదు? హా! హతవిధీ!

కుమారుడు

నాన్నా, బళ్లో మాకు కొత్తకథ చెప్పేరు. ఇప్పుడు చెప్పనా అది?

శాస్త్రుల్లుగారు

చెప్పుము.

కుమారుడు

అనగా అనగా ఒకరాజు. ఆరాజూ — అదేమిటి చెప్మా మరిచి పోయాను — ఏదో ఊరు నాన్నా, ఆవ్వూరు పాలిస్తున్నాడుట. ఆరాజుకి ఇద్దరు కొడుకులుట. వాళ్లు ఏం చేశారా—

శాస్త్రుల్లుగారు

గ్రామ్యము గ్రామ్యము — ఉచ్చరించకు ముచ్చరించకుము.

కుమారుడు

గ్రామ్యము కాదునాన్నా వాళ్లు చేస్త — ఒకనాడు—

భార్య

[లోపలి నుంచి]

ఇదిగో, ఏమండోయి, ఊఁ ....

శాస్త్రుల్లుగారు

ఛీ ఛీ, కుంకా! గ్రామ్యంబు మాటాడెద వెందునకు?

కుమారుడు

నేనా, నాన్నా!

శాస్త్రుల్లుగారు

అవును.

కుమారుడు

మాష్టారు చెప్పిన కథ చెప్పుతున్నాను నాన్నా, విను మరి కొనసాకూను. వాళ్లు ఒకనాడు ఒక అడివిలోకి వేటకెళ్లి........

భార్య

[లోపలినుంచి]

వినపడ్డం లేదూ ? ఇదిగో, చూడండి, ఏమండోయి.

కుమారుడు

ఒక జింకపిల్లని పట్టుకొని

శాస్త్రుల్లుగారు

జింకపిల్లకాదు హరిణపోతంబు ........ ఉండు, ఉండరా, మీా అమ్మ పిలుస్తూన్నట్లుంది. అవునే, ఒసేవు, పిలిచావా ?

కుమారుడు

నాన్నా, నువ్వూ గ్రామ్యం మాట్లాడుతున్నావేమిటి ?

శాస్త్రుల్లుగారు

లేదు, లేదు మరచితిని.

భార్య

వంటయింది, మడి కట్టుకోవచ్చు.

శాస్త్రుల్లుగారు

వచ్చుచుంటిని, వడ్డింపుము. ఏమమ్మ బాలకా! భోజనంబునకుం రమ్మా.

౨

[శాస్త్రుల్లుగారి వంటిల్లు. పెద్ద పీట మీద శాస్త్రుల్లుగారు కూచుని గంధాక్షత లుంచుకొంటున్నారు. ఆయన కుమారుడు ప్రక్కను చిన్న పీట మీద కూర్చున్నాడు. ఆయన భార్య వడ్డిస్తోంది. వడ్డన అయిన తరువాత తండ్రీ కొడుకూ భోజనానికి కూర్చున్నారు. అడ్డ గోడ దగ్గిర ఆయన భార్య నిలబడి చూస్తోంది.]

శాస్త్రుల్లుగారు

మరి కొంచెము సూపంబును వడ్డింపుము.

భార్య

[విననట్లు నిలుచు ండును]

శాస్త్రుల్లుగారు

కించి త్సూపంబుం గొని తెమ్ము.

భార్య

ఏమి టంటారూ ! పప్పులో ఉప్పు సరిపోయిందా?

శాస్త్రుల్లుగారు

పప్పున లవణం బతిమాత్రముగ నున్నయది. అయినం గానిమ్ము. కొంచెము తెమ్ము.

భార్య

ఏమిటోనమ్మా మీ భాష నాకు తెలియదూ. కొంచెం పప్పు వడ్డించమంటారా ?

శాస్త్రుల్లుగారు

మనోగతభావంబు యథాక్రమంబుగ గ్రహించితివి మనో హారిణీ! సూపంబు గొని తెమ్ము.

కుమారుడు

నాక్కూడా కొంచెము పప్పెయ్యవే అమ్మా.

శాస్త్రుల్లుగారు

డింభకా, గ్రామ్యంబు వచింతువే ?

కుమారుడు

లేదు నాన్నా, మరచిపోయాను.

శాస్త్రుల్లుగారు

ఘృతము, ఘృతము.

కుమారుడు

అమ్మా, నాన్నకి నెయ్యేటి.

భార్య

ఈవేళ ఇదేమిటో ఈ వికారం వచ్చిపడింది. ఆడదాని దగ్గిరా పాండిత్యం అంటాను ?

శాస్త్రుల్లుగారు

మన పుత్రకుని కొఱకై యిట్లు భాషించుచుంటిని గ్రహింపజాలవా? కొంతకాల మి ట్లాచరించిన వాడు సలక్షణాంధ్రభాష నేర్వగలాడు.

భార్య

ఏమోనమ్మా నాకు తెలియదు—మీ చదువులూ మీ వేషాలూను. చచ్చి స్వర్గాన్నున్నారు మా నాన్నగారు. ఆయన యిలాగ ఎప్పుడూ మా అమ్మను కాల్చుకుతినలేదు. ఆయనకి చదువులోటా ఏమిటి? దేశదేశాలూ తిరిగి ఓహో అనిపించుకొన్నారు. ఇదేమిటో ఈ కొత్తవేషాలన్నీ ఈ కాలంలో వచ్చిపడ్డాయి.

శాస్త్రుల్లుగారు

ఆడుదానవు నీకేమి దెలియును. వండి వడ్డింపనేర్చినవా రాడువారు. ఇతర విషయంబులు వారికేల ?

భార్య

అవునుగాని సోమన్నగారి కూతురికి పెళ్లయిందిటసుమండీ.

శాస్త్రుల్లుగారు

కూతురునకుం బెండ్లయినదని ఎవ్వరుసెప్పిరి నీకు ప్రేమసీ.

భార్య

రేవు దగ్గిర నర్సమ్మ చెప్పింది. అందరూ గుంటూరెళ్లి పెళ్లి చేసుకు వచ్చారుట.

శాస్త్రుల్లుగారు

గుంటూరునకుం దర్లి వెళ్లిరా; అందేమి విశేషం బున్నదది ప్రాణప్రియా.

భార్య

ఊరుకోండి. ఎవరైనా వింటే నవ్విపోతా రనేనా లేదు కాబోలు.

శాస్త్రుల్లుగారు

ఏల నేల ?

భార్య

ఏమిటి మరీ! నాటకాల్లోలాగ నన్నలా పిలుస్తారేమిటి ? ప్రేయసిట, మన్నుట, మశానంట—

కుమారుడు

అమ్మా, చారే.

శాస్త్రుల్లుగారు

ఈనాడు తింత్రిణీఫలరసంబుం గాచితివా లేదా ?

భార్య

చారు కాచాను. పొయ్యమన్నారా ఏమిటి ?

శాస్త్రుల్లుగారు

పోయుము.

భార్య

[నడ్డిమీద ఒకచెయ్యి పెట్టుకొని కొంచెము వంగి పోస్తూండగా ఆయన కాళ్లమీదికి చారు చిందింది]

కాళ్లమీదగానే ఫర్లేదుగదా ?

శాస్తుల్లుగారు

నీకేమియు బుద్ధిలేనట్లున్నదే?

భార్య

నే నేంజేశాను ?

శాస్తుల్లుగారు

ఏమిచేసితివా ? కన్నులులేవా ? నీకు నేత్రాంబుజంబులు శిరంబుపై కరుదెంచినవి.

భార్య

చాల్లెండి, నేర్చుకొన్నారెలాగయితే !

శాస్తుల్లుగారు

ఛీ, త్వాష్ట్రిం...., ఇంకా కారుకూతలు కూస్తావు.

భార్య

బాగుంది, నే నేమన్నానూ ? ఈవేళ లేచినవేళ మంచిది కాదు. ఎవరి మొహం చూశానోకాని, కాస్త చారు చిందితే ఇంతకోపం—

శాస్తుల్లుగారు

కోపం కోపం అంటావు. చూడు ఏంజేస్తానో ? బొత్తిగా అదుపాజ్ఞలు లేకుండా సంచరిస్తున్నావు. ఈవేళ నేనయింది, రేప్పొద్దున్న ఎవరేనా పెద్దమనిషి వచ్చాడనుకో, ఇల్లా చేసే దానివేనా ?

కుమారుడు

నాన్నా, గ్రామ్యం మాట్లాడుతున్నావేం?

శాస్త్రుల్లుగారు

ఛా, కుఱ్ఱకుంకా, నోరుముయ్. బొడ్డూడని నిర్భాగ్యుడవు నువ్వా నాకు చెప్పడమే ?

భార్య

[ఏడుస్తూ]

కుఱ్ఱదాన్ననుకొన్నారా, గుంటదాన్ననుకొన్నారా, నన్నలా తిడతారు ? ఇంతకీ నే నేంజేశానని ? అక్కడికీ నే నెంతో భయ భక్తులతో చేస్తూంటే — నాకు మాట దక్కేవిధం లేందే. ఇంతకీ నేను నోచిన నోములు ఇల్లా ఉన్నాయి. మా నాన్న ముండాకొడుకు యిల్లాచేశాడు. నేనూ—

శాస్త్రుల్లుగారు

నోరు మూస్తావా, ముయ్యవా ? వాగుడు మహా ఎక్కువవుతోంది.

భార్య

వాగుడికి నే నేమేనా శాస్త్రాలు చదివేనా ? భాషలు నేర్చేనా ? చదువులు చట్టుబండలూ కూడాను నాబతుక్కి. ఇక్కడికే ఉండ రావులు లేకుండా ఉన్నాయి. చీకటుండగా లేచి, లేచింది మొదలు కొని వంచిననడుం ఎత్తకుండా అరవ చాకిరీ అంతా చేస్తున్నానని మెప్పా మెహర్బాణీఆ? ఎంత చేసినా నా చివాట్లు నాకు తప్పవు.

శాస్త్రుల్లుగారు

ఒళ్లూ పయీ తెలిసి సంచరిస్తే నిన్నేమీ ఎవళ్ళూ అనరు.

భార్య

ఎవళ్లూ ఎందు కనాలి నన్నూ ? నే నేమన్నా ఒక దొంగ తనం చేశాననా ఒక కానిపని చేశాననా ? ఒకళ్ల జోలీ శొంఠీ

లేకుండా నన్ను ముట్టుకోకు నామాలికాకని నా ఖర్మాన్ని నేను బతుకుతూంటే నామీఁదపడి ఏడిసేవాళ్లే ప్రతివాళ్లూను.

శాస్త్రుల్లుగారు

అంతకంతకి సుతి మించుతోందే?

భార్య

ఏమిటా అదమాయింపు అస్తమానమూను? అవును నాదే తప్పు. మొదటినుంచీ నాతో వేళాకోళం చెయ్యడ మెందుకు మీరు?

శాస్త్రుల్లుగారు

నే నేం వేళాకోళము చేశాను?

భార్య

ఆ దిక్కుమాలిన భాషతో నాతో మాట్లాడ్డం ఎందుకూ?

శాస్త్రుల్లుగారు

నీకు తెలియకపోతే నేర్చుకోవాలి. భాషను తిడతా వెందుకు?

భార్య

ఇఖ అదోకటి తరవాయి—ఈ సౌడభ్యానికి సాయం.

శాస్త్రుల్లుగారు

ఊఁ. మజ్జిగ పోయుము.

భార్య

ఏమో నాకు తెలియదు. మీరే పోసుకోండి. ఆపీటదగ్గిరే పెట్టాను. మొదట న న్ననడమూను, తరవాత సర్దుకోవడ మూను. ఎప్పుడూ ఉన్నదే!

శాస్త్రుల్లుగారు

స్త్రీలు మృగప్రాయులుగదా!
నీకును గావలయునా మజ్జిగ డింభకా!

కుమారుడు

కావలయును తండ్రీ!

శాస్త్రుల్లుగారు

కానుము పుత్రకా.

3

[బడి పిల్లలంతా బల్లల మీద కూర్చుని వ్యాసాలు వ్రాస్తున్నారు. తెలుగు శాస్త్రుల్లుగారు కుర్చీ మీద కూర్చుని కునికి పాట్లు పడుతున్నారు. ఒక అరగంట అయిన తరువాత శాస్త్రుల్లుగారు కళ్లు తెరిచి చూచి, కళ్లు నులుముకొని, కుర్చీలో ఠీవిగా కూర్చుని]

శాస్త్రుల్లుగారు

రాశార్రా అందరూ వ్యాసాలూ?

పిల్లలు

రాశామండీ

శాస్త్రుల్లుగారు

అవధాన్లుగారబ్బాయీ, యిలారా; నీవు వ్రాసింది చూపించు.

అబ్బాయి

చదవనాండి?

శాస్త్రుల్లుగారు

చదువు. నేను కునికిపాట్లు పడుతూంటే హెడ్మాష్టరుగానే చూడలేదుగదా?

అబ్బాయి

లేదండి. వస్తే మేము చెప్పమూ.

శాస్త్రుల్లుగారు

ఊఁ. సరే, చదువు.

అబ్బాయి

"ఒక వూరిలో ఒకపిల్లవాడు వుండెను. అతనికి చిన్నప్పుడే తల్లీ తండ్రీ కాలము చేసిరి. మేనమామగారి యింటివద్ద

చదువుకుంటూ ఉండేవాడు. తిరిగే కాలూ తిట్టేనోరూ ఊరు కొనదన్నట్లుగా ఇతడు బళ్లోకి వెళ్లడం మాని తోటలవెంబడి తిరిగేవాడు. పొద్దెక్కడంతోనే యింటికివచ్చి కూడా తెచ్చిన పువ్వులన్నీ దండలకింద గుచ్చేవాడు"—

శాస్త్రుల్లుగారు

ఆగు, ఆగు. ఏమిట్రా అబ్బాయీ, నువ్వుకూడా యిలా తగలబెట్టేవు ?

అబ్బాయి

ఏమండీ ?

శాస్త్రుల్లుగారు

వ్యాసం వ్రాయమంటే గ్రామ్యం తగలేస్తారురా ?

అబ్బాయి

ఎల్లా రాయాలండి !

శాస్త్రుల్లుగారు

ఏది చూడనియ్యి....చూడూ నీభాష గంభీరంగా ఉండాలి. అంటే తెలుగుమాటలు వెయ్యవలసిన చోట సాధ్యమైనంతమట్టుకు సంస్కృత పదాలే వేస్తూఉండు. వూరిలో అనేబదులు గ్రామంబున అంటే ఎంతబాగుంది ? పిల్లవాడు అనే బదులు బాలుండు అంటే ఎంతబాగుంట ? తెలిసిందీ ?

అబ్బాయి

తెలిసిందండి. ఇంకా ఏమేనా తప్పు లున్నా యేమో చెప్పరూ ?

శాస్త్రుల్లుగారు

ఆఁ. చెప్తా. వింటున్నారు రా అందరూను ? "పువ్వులు గుచ్చడం" అన కూడదు. "పుష్పంబులు గ్రువ్వుట" అన

వలెను. "బళ్లోకి" అన కూడదు "పాఠశాల లోపలకు" అన వలెను. కు షష్ఠికి వెనక ద్రుతముంటుందని మరవ కండి. మనం మాట్లాడే మాటలు మాట్లాడేటట్లు గాకుండా కొంచెం మారుస్తూ ఉంటే అది రైటవుతుంది. "ఊరు కొనదు" అనే బదులు "ఊర కొనదు" అనీ, "వానలో తడిసి" అనే బదులు "వానలో తడసి"అనీ, "కలిసి పోయెను" అనే బదులు "కలసి పోయెను" అనీ ఇత్యాదిగా. సరే వెళ్లు, మళ్లీ రాసి చూపించు.

అబ్బాయి

అలాగేనండి.

శాస్త్రుల్లుగారు

ఇంకో కుర్రాడు–ఒరే వెంకన్నా–నీ వ్యాసంచూపించు.

వెంకన్న

ఇదిగోనండి.

శాస్త్రుల్లుగారు

సరే........ఇదేమిట్రా? ఇది చదువు.

వెంకన్న

"శబ్దశ్రేణి కీతండు దుర్మార్గుండనియే యూహించుదము"

శాస్త్రుల్లుగారు

అంటే, ఏమిటి ?

వెంకన్న

"మాటవరస కితడు దుర్మార్గుడనుకుందాము"

శాస్త్రుల్లుగారు

ఊహూం; ఊహూం; సరే, కాని, చూద్దాము .... ఏదీ తరవాత?....ఇదేవిట్రా........ఇది చదువు.

వెంకన్న

"మీారునకును రాజుగారునకును ఏమైన పరిచయంబున్నచో వచింపుడు"

శాస్త్రుల్లుగారు

"మీారునకును" ఏమిట్రా ?

వెంకన్న

మీాకును అన్న మాటండి.

శాస్త్రుల్లుగారు

ఛీ, తప్పు, మీాకును అనే రాయి. సరే, "రాజుగారునకును" అన్నావేమిటి ?

వెంకన్న

"రాజుగారికి" అనమన్నారా ?

శాస్త్రుల్లుగారు

ఊఁ, ఊఁ, రాజుగారునకు....పోనీలే. సరే వెళ్లు. తప్పులు దిద్దుకు మళ్లీరాయి.

వెంకన్న

చిత్తం.

అవధానులగారబ్బాయి

నేను మళ్లీరాసుకువచ్చాను. చదవనాఅండి ?

శాస్త్రుల్లుగారు

చదువు.

అబ్బాయి

ఒకగ్రామంబున నొక బాలుండుండెను. అతనికి బాల్యంబుననే తల్లీ జనకుండును........

శాస్త్రుల్లుగారు

జననీ జనకులు అనిరాయి.

అబ్బాయి

జననీ జనకులు కాలం బొనరించిరి.

శాస్త్రుల్లుగారు

“కాలం బొనరించిరి” అంటే ?

అబ్బాయి

చచ్చిపోయే రండి.

శాస్త్రుల్లుగారు

ఓహో, కాలం చేశారా ? సరి సరి.

అబ్బాయి

మేనమామ గృహంబు నొద్ద చదువు కొంటూ ఉండు వాడు.

శాస్త్రుల్లుగారు

చదువుచు, లేదా పఠించుచు అని రాయి. తరువాత చదువు.

అబ్బాయి

“చరించు పాదంబును దూషించు వక్త్ర గహ్వారంబును గ్రామంబు కొన దన్నట్లుగా నీతండు ........ ”

శాస్త్రుల్లుగారు

ఆ, ఆ, ఆగు, ఆగు, గ్రామంబు కొనదేమిటి ?

అబ్బాయి

ఊరుకోనదు అన్నమాటండి. తిరిగేకాలూ తిట్టేనోరూ ఊరుకోదు. వ్యాసాల్లో సామెతలు రాయమన్నారు కాదండీ!

శాస్త్రుల్లుగారు

సరే, సరే,....గ్రామంబు కొనదు అనిరాయకు. ఊర కొనదు అనిరాయి.... లేకపోతే.... లేకపోతే.... మూకీభావము వహింపదు అని రాస్తే ?

అబ్బాయి

అల్లాగే రాస్తానండి. తరవాత వినండి........ "నీతండు పాఠశాలనకుం బోవుట మాని వనంబుల వెంబడి చరించీ వాడు"

శాస్త్రుల్లుగారు

చరించువాడు అని దిద్దుకో.

అబ్బాయి

ప్రొద్దారోహించుట తోడనే గృహంబునకు....

శాస్త్రుల్లుగారు

అంటే

అబ్బాయి

పొద్దెక్కడం తోనే....

శాస్త్రుల్లుగారు

ఆఁహాఁ. సరి, సరి....

అబ్బాయి

ప్రొద్దారోహించుట తోడనే గృహంబునకు వవ్వి, కూడా తెవ్విన పువ్వు లన్నియు గ్రువ్వువాడు.

శాస్త్రుల్లుగారు

అదేమిటిరా అర్థం కావడం లేదూ.

అబ్బాయి

"గుచ్చు" బదులు "గ్రువ్వు" రాయ మన్నారు కాదండీ.

శాస్త్రుల్లుగారు

అంటే ?

అబ్బాయి

వచ్చి, తెచ్చి అన డానికి వవ్వి, తెవ్వి అన్నాను.

శాస్త్రుల్లుగారు

ఛా, అలా అనకూడదు—తప్పులు దిద్దుకో.

[గంట కొట్టారు. పిల్లలంతా టైమయిందని గోలచేతురు. శాస్త్రుల్లుగారు ఇంకో క్లాసులోనికి ప్రవృత్తమణము]

1924

# మూడు కుక్కలు

ఈ రోడ్డుకు అయిదారు గజాల దూరములో వున్న ఇసుకలో పడుకొనివున్నది ఆ కుక్క. సాయంత్రమైనది. అది కళ్లు తెరిచినది. కొంచెము సేపు ఆలోచించినది. పొద్దుటనుంచీ తానేమీ తినలేదనే మాట మొట్టమొదట జ్ఞాపకము వచ్చినది. నెమ్మదిగా లేచి నిలుచున్నది. దానికి ఆకలివేసినప్పుడు అది ప్లీడరు గారి పెరటిదొడ్డిలో ప్రవేశించడము మామూలు. ప్లీడరుగారి పెరటిదొడ్డికి చుట్టూ నాగజెముడు. అది చులాగ్గా దాటడము నేర్చుకొన్నది. ఈ మాటుకూడా పెరటిదొడ్డిలోకి వెళ్ళవలెనని అనుకొన్నది.

కాని వుదయం పది పదకొండు గంటలవేళ మామూలు ప్రకారం అక్కడికి వెళ్ళడమూ దొడ్డి అంతా పరీక్ష చెయ్యడమూ ఏమీ దొరక్కపోవడమూ జ్ఞాపకము వచ్చినది. దొడ్డిఅంతా తిరిగి తిరిగి ఏమీ దొరక్క, పోనీ రోడ్డుమీద కొంతసేపు పచారుచేస్తే ఏ ఇంటి ముందైనా ఏమైనా దొరకవచ్చునని అది రోడ్డు మీద తిరగడమూ, ఆ రోడ్డుమీద ఇళ్ళను ఆశ్రయించుకువున్న కుక్కలు దానితో కలియబడడమూ, అది తప్పించుకొని పారిపోవడమూ ఇత్యాది విషయములన్నీ జ్ఞాపకము వచ్చినవి.

లేచి నిలబడి ఏమి చేయుడముకూ దానికి తోచినదికాదు. ఒక్కమారు ఒళ్లు విరుచుకొని ఇసుక దులుపు కొని మళ్ళీ బద్ధకముగా వుండుటచేత ఇంకో కునుకు బోతే బాగుంటుం

దేమో నని అది అనుకొన్నది. పడుకుంటే ఆరోజుకు అసలే ఏమీ దొరకదేమో నని దిగులు వేసింది. ఎక్కడకు వెళ్ళ డానికీ బలము లేదు. పోనీ ప్లీడరుగారి పెరటి దొడ్డి మళ్ళీ పరీక్ష చేస్తే ఏమైనా దొరకవచ్చునేమో అనుకొన్నది. కాని ఇంకోమారు నిద్రపోవలెననే దానికి తోచింది. ఈ రీతిగా యే ఆలోచనా తెగక కిందా మీదా పడుతూ వుంటే దాని పక్కనుండి ఒక రాయి రివ్వున పోవడము అది కనిపెట్టింది. దాని బద్ధకమంతా ఒక్కమారు పటాపంచ లయింది. ఇటూ అటూ చూచింది.

కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ కేకలు వేసుకుంటూ కొందరు బడిపిల్లవాళ్లు ఆ రోడ్డునపోతూ నిలబడ్డ ఈ కుక్కను చూచి అందుబాటులో వున్న బెడ్డలను ఏరి ఈ కుక్కకేసి విసిరారు. ఒక బెడ్డ పక్కనుంచి పోయింది. ఇంకో బెడ్డ దాని చట్టమీద తగిలింది. అది కయ్యో అని అరుస్తూ ఒక కాలెత్తి కొంత దూరం పరుగెత్తి, దాని వెనకే వడివడిగా వస్తూ వున్న రాళ్ళను కనిపెట్టి ఆ కాలు దింపి అలవాటు చొప్పున ఇంకో కాలెత్తి పరుగెత్తి ఒక్క చెంగున కంచె దాటి ప్లీడరు గారి దొడ్డిలో పడింది. పిల్లవాళ్ళందరూ చప్పట్లు కొట్టి నవ్వు కొన్నారు. వారికి వుత్సాహం అతిశయించింది.

ప్రపంచములో రోడ్లమీద నున్న బెడ్డల యొక్క ప్రయో జనము కుక్కలను కొట్టుటకే అనే చిత్తవృత్తి గల బడిపిల్ల లకూ, ఊరకుక్కలకూ ఆజన్మవిరోధము.

ఈ సంగతి మనకుక్కకు తెలుసును. ఒకమూల ఆకలి బాధ. ఇంకోమూల దెబ్బబాధ. బడిపిల్లలను మనసులో

నాలుగుతిట్టి అక్కడకూర్చుని దెబ్బతగిలినచోట నాకుకొన్నది. కొంతసేపటికి కొంచెం బాధ తగ్గినది. మళ్ళీ లేచి నిలబడి ఒకకాలు పైకెత్తి నాలుగువేపులా ముట్టెచాచి వాసన చూచినది. కాని ఏమీ లాభించేటట్టులేదు. అయినా అలవాటు చొప్పున ప్లీడరుగారి ఇంటిచుట్టూ పచారు చేసింది. అన్ని తలుపులూ తోసి చూచింది. ఇంట్లో ఎవరూ ఉన్నట్లులేదు. పెరట్లో ఏమీ పుల్లాకులు లేవు. ఇక లాభములేదని దానికి తోచింది. దొడ్డిలో తిరిగితే మిడతలేవైనా దొరుకుతవేమోనని ప్రయత్నం చేసింది. కాని అనుకొన్నట్లు దానికి ఒక మిడతా దొరకలేదు. ఆకలి దహించుకుపోతోంది. ఏదో ఒక విధంగా ఆహారం సంపాదించుకొంటేనే గాని బ్రతికే విధం లేదు. ప్రక్కఇంటి కుక్కలతో స్నేహముచేసో యుద్ధము చేసో, ఏదో ఒకవిధంగా పొట్ట నింపుకోవలెనని అనుకొన్నది. ఆ దొడ్డిని వదలిపెట్టి ప్రక్కఇండ్లకేసి వెళ్లింది.

చిన్నప్పటినుంచీ ప్లీడరుగారి ఇల్లు కనిపెట్టుకొని బ్రతుకుతు వస్తోంది ఈ కుక్క. నువ్వు ఎవరి కుక్కవని ఎవరైనా స్నేహితులడిగితే నేను ప్లీడరుగారి కుక్కనని అది చెప్పుకోవడము అలవాటు. సాటి కుక్కలకు ఈమాట గర్వోక్తిగా తోచేది. అందుచేత అవి దీనిని దగ్గిరకు రానిచ్చేవి కావు.

వాటిలో ఒక చిన్న తెల్లకుక్కకు దీనిని చూస్తే అసలే విరోధం. కారణం అది తెల్లకుక్క. ఇది ఎఱ్ఱకుక్క. అంతే కాకుండా దీనికి వంటినిండా చిడుముకూడాను.

తెల్లకుక్క తాను జాతికుక్క నని చెప్పుకోవడం కద్దు. నిజానికి అది జాతికుక్క కాదు. దాని తండ్రి ఒక ఊరకుక్క.

తల్లి ఒక జాతి కుక్క. తల్లిని ఆ ప్రాంతాన కాపురమున్న ఒక తెల్లదొర పెంచేవాడు. ఆదొరకి భార్యాపిల్లలు ఎవరూ లేరు. ఈ కుక్కే సమస్తముగా భావించి దానికి ఇల్లుకట్టి ప్రత్యేకంగా మనిషిని ఏర్పాటుచేసి సర్వోపచారాలు చేయించేవాడు. ఊర కుక్కల సహవాసం చేసిపోతుందేమో నని చాలా జాగ్రత్తగా ఉండేవాడు. ప్రతిరోజూ దొర తాను స్వయముగా దీనిని షికారు తీసుకుపోయే వాడు. ఒకనాడు షికారులో ఈ జాతి కుక్కకు ఒక ఊరకుక్క దృగ్గోచరమైనది. దానిని చూచీ చూడడంతోనే మోహించింది. తక్షణం దాని దగ్గిరికి పరుగెత్తుకొనివెళ్లి దాని ముట్టె వాసన చూచి సంభాషణ మొదలు పెట్టింది. తన్ను ప్రేమించవలసినదనీ, తన ప్రేమ పవిత్రమైనదనీ, తన్ను ప్రేమించకపోతే ప్రాణములు వదలి పెట్టుతాననీ ఈరీతిగా తెల్లదొరల ప్రేమ తత్వాన్ని దానిముందు ఏకరువు పెట్టింది. ఊరకుక్క దానిని ఊరుకోబెట్టి ప్రేమ సూచకముగా ఒళ్లు నాకింది—

కుక్క తన వెనకే వస్తోందని భ్రమపడ్డ తెల్లదొర వెనకకు తిరిగి చూచి అది చేస్తూ ఉన్న అకార్య కరణమును గ్రహించి వెంటనే పరుగెత్తుకు వచ్చి ఊరకుక్కను రాళ్లతో కొట్టగా అది పారిపోయింది. జాతి కుక్కను కూడా పిలుచుకుపోయి నాలుగు తన్ని బుద్ధి చెప్పాడు. కాని తెల్లకుక్క అహర్నిశమూ ఊర కుక్క మీాద మనస్సు పెట్టుకొని ఉన్నది.

ఏలాగైతే నేమి అది ఒకనాడు తప్పించుకొని పోయి తిరిగి తిరిగి తన నాథుణ్ణి కలుసుకొన్నది. అవి కొన్నాళ్ల పాటు వీథుల వెంట తిరుగుతూ పొట్ట నింపు కుంటూ స్వేచ్ఛగా

ప్రణయ గీతములు పాడుకొంటూ కాలక్షేపము చేసినవి.

తన కుక్క తప్పిపోయిందని తెల్లదొర మతిపోయి తిరిగి తిరిగి చివరకు ఒక మునిసిపల్ డబ్బాలో ఊర కుక్కతో పాటు విస్తళ్లు నాకుతూ ఉండగా చూచి దానిని ఇంటికి తీసుకుపోయాడు. ఇంటికి వెళ్ళిన తరువాత దానిని బాగా తన్ని సబ్బుతో ఒళ్లంతా తోమి నీళ్లుపోసి మాంసమూ బిస్కత్తులూ పెట్టి గొలుసుతో కట్టిపెట్టి కాపలా మనిషిని బూట్సు కాలుతో ఒక తన్నుతన్ని ఒక రూపాయి జుల్మానా వేశాడు.

జాతికుక్కకు నెలలు నిండినవి. నాలుగు మగ కుక్కలను కన్నది. వాటి నన్నింటినీ తీసుకువెళ్ళి చంపివేయ వలసినదని తెల్లదొర కాపలా మనిషికి ఉత్తరువు చేశాడు. వాడు ఆ నాల్గింటినీ తీసుకుపోయి జాతి కుక్కలని చెప్పి పొరుగూరిలో అమ్మి వేశాడు. అందులో ఒక కుక్క యజమానిచేత వదలి పెట్టబడి బ్రతుకుకోసం ఈ ఊరువచ్చి ఒక ఇంటిని ఆశ్రయించి బ్రతుకుతూ తాను జాతి కుక్కనని చెప్పుకుంటూ ఊరకుక్కలమీద ద్వేషభావము వహించి కాలము గడుపుతూ ఉంది.

దీనికి మన ఎర్రకుక్కను చూస్తే అసహ్యం. అనేక మార్లు అన్యాయంగా దానిమీద బడి దానిని కొరికి విడిచి పెట్టేది. పాపం, ఎర్ర కుక్క దానికి లొంగి పోయేది. దానిని చూడడం తోనే తోక ముడిచేది.

ఈ రోజున ఎర్రకుక్కకు ఆకలి విశేషంగా వేస్తూఉన్నది. ఆహారము దొరికేటట్టయితే తెల్లకుక్క వచ్చినాసరే యుద్ధము చేసి దానిని తరిమివేసి కడుపు నింపుకోవాలని ఆలోచించి

ఆ రోడ్డున దర్జాగా నడిచి వెళ్లుతోంది. ఆ రోడ్డుమీదనుంచే ఒక మాలవాడూ వానిభార్యా కబుర్లు చెప్పుకుంటూ పొరుగూరు వెళ్ళుతున్నారు. మాలవాని చేతిలో రొట్టె ఉన్నది. అతడు తన భార్యకు పెట్టుతూ తాను తింటూ తలమీద మూటా, చంకలో కఱ్ఱా పెట్టుకొని పోతున్నాడు.

కుక్క వాళ్ళను చూచి వెంబడించింది. మాలవానిభార్య కుక్కనుచూచి కొంచెము దానికి రాల్చింది. కుక్క తిన్నది. ఆకలి హెచ్చింది. వాళ్లను వదలిపెట్టకుండా కుంయి కుంయి మంటూ వాళ్ల వెనుకపడింది. మాలవాడు చంకలో కఱ్ఱ తీశాడు. కుక్క ఆగిపోయింది. మాలవానిభార్య నవ్వుతూ పెంకెతనానికి కుక్కకేసి రొట్టెముక్క విసిరింది. కుక్క అది తిని వాళ్లవెనక మళ్లీ వెళ్లింది. మాలవాడు బెడ్డ విసిరేడు. కుక్క వెనకకు మళ్ళింది.

ఆ ప్రాంతాలనే తిరుగుతున్న తెల్లకుక్క దీనిని చూచింది. నెమ్మదిగా దగ్గరకు వచ్చింది. ఎఱ్ఱకుక్క తోక ముడిచింది. దానిముట్టె వాసనచూచింది. తెల్లకుక్క తన ప్రాంతాలకు వచ్చి అది ఏదో తిన్నదని ఊహించి పళ్లుతెరచి మొరిగింది. ఎఱ్ఱకుక్క తోకముడిచే పళ్లు చూపించింది. తెల్లకుక్క మొరుగుతూ దానిమీద పడింది. ఎఱ్ఱకుక్క పరుగెత్తింది. తెల్లకుక్క వెంటబడింది. ఎఱ్ఱకుక్కకు అలసట వచ్చింది. తెల్లకుక్క దానిని కలుసుకుంది. దానిమీద పడింది. ఎఱ్ఱకుక్క ఇదివరలో తాననుకొన్న మాటలు జ్ఞాపకము చేసుకొన్నది. ఏమైనా సరే సాంతముగా యుద్ధము చేయుదలచింది. రెండు కుక్కలూ తలపడ్డాయి. ఘోరముగా యుద్ధము జరుగు

తోంది. ధూళి పయికి లేచిపోతోంది. తెల్లకుక్క ఎఱ్ఱకుక్క పీకి గట్టిగా పట్టుకోంది. ఎఱ్ఱకుక్క వదలించుకోని తెల్లకుక్క తోక కొరికింది. తెల్లకుక్కకు ఉగ్రోషము వచ్చింది. తిరగబడి దానిని కిందకు తోసింది. దానిమీద నిలబడి మొరుగుతూ అందుబాటులో ఉన్న దేహాన్ని కరుస్తోంది. అదృష్టవశాత్తు ఈ యుద్ధము ఒక ముసలికుక్క చూచింది. అది పిల్లలతల్లి. తక్షణం తరుగెత్తుకువచ్చి తెల్లకుక్కను చూచి మొరిగింది. తెల్లకుక్క జవాబు మొరిగి కిందబడ్డ కుక్కను పీడిస్తోంది. ముసలికుక్క తెల్లకుక్కమీద పడింది. ఎఱ్ఱకుక్క తప్పించుకొని లేచింది. ఈ రెంటి ధాటికి తాళలేక తెల్లకుక్క పరిగెత్తింది. ముసలికుక్క ఎఱ్ఱకుక్కను సముదాయించి తన పిల్లల దగ్గిరికి వెళ్ళిపోయింది.

ఎఱ్ఱకుక్క ఒళ్ళంతా మండుతోంది. అంతకంటె ఎక్కువ మంట కడుపులో మండుతోంది. బుఱ్ఱ వంచుకొని రోడ్డుమీదనుంచి వచ్చినదారినే వెళ్ళుతోంది.

తెల్లవారి లేచి ఎవరి మొహం చూసేమో గదా అనుకుంది. ఇంతకాలంనుంచి బ్రతుకుతు వస్తూఉన్నా ఇంత తిండి లేకపోవడం ఎప్పుడూ తటస్థించ లేదనుకొన్నది. ఇప్పుడింక ఎక్కడకు వెళ్ళేది? ఎవళ్ళింటికి వెళ్ళినా అక్కడ కుక్కలు తన్ను రానియ్యావు. పోనీ కాఫీహోటళ్లకి వెడదామా అంటే వెధవ దుంపనెయ్యి వాసన. పోనీ, ఏ దుంపనెయ్యి వాసనైనా సహించి పొట్ట నింపుకుందామా అంటే ఆ హోటళ్లను ఆశ్రయించి బతుకుతూఉన్న కుక్కలకు మితిలేదు. అవి దాన్ని దగ్గిరకు రానియ్యావు. అయినా యీ ప్లీడరు కుటుంబము

ఎక్కడకు వెళ్ళినట్టు? తన సంగతి వాళ్ళకేమీ అక్కర్లేదు గదా, వారిల్లు తాను కనిపెట్టుకుఉన్నా ! అయినా మానవులకు కృతజ్ఞత వుండడం అసంభవం. ఇప్పుడు ఏమిచేసేదీ? ఈ రోజుకు ఇంక తిండిలేదుకాబోలు.

అని అనుకొంటూ వుండగా దాని ముక్కుకు ఒక సువాసన తట్టింది. అది ఆగింది. ముట్టె ఎత్తింది. నాలుగువేపులా పరకాయించి చూచింది. వాసనచూచింది. ఒక దిక్కునుంచి పకోడీల వాసన రావడం కనిపెట్టింది. ఆ దిక్కుగా నడిచి వెళ్ళింది. ఒక ఇసుక పర్రమీద నలుగురైదుగురు మానవులు మధ్య నేమో పెట్టుకొని ప్రపంచమంతా మరిచి తింటున్నారు. క్రమంగా వారిని సమీపించ దలచుకొన్నది. కాని దానికి సందేహం వేసింది. ఈ మానవులు నమ్మదగ్గవాళ్ళేనా అని. కొంచెం పరకాయించి చూచింది. వీళ్ళు బడిపిల్లలు కారని తోచింది. బడిపిల్లలు కాకపోతే అసురసంధ్యవేళ ఈ భోజనాలేమిటి? అనుకొన్నది. ఈ గొడవంతా నాకెందుకు? నన్ను చూచి ఏమైనా పారవేస్తారేమో సమీపించి చూస్తాను అనుకొని సమీపించింది. దుంపనేతివాసన కొట్టింది. ఈ సంధ్య వేళ ఈ దుంపనేతి సరుకు ఈ మానవులు ఎలాగ అనుభవిస్తున్నారోగదా అనుకొని ఈ రోజు లేచినవేళ మంచిది కాదనుకొని వాళ్ళకేసి రెప్పవెయ్యకుండా చూస్తోంది.

అక్కడ మంది తక్కువ, తినేసరుకు ఎక్కువగా ఉంది. ఎవరి కిష్టము వచ్చినది వారు తింటున్నారు. ఎవరికీ ఇష్టంగా లేని సరుకు వాళ్ళు వదలిపెట్టినారు. పోనీ ఆ కుక్కకేనా పెట్టండి అని ఒకరన్నారు. ఒకముక్క కుక్కవేపు పారవేశారు.

ఎఱ్ఱకుక్క సంతోషించి ఆ ముక్క ఒక్కమారు నోట్లోకి తీసుకొని మ్రింగివేసి వాళ్ళకేసి మళ్ళీచూడ్డం మొదలుపెట్టింది. తమతోపాటు తిననిస్తారేమోనని వారిని సమీపించింది గాని వాళ్ళు ఇష్టపడ్డట్టులేదు. అందుచేత దూరంగానే నిలబడి వాళ్ళు పారేసే పకోడీముక్కలుతింటూ నిలబడ్డది. శుష్కోపవాసం అనుకుంటే ఏదో పథ్యం పెట్టుతున్నారుగదా అని సంతోషించింది. ఈ రీతిగా కొంత ఆకలి తీరింది. పూర్తిగా తీరవచ్చునని అనుకొన్నది కాని ఒక అభ్యంతరము వచ్చింది.

తెల్లకుక్క ఏలా పసికట్టిందో కాని ఆ స్థలానికే పరుగెత్తుకు వచ్చింది. అక్కడ కూర్చున్న మానవులను పరకాయిస్తూ వచ్చి దూరాన నిలబడింది. అందులో వకరు ఎఱ్ఱకుక్కవైపు ఆహారము వెయ్యడం చూచింది. ఎఱ్ఱకుక్క తోకముడిచి దానిని మింగడం చూచింది. తనకు ముందుగా ఎఱ్ఱకుక్క అక్కడకు వచ్చిందని కోపమూ, ఒంటిపట్టుగా దొరికిందిగదా పాత వైరాలు తీర్చుకో వచ్చునని ఆశా పురికొల్పగా పరుగెత్తి వెళ్ళి దానిమీద పడింది. ఎఱ్ఱకుక్క జాలిగా మొరిగింది.

మానవులకు జాలివేసింది. అందు వక పెద్ద మనిషి న్యాయాన్యాయ విచారణ దక్షుడు, ఒక గొడుగు తీసికొని తెల్ల కుక్కను శిక్షించవలెననే ఊహతో లేచాడు. యుద్ధము చేస్తూ ఉన్న రెండు కుక్కలూ ఆతనికేసి చూచినవి. రెండూ భయపడినవి. కాని ఆయన గొడుగు దెబ్బకు తెల్లకుక్క లక్ష్యము కాబోవుతున్నదనే సంగతి తెల్ల కుక్క కనిపెట్టి పరుగెత్తింది. ఆయన దానివెంట తరుముకు వెళ్లాడు. అది ఆయనకేసి

చూస్తూ పరుగెత్తుతూ, నవ్వుతూ "రా, రా, నన్ను కొట్టు దువ్వుగాని లే, రా. నీబోటివాళ్లను చాలామందిని చూశాను" అనే భావము వెల్లడిచేసే దృష్టులతో ఆయనను కొంతసేపు తనవెంట త్రిప్పుకొన్నది. వాళ్ళు కూర్చున్న ప్రదేశానికి చుట్టూ ఆయనను త్రిప్పింది. ఆయన విసిగి దాన్ని "తెల్ల జాతి గుణం పోనిచ్చుకున్నావు కావులే" అని తిట్టి మళ్ళీ వచ్చి కూర్చుని ఎర్రకుక్కకు ఆహారం వేశాడు. ఎర్రకుక్కకు ఆయన మీద అభిమానము భక్తి కుదిరినవి. మానవులలో ఇటు వంటివాళ్ళుకూడా ఉంటారు కాబోలు ననుకొన్నది.

ఆయన కూర్చునీ కూర్చోకముందే తెల్లకుక్క అక్కడికి వచ్చి నిలబడింది. ఎర్రకుక్కకేసి తీవ్రముగాచూచి అనువు గాని-చోట అధికుల మనరాదు, అనుకొని ఏమైనా తనవైపు పకోడీలు వస్తవేమోనని ఆశించింది. దానికీ కొంత ఆహారం దొరికింది. కాని ఎర్రకుక్కకు మానవులమీద కలిగిన మంచి అభిప్రాయం మారిపోయింది. ఆ పెద్దమనిషి తెల్లకుక్కమీద తనకుగల కోపాన్ని పకోడీలతో కొట్టి తీర్చుకున్నాడు.

ఇది ఇలా ఉండగా ముసలికుక్కకూడా అక్కడకు రావడం తటస్థించింది. అది పిల్లలతల్లి అనేసంగతి మానవులు కని పెట్టేరు. దానినిచూచి తెల్లకుక్కా ఎర్రకుక్కా గౌరవముతో తప్పుకొన్నవి. ముసలికుక్కకూడా ఆహారము కోసమే వచ్చి నట్లు మానవులకు స్పష్టమయింది. దానికికూడా కొంత పార వేస్తూ ఒక మానవుడు అన్నాడుగదా "అంత తనపొట్ట పోషించుకోలేని స్థితిలోవుండి తాను ఎందుకు పిల్లలను కన వలెను, పిల్లలకు పెట్టగల సామర్థ్యము తనకుంటేగా?". ఇంకో

మానవుడు "తెల్లదొరలు సంతాన నిరోధము చేసుకొనుటకు ప్రసాదించిన సూక్ష్మమార్గము లుంటూండగా ఈపిల్లలను కనడము బాధపడడము ఎందుకు? ఇంతకీ వెధవ కుక్కబుద్ధి ఎక్కడకు పోతుంది?" అన్నాడు.

ఈ మాటలు వినడంతోనే ముసలికుక్క నొచ్చుకుంది. తాము చెడడమే కాకుండా లోకాన్నంతా చెరచడానికి ప్రయత్నిస్తున్నా రీ మానవులు అనుకొని ఎన్నితిట్లు తిట్టినా ఒక పకోడీకి సమానంకాదు అని సమాధానం చెప్పుకొని నిలబడింది.

మానవుల ఫలహారాలయినవి. చీకటిబడినది. వాళ్ళు లేచి పోయారు. "విరగడైంది బాధ" అనుకొని కుక్కలు వాళ్ళు వదలిపెట్టిన బుట్ట నాశ్రయించినవి. మళ్ళీ అక్కడ యుద్ధము జరుగవలసిన దే. కాని తెల్లకుక్క తెలివైనదికాబట్టి దేశకాల పాత్రములను కనిపెట్టి మానవులను నాలుగు తిట్టి ఎర్రకుక్క కేసిచూచి "జ్ఞాపకముంచుకో నాకు దొరక్కపోవులే" అని చెప్పి లేచిపోయింది. ముసలికుక్క మిగిలిన ఆకులను నాకి పాలు చేపు రావడము చేత పిల్లలను తలచుకొని పారిపోయింది.

కొంత ఆకలి తీర్చుకొన్నది కాబట్టి ఎర్రకుక్క మానవుల వెంట వెళ్లదలచుకొని ప్లీడరుగారిల్లు జ్ఞాపకము రాగా అక్కడకు పరుగెత్తుకువెళ్లి వాళ్ల అరుగుమీద ముంగాళ్ళమీద మూతిని పెట్టి లేని ఈగలు దట్టుకుంటూ పడుకొంది.

1928

# డబ్బు డబ్బు డబ్బు

ప్లీడరు దగ్గిరికి ఎందుకైనా సలహాకి వెడితే ఏదో ఒక కేసు కల్పించి కొన్నికాలాలపాటు ఆ కేసు నడిపించి డబ్బు లాగుతాడు.

డాక్టరు దగ్గిరికి ఎందుకైనా సలహాకి వెడితే ఏదో ఒకజబ్బు కనిపెట్టి ఆజబ్బు ఆధారంగా అతడు కొంతకాలం జీవిత యాత్ర నడుపుతాడు నాడబ్బుతో. ఏవృత్తిలో ఉన్నవాడైనా సరే సలహాకిగానే వెళ్లినట్లయితే డబ్బులాగక మానడు. ఈ సంగతి నాకు అనుభవైకవేద్యమై, నాసంగతి తలచుకొని వాళ్లతోపోల్చి చూచుకొని గట్టిగా ఆలోచించడం మొదలు పెట్టాను. నేను మాత్రం ఎందుకు డబ్బు గడించకూడ దను కొన్నాను. అయితే మంచీ చెడ్డా అక్కర్లేదా, ధర్మం అధర్మం లేదా అనుకొన్నాను. పాశ్చాత్యనాగరీకవైభవంతో ముదురుస్తూఉన్న ఈకాలంలో అటువంటి కుతర్కాలు పెట్టు కోవడం మూర్ఖం అనిపించింది.

ఇంక నేను డబ్బుసంపాదించే మార్గా లేమిటా అని ఆలో చించాను. కవులు చాలామంది నాస్నేహితులు. వాళ్లు తప్ప కుండా వాళ్లు వ్రాసిన పద్యాదులు నాదగ్గిరికి తీసుకువచ్చి "చూడండి, ఇదికొంచెం చదివి మీఅభిప్రాయం తెలియ జెయ్యాలి. కొంచెం తొందరగా వ్రాయడంవల్ల అక్కడక్కడ దోషాలుకూడా పడిఉంటాయి. కొంచెం జాగ్రత్తగా చదివి

అక్కడక్కడ తప్పులున్నచోట మార్కులు పెట్టండి" అని అంటాడు.

ఎవరోకవి ఏదోపద్యం రాస్తే నే నెందుకు చదవాలి? నే నెందుకు అభిప్రాయం ఇవ్వాలి? నే నెందుకు తప్పులు చూపించాలి? ఈశ్రమఅంతా నేను పడడమెందుకు? డాక్టరు గారిదగ్గిరికి వెళ్లి "చూడండీ డాక్టరుగారూ, నే నోజబ్బు సంపాదించాను. కొంచం జాగ్రత్తగా పరీక్షచేసి ఏదైనామందు ఇప్పించండి" అంటే ఊరకే ఇస్తారా మందు? నేనుమాత్రం ఊరకే ఎందుకు చెయ్యాలి? అందుచేత ఈపనికి నేనుకూడా కొంత ఫీజు చార్జీ చెయ్యాలి అని ఒకరూపాయిఫీజు ఏర్పాటు చేస్తాననుకోండి. అప్పుడు ప్లీడర్లకీ డాక్టర్లకీ అడిగిన డబ్బు అడిగినంతలో తెచ్చి ఇచ్చినట్లు నాకు ఈరూపాయి మహాద్భాగ్యం ఇస్తాడా! ఇయ్యడు. ఇయ్యక అంటారుగదా "న్యాయమేనా మహాశయా, ఇటువంటి పనులు చెయ్యడం? మిమ్మల్ని అభిప్రాయం అడిగితే అదో గౌరవంకింద భావించుకోక శ్రమకింద భావించి డబ్బు అడుగుతా రండీ! నాపద్యం మీద అభిప్రాయం ఇచ్చినట్లయితే ఆ అభిప్రాయం నేను పుస్తకం చివర అచ్చువేస్తానే! దానివల్ల మీ కెంత ఘనత! మీ అభిప్రాయం అచ్చువేసినందుకు నే నొక దమ్మిడీ అయినా మిమ్మల్ని అడగనే! ఆమాత్రం కృతజ్ఞత అక్కర్లేదా? నేడు మీదగ్గిర అభిప్రాయం పుచ్చుకొని ప్రకటించేనంటే రేపటినుంచి ఎంతమంది మీ అభిప్రాయంకోసం ఉత్తరాలు వ్రాస్తారు? అచిరకాలంలో మీకీర్తి దిగంతవిశ్రాంతం కాదా? ఇప్పుడు అభిప్రాయం అడిగితేనే డబ్బు

కావా లంటున్నారు. ముందు వచ్చేలాభాలు మీ రాలోచిం చడం లేదు. మీరు అభిప్రాయాలు రాయడం క్రమక్రమంగా అలవాటుపడ్డట్లయితే గ్రంథకర్తలు ముందుముందు మీచేత ఉపోద్ఘాతాలు, పీఠికలు, ముందుమాటలు, మున్నుడులు మొద లైనవి ఎన్నైనా వ్రాయించుకొంటారు. ఉపోద్ఘాతాదులు వ్రాయడం పరిపాటిగా జరిగిందంటే కొంతకాలంపాటు-మీరు పండితులైనట్లేగదా! ఈలోపుగా మీరు వ్యావహారిక భాషను తిట్టి చులాగ్గా పరిషత్సభ్యులు కావచ్చునుకూడాను. తరవాతసంగతి ఆలోచించండి. మీరు ట్రయినింగు పరీ క్షలు మొదలు బి ఏ. పరీక్షలవరకూ పరీక్షపత్రాలు ఇవ్వ వచ్చు. యూనివర్సిటీలో సెనేటు సభ్యులు కావచ్చు. దోసిళ్లాది డబ్బు సంపాదించవచ్చు. వెధవ రూపాయికోసం ఇప్పుడు కక్కుర్తిపడతారుటండీ, రానుండే ఈవైభవమంతా ఆలోచించుకోకుండా? "అని చిన్న ఉపన్యాసం ఇస్తాడు. ఒకమాటు సంకల్పించుకొన్నాక ఆసంకల్పం మార్చుకోవడం బుద్ధిమంతులలక్షణం కాదనుకొని నేను అడిగిన రూపాయి ఇస్తేనేకాని పద్యం చదవడం అభిప్రాయం ఇవ్వడం జరగ దంటాను. అప్పు డతగాడు, "ఏదో పెద్ద మనిషిగదా అని అభిప్రాయం అడగవస్తే తీరి కూచుని రూపాయి ఇవ్వమం టున్నాడు. ఇత డెంతచేసు? ఇతడి అభిప్రాయం ఎంతచేసు? కావలిస్తే ఏపుస్తకంమీాదనైనా, ఎటువంటి అభిప్రాయమైనా లక్షలాది అడిగిన తక్షణం ఇచ్చేవాళ్లు ఉంటూండగా తన్ని అడిగిందే గౌరవంకింద భావించుకోక ఫీజు కావాలంటున్నాడు. ఆంధ్రదేశంగొడ్డు బోయిందనుకొన్నాడు కాబోలు. నాపద్యం

మీద అభిప్రాయాలు ఆంధ్రదేశం నాలుగు దిక్కులనుంచీ తెప్పించి "అభిప్రాయ మణిమంజరి" అని పేరుపెట్టి ఒక గ్రంథం అచ్చువెయ్యగలనని ఎరగడు కాబోలు. కాస్త ఆశ్రయించవలసిన వాళ్లని ఆశ్రయించి నా "అభిప్రాయ మణిమంజరి" ఏ స్కూలుఫైనలుకో టెక్స్టు బుక్కుగా పెట్టించుకో లేనను కొంటున్నాడు కాబోలు. పోనీ అని అభిప్రాయం అడిగితే ఇంత తెగనీలుగా అని తిట్టుతూ వెళ్లి పోతాడు. ఇటువంటి సందర్భాల్లో డబ్బు సంపాదించడం ఎట్టా? ఊహ ఎంతకీ తెగిందికాదు. మొట్టమొదట కొత్తగా ఉండడం వల్ల డబ్బు ఇవ్వడానికి సందేహించినా క్రమక్రమంగా డబ్బు ఇవ్వడం గ్రంథకర్తలు నేర్చుకోవచ్చు నను కొన్నాను. కాగితాలకనీ, అచ్చుకనీ, బైండింగుకనీ డబ్బు తగలబెట్టి పుస్తకాలు వేయించుకొని ఇళ్లల్లో దాచుకోవడం లేదూ గ్రంథకర్తలు! లాభం వస్తుందనే చేస్తున్నారా ఇదంతా? ఖర్చులో ఖర్చు! అభిప్రాయాలకోసం పది రూపాయల సొమ్ము ఖర్చుపెట్టలేరూ? అనుకొని అలవాటు అయితే వాళ్ళే ఖర్చుపెడతారనుకొని సమాధానపెట్టుకొన్నాను. పుస్తకాలకి అభిప్రాయా లివ్వడమే కాకుండా కొన్ని పుస్తకాలు చదివినందుకూ, కొందరితో మాట్లాడినందుకూకూడా ఫీజు పుచ్చుకోవచ్చును. ఈమధ్య నా స్నేహితుడొకడు ఒక పుస్తకం చదివాడు. అందులో రెండు చరిత్రకథ లున్నాయి. ఆ పుస్తకం ఖరీదు అర్ధరూపాయి. మొదటికథ చదివి అది బేడ చేస్తుందన్నాడు. రెండో కథ చదివి పావలా తనకి వస్తుందన్నాడు. బాలెన్సు బేడ, గ్రంథకర్త నా స్నేహితుడికి

బాకీపడ్డాడు—గ్రంథం ఖరీదుసంగతి అలావుండగా లోకంలో న్యాయమే ఉన్నట్లయితే, ప్రజల కష్టసుఖాలు ప్రభుత్వము వారు కనిపెట్టి చూస్తూ ఉన్నట్లయితే నా స్నేహితుడుకి బేడ రావలసినదే. కాని వస్తోందా? కలికాలంలో న్యాయం ఆశించడం తప్పు మనదే. ఇటువంటి గ్రంథాలు చదవవలసిన దురవస్థ మన కెందరికి పట్టడంలేదు? చదివినందులకు తగిన ఫీజు మనకెప్పటికప్పుడు ముట్టుతూ ఉన్నట్లయితే మన కంత కష్టముగా ఉండకపోవచ్చును. కాని ప్రతిఫలం ఇచ్చే వా డేడీ?

ఇక మాట్లాడినందుకు ఫీజు పుచ్చుకోదగ్గ మనుష్యుల్ని గురించి మనవిచేస్తాను. కొందరు పెద్ద మనుష్యులు మొహం ఎరికవా ళ్లందరితోనూ స్నేహంకలుపుకొని వేళాపాళా లేకుండా వాళ్లని చూడడానికనీ వాళ్లతో మాట్లాడడానికని—బాతా ఖానీ అనే పారిభాషికపదం వాడతారు. ఈ సందర్భము లో—ఇళ్లకి వస్తూఉంటారు. వచ్చి వాళ్ళు చేసేదేమిటి? ఒకటి : నీవు చేసుకొనే పని చెడగొట్టడం. రెండు: నీకు ఏ మాత్రమూ ఇష్టములేని విషయాలనిగురించి ప్రసంగిస్తూ అది విని సమాధానం చెప్పడానికి నిన్ను మొహమాట పెట్ట డం. మూడు : నిద్ర పోతూన్న నీపిల్లల్ని లేపి లేని ప్రేమ ఉన్నట్లు నటించి వాళ్లని ముద్దుపెట్టుకొని, నవ్వించి, పరిగె త్తించి ఏడ్పించి చివరకు వాళ్లఏడ్పు తగ్గకముందే లేచిపోవడం. నాలుగు: దాహములేనిదే మంచినీళ్లు తెప్పించుకొని పరిశీ లించి చూచి సగం త్రాగి మిగిలినవి పారబొయ్యడం. అయిదు : నీతాలూకు వక్క-పొడో, పొడుమో, సిగరెట్లో పూర్తిగా ఖర్చుపెట్టడం. ఆరు : నీవు ఏభాండాగారంనుంచో

చదువుకోడానికి తెచ్చుకొన్న పుస్తకం తీసుకుపోయి పారేయ్యడం. ఆపుస్తకం ఖరీదు నీవు ఇచ్చుకోవడం ఇత్యాది.

ఇటువంటి మనుష్యులు నీతో మాట్లాడడానికి వచ్చినప్పుడు వాళ్ల దగ్గిరనుంచి అయిటం ఒక్కంటికి రూపాయి చొప్పున ఫీజు పుచ్చుకోవాలని నీకు ఉండదూ? ఎందుకు పుచ్చుకోకూడదూ? నాగరీకం అంటారే. ఈమాత్రంఫీజు ఏర్పాటు లేని నాగరీకం ఏమి నాగరీకం? ఈ కాలంరో దేనివల్ల డబ్బు వస్తుందో అదే పనికివచ్చేపని. డబ్బురాని పని వ్యర్థం. అందుచేత మనము చేసే పనులన్నింటినుంచీ డబ్బు రాబట్టడానికి మనం ప్రయత్నం చేస్తూఉండాలి.

ఎట్లాగంటే—

"శాస్త్రుల్లుగారూ! ఏకాదశి ఎప్పుడండీ" అంటే ఫీజు "అర్ధణా"

"తేలు కుట్టింది పంతులుగారు! మందు ఉందా" అంటే ఫీజు "పావలా"

"వంకాయలు వీశె ఎలా పుచ్చుకొన్నారు బజారులో" అంటే ఫీజు "కాని"

"టైము ఎంతయిందండీ" అంటే "అర్ధణా"

"రైలుస్టేషనుకు దారి ఇదేనా" అంటే ఫీజు "అణా"

"ఈవేళ విశేషా లేమిటండీ" అంటే ఫీజు "అర్ధరూపాయి"

"ఈవేళ మీటింగు ఎప్పుడండీ" అంటే ఫీజు "అణా".

"అంతా బాగున్నారా" అంటే ఫీజు "బేడ"

ఈవిధంగా ఫీజు ఏర్పాటుచేసుకొని పుచ్చుకోవడం మంచిది. "విరోచనాలకి ఒకమాత్ర ఇవ్వండి డాక్టరుగారూ"

అంటే ఆయన తాహతు ననుసరించి అణో, బేడో, పావలో మాత్రకు పుచ్చుకొంటూన్నట్లే మనమూ పుచ్చుకోవచ్చును. ఇందులో ఇంకో రహస్యంఉంది. కొందరు బుద్ధిమంతులు సర్వసాధారణముగా అందరికీ తెలిసిన, తెలియవలసిన విషయాలనుగురించి ప్రశ్నలు వేస్తూఉంటారు. అటువంటి ప్రశ్నలకు సమాధానం చెప్పవలసివస్తే ఫీజు ఎక్కువగా పుచ్చుకోవడం సమంజసమే అని చెప్పనక్కరలేదు.

"అమృతాంజనం తలనొప్పికి మంచిమందేనా" అంటే ఫీజు "పదిరూపాయలు"

"కవిత్వం చేసేవాళ్లకి ఉద్యోగాలు ఎందుకు దొరకవండీ" అంటే ఫీజు "అయిదురూపాయలు"

"ఇంగ్లీషు చదువుకొన్నవాళ్లకి ఇంగితజ్ఞానం ఉండదా" అంటే ఫీజు "ఇరవైరూపాయలు." "మీరు సిగరెట్టు కాలుస్తారా" అంటే ఫీజు "పాతికరూపాయలు".

అయితే కొందరికి తమకు తెలిసిన విషయాలు ఇతరులకు అమ్మడం అధర్మంగా తోచవచ్చును. ఈ కాలంలో ప్లీడర్లు, డాక్టర్లు, ఉపాధ్యాయులు, సంగీతపాటకులు, నాటకాలవాళ్లు, చిత్రలేఖకులు ఇత్యాది అందరూ ఈ వ్యాపారమే చేస్తున్నారు. కాబట్టి ఇందులో తప్పేమీ లేదు.

ఇదిగాక మనపాలకు లయిన ఇంగ్లీషువాళ్లు మనకు అనుకరణప్రాయులు కాబట్టి, వాళ్లు ఇటువంటిపనులు బాహాటంగా చేస్తున్నారు కాబట్టి, మనమూ వాళ్లను చూచి నేర్చుకోవచ్చునుగదా! యథా రాజా తథా ప్రజా అనే ఆర్యోక్తి ఉండనే ఉంది!

ఇక ఓట్లు ఇచ్చినందుకు తాహతు ననుసరించి ఉప్పా, ఇడ్డెనులు మొదలుకొని వందలకొద్ది రూపాయలు ఫీజు పుచ్చు కొనడము దేశాభ్యుదయసూచకమని వేరే చెప్పనక్కరలేదు.

ఆదాయము వృద్ధిచేసుకోవడమే పరమావధిగా పెట్టు కొన్న గవర్నమెంటులకు రివిన్యూ వృద్ధిచెందే మార్గాలు సూచిస్తున్నాను. ఇటువంటి పరమోపకారం నేను చేస్తూ ఉన్నందుకు నాకు ఒక బిరుదు వారు దయచేస్తారని ఆశించు కొని ఉండడం అత్యాస కాదని బుద్ధిమంతు లూహించు కొందురు గాక! ఒకవేళ అటువంటి బిరుదులు ఇటువంటి సందర్భాల్లో ఇవ్వడం సమంజసం కాదని వారికి తోచినట్ల యితే అధమపక్షం ఒక కంచుపతకమేనా దయచేస్తారని అను కొంటున్నాను. తరువాత వారి చిత్తం, నాభాగ్యం. ఇక నేను సూచించే మార్గా లేమిటంటే—

౧. దేశములో ఈ కాలములో కవులూ, నవలాకారులూ, కథకులూ మొదలైన గ్రంథకర్తలున్నూ, టెక్స్టు బుక్కులు మాత్రమే వ్రాసే గ్రంథకర్తలున్నూ, అపరిమితంగా వృద్ధి చెందుచున్నారు. వారి పుస్తకాలు ప్రకటించడానికి ప్రత్యే కంగా కొన్ని కంపెనీలు ఏర్పాటైనవి. ఆ కంపెనీల దగ్గర నుంచిన్నీ, గ్రంథకర్తల దగ్గరనుంచిన్నీ సులభముగా పన్ను వసూలు చేయవచ్చు. తద్ద్వారా రివిన్యూ వృద్ధిచేసుకోవచ్చు.

౨. నల్లమందు, కల్లు, సారాయి, గంజాయి మొదలైన వస్తువుల తయారు, అమ్మకము విషయమై గవర్నమెంటు వారు పన్నులు విధిస్తున్నారు. సంఘమునకు నీటివల్ల అప కారం కలుగుననీ, పన్నులు విధించి కట్టు దిట్టముగా పనిచేసి

నట్లయితే ఉపద్రవము శాంతించుననీ ప్రజలు బాగుపడుదురనీ వారు అనుకోవడము సమంజసముగానే ఉన్నది.

ఈ విధముగానే సంఘమునకు ఉపద్రవము కలిగించే ఇంకో సమస్య వారు పరిష్కరించి రివిన్యూ వృద్ధిచేసుకోవచ్చు. మనదేశములో ఇప్పుడు ఏదేశములోనూ లేనంత మంది బిచ్చగాళ్లు ఉన్నారు. ఇంటింటికీ తిరిగే అన్నిజాతుల బిచ్చగాళ్ళూ గాక రైళ్లను ఆశ్రయించుకు బదికేవాళ్లూ, తీర్థాలను ఆశ్రయించుకు బదికేవాళ్లూ, మోటారుబస్సుల నాశ్రయించుకు బతికేవాళ్ళూ అనేకమంది ఉంటూన్నారు. ఇదిగాక తమ అంధత్వమునో, తమ కుంటినో, తమ కురూపమునో జీవనాధారముగా పెట్టుకొని బదికేవాళ్ళున్నూ, అనాదిగా వంశపరంపరగా బిచ్చమెత్తడమే వృత్తిగా గల వాళ్ళున్నూ, శకునాలు చెప్పడము సోదె చెప్పడము మొదలైన తమ విద్యలను జీవనాధారముగా పెట్టుకొని బిచ్చమెత్తే వాళ్ళున్నూ లక్షలాది గలరు. వీరుగాక కొందరు బిచ్చగాళ్లు తమకు సేవచేయుటకుగాను కొందరు నౌకరులను ఏర్పాటు చేసుకొని, తాము ఏ బండిలోనో కూర్చుని తమ నౌకరులచే ఆ బండి లాగించుకొంటూ ఊరూరూ తిరిగి బిచ్చమెత్తుకొంటూ తమ నౌకరులకు ఒప్పన్నమైన జీతాలిస్తూ కాలక్షేపం చెయ్యడంకూడా కద్దు.

ఇంతమంది బిచ్చగాళ్లు మనదేశములో ఉండి దానతత్పరులకు పుణ్యము సంపాదించిపెట్టుతూ స్వర్గద్వారకవాటాలు వదలిస్తూ ఉండగా వీరినిగురించి ఇంతవరకూ ఎవరూ పరిశోధనలు జరపకుండడము చాలా శోచనీయమైన

విషయము. తత్కాలంకాన్ని బాపుకొనడమునకు గాను మున్ముందు ఈ బిచ్చగాళ్లయొక్క ఆదాయ వ్యయాదులను గురించి లెక్కలు తయారు చేయవలసిఉన్నది. ఈ కార్యమును డబ్బులేని పరిశోధకులు పూనుకొని పనిచేయడము కష్టసాధ్యము. కాబట్టి అందుకై ఒక కమీషను ఏర్పాటు చేస్తే బాగుంటుంది. ఆ కమీషనుకు పరాయి దొరలు పదిమందిన్నీ, ఇండియాలో ఒక బ్రాహ్మణుడూ, అయిదుగురు బ్రాహ్మణేతరులూ, ఒక మహమ్మదీయుడూ, ఒక క్రైస్తవుడూ, ఒక సోదరీమణీ ఉంటే బాగుంటుందని తోస్తుంది. ఈ కమీషనుకు చైరుమనుగా ఒక దొరను ఏర్పాటుచేయవచ్చును. ఇందుకుగాను నాలుగులక్షల రూపాయలు బడ్జెటులోనుంచి శాంక్షను చేయవచ్చును. ఈ కమీషనుకు అన్ని సదుపాయాలూ చెయ్యవలెను. పౌరులు వీరికి సహాయము చెయ్యవలెను. రైల్వేకంపెనీవారు ప్రత్యేకముగా వీరికోసం కొన్ని బళ్ళు నడిపించవలెను. వీరు హిందూదేశము ఆసేతు హిమాచలమూ సంచరించి అందరు బిచ్చగాళ్ల సాక్ష్యమూ పుచ్చుకొని, తరువాత వారందరూ సంప్రతించుకొని ఒక స్టేటుమెంటు ప్రకటింపవలసి ఉన్నది. దానిలో ముఖ్యముగా బిచ్చగాళ్ల ఆదాయ వ్యయపట్టికలూ, వారివారి వర్ణాదులు, వారివారి విద్యలూ, జబ్బులూ, వారి నివాసములు మొదలైన విషయము లుండవలెను.

తరువాత ఈ విషయములన్నీ పరీక్షించి బిచ్చగాళ్ళమీద పన్ను విధించవలసి ఉన్నది. పన్ను విధించేటప్పుడు మాత్రం బ్రాహ్మణా బ్రాహ్మణ సమస్యా, హిందూ మహమ్మ

దీయ సమస్యా, నిమ్న జాత్యుద్ధరణ సమస్యా మొదలైన సమస్యలు మనస్సులో పెట్టుకొని బ్రాహ్మణులకు ఎక్కువగానూ, బ్రాహ్మణేతరులకు తక్కువగాను, నిమ్న జాతులకు మరీ తక్కువగానూ పన్ను విధించ వలసి ఉంటుంది. హిందూసన్యాసులకీ, మహమ్మదీయ పకీర్లకీ పేచీ రాకుండా ఒక కమిటీ ఏర్పాటుచేసి ఆ కమిటీ నిర్ణయప్రకారం వారికి పన్ను విధిస్తే బాగుంటుంది. ఇట్లా బిచ్చగాళ్లమీద పన్ను విధించడంవల్ల తప్పకుండా చాలా డబ్బు వస్తుంది. ఆ డబ్బుతో సైన్యపు ఖర్చు హెచ్చుచెయ్య నైనా చెయ్య వచ్చును. లేదా బిచ్చగాళ్లమీద అధికారం చలాయించడానికి ఒక దొరను కమీషనరుగా ఏర్పాటు చెయ్య నైనా చెయ్యవచ్చును. ఆ దొరకింద ఇద్దరు ముగ్గురు నల్లవాళ్లని గుమాస్తాలుగాకూడా ఏర్పాటు చేయవచ్చును.

పైని సూచించిన విధముగా పీఠాధిపతులు మొదలుకొని సాధారణ భిక్షుకులవరకూ ఉన్న బిచ్చగాండ్రమీద పన్ను విధించినట్లయితే అపరిమితంగా రివిన్యూ వృద్ధి అయి భారత దేశము ఎక్కువ వైభవముతో వెలగగలదు. తన్మూలమున లోకకల్యాణముకూడా చేకూరగలదు.

3. ఇంకోసూచనచేసి ఇంతటితో విరమిస్తున్నాను.

పత్రికలు నడపడం ముఖ్యముగా చందాదారుల సంఖ్య వృద్ధిచేసికొని తద్ద్వారా డబ్బు సంపాదించుకోవడానికే గదా! గవర్నమెంటువారుకూడా కొన్ని పత్రికలు నడుపుతున్నారు గాని వారు చందాదారులసంఖ్య వృద్ధిపొందించడానికి తగిన ప్రయత్నాలు జరపడము లేదు. జిల్లా గెజట్టు, రాష్ట్ర గెజట్టు

ఇవి దొరతనమువారి పత్రికలు. ఇవి కొందరు ఉద్యోగస్థులే చదువుతారుగాని అందరూ చదవరు. నిజానికి ఇవి అందరూ చదవవలసిన పత్రికలే. వీటిని అందరిచేతా చదివించడానికి మార్గం ఇతర పత్రికలవలె ఇవికూడా ప్రజలను ఆకర్షించేటట్లు చేయడం. అందుకోసమై ప్రతిసంచికలోనూ, బొమ్మలూ, చిన్నకథలూ, నాటకాలూ, హాస్యాలూ ప్రచురించడం చాలా లాభకరమైన విషయము. ఇందుకోసం వారు ప్రత్యేకంగా వ్యాసకర్తలను తడుముకోవలసిన అవసరము లేదు. చేతినిండా పనిలేని గవర్నమెంటు ఉద్యోగస్థులు అన్ని శాఖలలోనూ అనేకమంది ఉన్నారు. వారినందరినీ వ్యాసాదులు వ్రాయమంటే తప్పకుండా వ్రాస్తారు. అందువల్ల పత్రికలు బాగుంటాయి. ప్రజలను ఆకర్షిస్తాయి. చందాదారులసంఖ్య వృద్ధి అవుతుంది. డబ్బుకూడా చాలావస్తుంటి. సులభముగా ప్రజలను సంతోషపెట్టి డబ్బు సంపాదించగలిగిన ఈ మార్గమును తప్పకుండా పాలకులు అనుసరిస్తారని మనవి.

ప్రజలు డబ్బు సంపాదించడానికి ఫీజులు వసూలుచేసే సందర్భాలు అనేకం ఇదివరలో చెప్పి ఉన్నాను. అవి గాక ఇంకా ఎవరిబుద్ధికి తోచినట్లు వారు ఫీజులు వసూలు చేసుకోవచ్చు. ప్రజలకు ఈమాత్రం దయచేస్తూ ఒకశాసనము కూడా శాసనసభలవారు అమలులో పెట్టినట్లయితే చాలా బాగుంటుంది.

ఇటువంటి అమూల్యమైన వ్యాసం వ్రాసి లోకోపకారం చేసినందుకు ప్రజలు నాకు ఎంత ఫీజు ఇవ్వవలసి ఉంటుందో!

1930

# రైలుబండిలో ప్రేమ

ఆయనగారికి ముప్ఫైరెండో యేట భార్య పోయింది. పోయిన తరవాత ఆయన మళ్లీ పెళ్లిమాట తలపెట్టలేదు. ఆయన తలపెట్టకపోవడము మాట అలావుండగా ఆయనకు దగ్గర బంధువులూ ఆప్తులూ అనేవారుకూడా ఆ ప్రశంస అసలే ఎత్తలేదు. "బాగుండదు. ఎవరైనా ఏమైనా అనుకుంటారేమో. అని ఆయన పినతండ్రి మాత్రము "ఏదో యెక్కడైనా చూచి మళ్లీ ముడేస్తేనే కాని వాడి నోట్లోకి మెతుకులు వచ్చే మార్గంలేదు. ఆ రవంతపనీ నీవూ నేనూ కలిసి చేస్తిమట్టాయనా తరువాత వాడిబతుకు వాడుబతుకుతా"డని అన్నాడు ఆయన పినమామగారితో.

"ఇద్దరు పిల్లలూ, బెడదా యింతుండగా ఇంకా పెళ్లిమాట లేమిటి బావా!" అన్నాడు పినమామగారు రహస్యముగా. దానితో ఆయన ద్వితీయము సంగతి ఆగిపోయింది.

పెళ్లాముతో కాపరముచేసే టప్పుడైనా ఆయన ఒకరోజు భార్యతో కలసిమెలిసి లేడు. ఎప్పుడూ పెళ్లాన్ని కొట్టడమో, తిట్టడమో! ఇంతేకాని చిలకాగోరువంకలాగా వుండేవాళ్ళు కారు. ఏమో అన్యోన్యము లేదనిచెప్పితే వాళ్ళ కిద్దరు పిల్లలు ఎలాకలిగినారు? అదోగాలిపాటు!

భార్యపోయి మూడేళ్లయింది. ఆయన పెద్దపిల్లవాడికి పన్నెండు సంవత్సరముల ఈడు వచ్చింది. రెండవపిల్ల వాడికి తొమ్మిదో సంవత్సరము. ఈ కాలవు పిల్లకాయలకు చిన్న

తనంలోనే స్వతంత్రం అబ్బుతుంది. కాబట్టే పెద్దపిల్లవాడు అప్పుడే తలకు క్రాపింగు చేయించుకున్నాడు. పంట్లాము తొడుగుకుంటున్నాడు. చిరిగిపోతే పోయింది, కోటుకూడా వేస్తున్నాడు; అంతేకాకుండా వాళ్ళమ్మ తాలూకు ఎర్ర రవికలను చింపి సన్నని పేలికలను మెడచుట్టూ చుట్టుకుంటూ న్నాడు. దొరలు అలా చుట్టుకుంటారు. అది నాగరికలక్షణం అనే సంగతి తెలియకుండా బడిలో పిల్లవాళ్లు వీడినిచూచి ఆక్షేపించేవారు!

రెండో పిల్లవాడు పాపం ఇంకా చిన్నతనం అవడంచేత ఈ వేషభాషలు నేర్చుకోలేదు. మాసిన గావంచాగుడ్డ కట్టుకొని వీధులవెంట తిరుగుతూ వుంటాడు. అప్పుడప్పుడు బడికి పోవడంకూడా కద్దు. చదువుకోవడం లేదని తండ్రిచేత తన్నులు తినడంకూడా కద్దు. బొడ్డూడని కుర్రకుంకను కిరసనాలుబుడ్డి ముందర కూలవేసి, "చదువు, వెధవా చదువు; బియ్యే ప్యాసవు," అంటే వాడు చస్తాడా!

పాపము వీడికి క్రాపింగులేదు. కాని పూర్వకాలపు బ్రాహ్మణచిన్నవాళ్ళ కున్నట్లు జుట్టుమాత్రం కలదు. పూజాపురస్కారాలు లేకపోవడంచేత అది ఒకళ్ళకు లొంగక ఇష్టం వచ్చినట్లు స్వేచ్ఛగా శిరస్సుమీద విహరిస్తూ వుంటుంది.

ఎలాగో యీ పిల్లవాళ్ల నిద్దరినీ పెట్టుకొని ఆ పెద్దమనిషి కాలక్షేపం చేస్తూవున్నాడు. రానురాను అతనికి కొంచెం పెండ్లిమీద భ్రమ కలిగింది. కాని పెళ్లి జరిగేవిధం లేదు. అతనికి భూములున్నాయా చదువులున్నాయా ఎవరైనా పిల్ల నివ్వడానికైనా!

ఒకనాడు అతడు రైలుబండిమీాద ప్రయాణం అయి వెళ్లుతున్నాడు. అదిబూర్సుబండీ అవడంవల్ల అతడు కూర్చున్న గదిలో చాలామంది జనం లేరు.

నెత్తికి పొత్తుపంచ తలపాగా చుట్టుకొని మాసిపోయిన కుడితిసీలోనుంచి తొంగిచూస్తున్న జంధ్యాలవల్ల బ్రాహ్మణు డని తెలిసికోగల పెద్దమనిషి వక్కడు.

మెడలో బంగారపు రుద్రాక్షపూస కట్టుకొని గూడ కట్టుతో నున్నని తలతో కమలాఫలము వొలిచి సేవకుడు ఇస్తూంటే తినే నాటకోటిసెట్టి యింకొకడు.

బాహ్యవేషాన్నిబట్టి చూస్తే తెల్లదొరవలె వుండవలెనని ప్రయత్నాలు సలిపినప్పటికీ తన శరీరకాంతి హిందూత్వ మును వెల్లడిచేస్తూన్న దనే సంగతి గుర్తెరగక, ఎడమచేతితో మీసము దువ్వుకుంటూ, పాపడసవరించుకొంటూ, కుడి చేతితో ఇంగ్లీషునవలను పట్టుకుని బహుదీక్షతో చదువు తూన్నట్టు నటించు నవనాగరిక విద్యార్థి ఇంకొక్కడు.

సన్నగ్లాసుగోమల్లు అద్దకపుచీర ధరించి, మోచేతులు దాటివచ్చు జాకెట్లుతొడిగి, రెండుభుజాలవద్దా రెండు పొళ్ల పిన్నులను గుచ్చి (ఈ పొళ్లు గాజురాళ్ళే అని కొందరు స్త్రీలు స్టేషనులో అనుకున్నారు) బంగారపు సన్ననిగాజుల జత ముంజేతుల కలంకారమగునట్టుచేసి నిష్కలంకవదన బింబ ముతో (అక్కడక్కడ నల్లనిమచ్చ లున్నాయి కాని, ప్రబంధ కారులు కళంకంగా భావించిన బొట్టులేదు కాబట్టి నిష్క లంకం అనవచ్చు). చెన్నారుతూ నవనాగరిక విద్యార్థి తడవతడవకూ బంపు క్రేగంటి చూపులు తనపై బడినవని

యెఱిగియు, ఎరగనట్టు భ్రమింపజేయుచూ, కిరస్తానీ సోదరీ మణులను తలపునకు దెచ్చు నాగరిక ప్రౌఢ వితంతు వాకతే.

ఇంకా నలుగురైదుగురు బండిలో కూర్చున్నారు. ఈమె కూర్చున్న బెంచీమీద కూర్చున్నాడు మన కథానాయకుడు. ఇంటివద్ద ఎలాగంటి దుస్తులు ధరించినా ప్రయాణంలో మాత్రం ఇతను మంచిబట్టలు వేసుకోవడం కద్దు; ఆ బట్టలు అత్తరువువాసనకూడా కొడుతూవుంటవి. నేడతను కాకీషర్టు వేసుకున్నాడు. షర్టు చేతులను మోచేతివరకూ ముడిచివేసినాడు; కుడిచేతికి తగిలించుకున్న బంగారపు గొలుసు అందరికీ అగుపించాలని అలా వేసినాడని ట్రేనులో కొంతమంది పెంకెసజ్జు కుర్రవాళ్లు అనుకున్నమాట వాస్తవం. భుజం మీద కండువాగాని నెత్తిమీద టోపీగాని ఉన్నవేమో అని చూడనక్కరలేదు; ఎందుచేతనంటే నెత్తిమీద టోపీ పెట్టుకుంటే నున్నగా దువ్వుకున్న పాపిడి చెరిగిపోతుంది; భుజంమీద కండువా వేసుకోవడం నవీనాచారకాండలో లేదు. అతడు నల్లగా వుంటాడని లోకులు వాకొంటారు కాని అతని అభిప్రాయం మాత్రం అదికాదు. విజయవిలాసంలో సుభద్ర చెప్పిన, "ఎగు భుజంబులవాడు మృగరాజ మధ్యంబు బుడుమిపుచ్చుకొను నెన్నడుమువాడు...........

..................................................

....మెరుగుచామనచాయ మేనివాడు........" ఇత్యాదిపద్యం అతనికి కంఠతా రావడం మాట అటుండగా ముస్తాబైనప్పుడల్లా ఆపద్యమే చదవడంకూడా అలవాటు. చంద్రుడికి కళంకం వున్నట్టు అతడికి ఒక గొప్ప లోటుమాత్రం వున్నది;

అది నిజంగా లోటుగా ఎన్నవలసింది కాదు. ఏమంటారా? కళ్ళు రెండూ వాటివ్యాపారం అవి చేస్తూవుండడమే మనకు కావలసిన విషయంకాని వాటికి కొంచెం మెల్లవుంటే నేమి? ఈయనకు ఈమెల్ల యేమైనా సౌందర్యలోపం కలుగజేసిందా? ఒకవేళ అది అంగవైకల్యమే అనండి, లోపమే కాగట్టండి. అయినా లోకంలో ఎందరికి లేదు ఈలోపము? ఈసంగతి ఆయన ఎన్నిమార్లు అనుకోలేదు?

మన కథానాయకుడు బెంచీమీద కూర్చుని (మెల్లకన్ను అవడంమూలాన కాబోలు) ఒక కంటితో ఈవైపు, ఒక కంటితో ఆవైపు ఒక్క మారు బండిలో వున్నవాళ్ళను పరీక్షించేడు. ఆపరీక్షకు ఫలితం ఏమంటే, ఆయన కుడికన్ను నుంచి వచ్చే దృష్టులు ప్రౌఢవితంతువు మీద వాలినవి. ఎడమకన్నులోనుంచి బయలుదేరిన చంచల దృఙ్మాలికలు నాటికోటిసెట్టి చేతితో పట్టుకున్న కమలాఫలపు తొనమీద పడ్డాయని సెట్టి అనుకున్నాడు. విశ్వస్త చూపులు ప్రస్తుతం రైలుబండి కిటికీలోనుంచి దాటి వెలపలనున్న కొండలమీద ప్రయాణం చేస్తున్నట్లున్నాయి. కాని ఆడవాళ్ళ కళ్ళు హరిణ శాబక నేత్రాలవలె లోలములై వుంటాయని చెప్పడంవల్ల ఏ క్షణంలో ఎక్కడికి చూపులు ప్రసరింపచేస్తున్నారో చెప్పడం దుర్లభం. ప్రబంధకారు డెవడైనా అప్పు డక్కడ వున్నట్లయితే తత్క్షణం మన్మథుడు ఎడమా కుడీ విచక్షణ లేకుండా పుంఖాను పుంఖంగా పూలబాణాలు ఇద్దరిమీదా విసురుతున్నాడని వర్ణించకపోడు. ఇద్దరిమీదా విసురుతున్నా లేకున్నా మన కథానాయకుడి మీదమాత్రం ఆబాణాలు

పడి బాధపెట్టిన వని మాత్రం స్పష్టం. ఎందుచేతనంటే, హోరుమని నడుస్తున్న రైలుబండి చప్పుడులో మేళమై కొంచెం కొంచెంగా మూలుగులు వినబడ్డాయి. ఈ మూలుగులు క్రమక్రమంగా రాగవరసలోకి మారినాయి. రాగము ఆలాపన చేస్తున్న మనకథానాయకుని కుడికన్ను కుడిరెప్ప లోకీ ఎడమకన్ను ఎడమరెప్పలోకీ పోయి తెల్లగుడ్లుమాత్రం పయికి కానవచ్చేయి. ఆ తెల్లగుడ్లు ఎవరినైనా చూస్తున్నాయా ఏమో అంటే, అది చెప్ప వీలుపడదు.

రాగాలాపనచివర నాలిక పళ్లసందున పడి బండిలోవున్న వారిని తొంగిచూసింది; తన ప్రవీణత అందరూ మెచ్చుకుంటున్నారో లేదో అని తెలుసుకోవడమునకు కాబోలు. ఇంతట్లో నాలుక లోపలికి పోయింది. నల్లగుడ్లు బయటికి వచ్చేయి. కుడికన్ను విశ్వేస్తమీద పడ్డది. ఎడమకన్ను సెట్టి మీద పడ్డది. విశ్వేస్త కొంగులో దాచుకొన్న తమలపాకులూ, చెక్కలూ, సున్నపుకాయా పయికి తీస్తూ ఉన్నది. సెట్టి బట్ట సవరించుకొని చేతులు కడుగుకుంటున్నాడు.

రాగం విసరడం అయినతర్వాత కథానాయకుడు కంఠం సర్దుకుని పద్యం చదవడం ప్రారంభించేడు. రాగాలాపం బండిలో వున్నవాళ్లందరికీ సంతోష మిచ్చిందనే ఆతని ధైర్యమే పద్యం చదివించిందంటే ఎక్కువ సరసంగా ఉంటుంది.

"ఉవిద, నీకపరాధ మొనరించితినయేని
మొలనూలుతోనన్ను మోదరాదె? ...."

అనేపద్యాన్ని మొదలుపెట్టి రాగవరసతో చదవడం

ఆరంభిచేడు. భావశూన్యం కాబట్టి రాగమునకు అభినయము అనవసరము. భావప్రధానము గల పద్యానికి అభినయము ప్రాణమనే సంగతి మన కథానాయకుడికి తెలుసును. అందు చేతనే రైలుబండి చప్పుడులో శ్రుతి కలిపి అభినయ పూర్వకంగా పద్యం చదవడం ప్రారంభిచేడు. కాని యీ అభినయ కార్యమును ముఖ్యముగా చేతులే చెయ్యడం మొదలు పెట్టేయి. నాటకాలలో తిరిగే నేటినటుడు ఈ అభినయ మందు ముఖమున భావము వ్యక్త మగుతుండడమే లేదని తప్పు పడుతాడు. కాని ముఖమునకల్లా ప్రధానమైనది కన్ను. కంటిలోని నల్లగుడ్లు పై రెప్పలోకి పోగా మిగిలిన తెల్లగుడ్లు కొంతమట్టుకు భావాన్ని వెల్లడి చేస్తున్నాయని చెప్పవచ్చును.

ఈ అభినయంలో కుడికన్ను చూపిన దారివైపు కుడి చెయ్యి విశృంఖలంగా పోయినది! ఎడమకన్ను చూపిన మార్గాన్ని ఎడమచెయ్యి పోవడం మూలాన సెట్టి మనస్సులో భయబీజము లంకురించడమే కాకుండా, నిలుచున్న పాటున చీల్చివేద్దామనే న్యాయమైన సంకల్పంకూడా కలిగింది కాని, అది ఆచరణలోకి రాలేదు.

కుడిచెయ్యి విచ్చలవిడిగా కుడివైపు సంచరించడం నవ నాగరిక విద్యార్థికి సత్యాగ్రహము కలగడమునకు ప్రథమ కారణము. సత్యాగ్రహమునకు ఫలము—అతని ముఖం ఎఱ్ఱబారడం, చొక్కా చేతులు వెనకకు వెళ్ళడం, నవల చేతి లోనుంచి కిందపడడం, గొలుసు పట్టుకు లాగి రైలుబండి ఆపుదామనే దృఢసంకల్పము. ఈ సత్యాగ్రహం ఏవిధం గానూ కార్యరూపంగా పరిణమించలేదు.

ఈ అభినయముతో పద్యం పూర్తి అయిందని బండిలో వాళ్ళందరూ సంతోషించారు. విశ్వస్తముఖమున మంద హాసరోచు లంకురించినవనీ ఎర్రని పెదవులుదాటి పైకివచ్చిన దంతములధావళ్య మట్లు చాటుతున్నదనీ మన కథానాయ కుడు ఊహించినాడు. కార్యమునుబట్టి కారణము నూహించ డము బుద్ధిమంతుల లక్షణం. ఆమె మనస్సులో ప్రణయ బీజము లంకురించినవనుట కనుమాన మిూవూహే ఆతని కొసంగినది. కారణం వినా కార్యం జరుగబోదు కదా! కాని నిజముగా ఆలోచిస్తే ఈ వూహకు ఆధారము లేదు. ఎందుచేతనంటే ఆవిశ్వస్తదంతములు సహజముగా పెదవు లను దాటివుండి నిరంతరము తెల్ల వెన్నెలలు కాయుచునే యుండును. ఇట్లుండుటవల్లనే కాబోలు తనముఖము నవ్వు ముఖమని ఆమె అనుకొనుచుండడము కూడా కద్దు.

ప్రణయబీజా లంకురించేయని నమ్మి ఆయన మళ్ళీపద్యం మొదలుపెట్టి చాలా జాలిపుట్టేటట్టు చదవవలెనని వూను కున్నాడు.

"అతివా, దాపగనేల ? నిన్వలచి
నీకత్యంత సంతాప
దుస్థితి జేకూరిచి.... ......"

ఇత్యాది పద్యం అభినవపూర్వకంగా రాగవరసతో చదివి నాడు, ఇందులో మొదటిపాదం రెట్టించి చదివేడు కాని, శృంగార, కరుణా, భీభత్సరసము లందు మిళితములై యున్నాయని లాక్షణికు లభిప్రాయపడకపోరు. అయితే శృంగారము పద్యమునందునూ, కరుణారసము చేతులను

జోడించి విశ్వస్తవైపు తిప్పి అంజలి ఘటించడములోనూ, భీభత్స మాతని ముఖలక్షణములందూ వేర్వేరుగా తాండవమాడుచుండడముచేత రససాంకర్యము కలిగినదని కాని దోషము పట్టినదని కాని వూహించ నవసరంలేదని సమాధానం చెప్పుకోవచ్చును.

ఇంకా పద్యం పూర్తి కాకముందే రైలుబండి రాజమహేంద్రవరం స్టేషనుకు వచ్చినిలబడ్డది. పద్యముకూడా ఆగిపోయింది. శ్రుతి లేక ఆగిపోయిందేమో అని సందేహ పడనక్కరలేదు. ఆగిపోవడం సాభిప్రాయపూర్వకంగానే జరిగింది. మనకథానాయకుడి నల్ల గుడ్లు పయిరెప్పలలోనుంచి యివతలకు వచ్చినవి. కుడికన్ను యథాప్రకారం విశ్వస్తమీద పడుటకుబదులుగా ఆవిడకూర్చున్న బెంచీభాగంమీద పడ్డది; ఎడమకన్ను సెట్టిబోడితలకాయను పరీక్షిస్తూన్న ట్లున్నది. మన కథానాయకుడు ఏకారణంచేతనో ముఖం బిక్కవేసి రైలుబండి గుమ్మమువైపు చూసినాడు. విశ్వస్త కిందకుదిగి తన తాలూకు పెట్టెను కిందకు దింపుకుంటున్నది. మనకథానాయకుడు లేచినాడు; జేబులోనుంచి టిక్కెట్టుతీసి పరీక్షించినాడు. దానిమీద ఏలూరని వ్రాసివున్నది. ఏలూరనిరాసి వుంటేమాత్రం రాజమంద్రంలో దిగ కూడదా అనుకున్నాడు. అనుకుని అమాంతంగా ఆమెపెట్టెమీదనుంచి కిందికి దుమికి పెట్టెను రెండుచేతులతో దింపినాడు. దింపి తనపౌరుషమును లోకమునకు చాటినాడు. చాటినసంగతి ఆమె గ్రహించినదా లేదా అని తెలిసికొనుటకై కాబోలు, ఆమెవైపు చూసినాడు. లేదులేదు; ఆమెవైపు ముఖం తిప్పినాడేకాని కళ్ళుమాత్రం

ఆవిడమీాద పడలేదు. అవి యెవరినో చూస్తున్న ట్లున్నాయి కాని ఆమెను చూస్తున్నట్లు లేవు. తరవాత ఆయన, "పెట్టె చాలా బలువుగా వుందండీ!" అని తనకుగల వస్తు గుణ విజ్ఞానమును వెల్లడిచేసినాడు. "అవును, బలువుగానే వుంది" అని ఆ పూర్వసువాసిని ఆతని వాక్యమును బలపరిచింది.

ఇంతట్లో కూలివాడు మూట లున్నాయా అని రాగా విశ్వాస్త మాట్లాడకముందే మనకథానాయకుడు వాడిచేతులో బేడకాసుపెట్టి పెట్టె అవతల పెట్టించినాడు.

"బండి ఎక్కడికి కట్టించవలసి వుంటుందో?" అని తన సందేహము వ్యక్తపరచినాడు మనకథానాయకుడు.

"సెబాసు, ఎంతమాట! మీా రెవరో! మీాకు శ్రమ యివ్వడం........."

అనబోతూండగా ఆయన, ఇన్నీసుపేట కట్టించనా? అని ప్రశ్నించినాడు.

"ఆర్యాపురం వెళ్ళవలసివుంది కాని–మీా రెక్కడికి వెడతారు?" అని ఆమె అన్నది.

అయితే నాళంవారిసత్రానికి బండి కుదురుస్తాను అని ఆయన బండి కుదిర్చినాడు.

బండి ముందు నడుస్తున్నది. బండివాడు నడుస్తూ బండి తోలుతున్నాడు. ఆయన వెనకాల బయలుదేరేడు.

"నాకోసంమీారుచాలాశ్రమపడ్డారు"అని విశ్వాస్తఅన్నది.

"ఎంతమాట! మీా రలా అనకూడదు. మీాబోటివాళ్ళ కోసం శ్రమపడకపోతే నే నెందుకు బతకడం?" అని తన జీవితాశయము వెల్లడిచేసినాడు.

"మీది రాజమండ్రదమేనా? మీ పేరేవరండి?" అని విశ్వస్త ఆతనిజీవితచరిత్రపై తనకుగల అభిమానమును తేట తెల్లము చేసింది.

"మాది కాకినాడ అయితే నేమి, నాకు ఒక ఊరంటూ లేదు. నాపేరు అప్పయ్—కాదు ఏమిటీ అన్నారూ!

నాపేరు అప్పారా వంటూరు. అయితే మీది ఆర్యాపురం కాపరస్థలం కాదనుకుంటాను!"

"అసలు మాది గుంటూరు. ఏంచెప్పను, నారాత యిలా రాసి వున్నది. అనుభవించక తప్పుతుందా" అని కంట తడి పెట్టింది ఆమె.

"ఊరుకోండి. ఏం చేస్తాము! నే నెవరితో చెప్పుకోను?" అని అప్పారావు కంటతడిపెట్టేడు.

"నా కింతరాత రానుండగా ఒకళ్ళని అనవలసిన పని యేమిటి? కుదురు లేకుండా...." అని దీనస్వరముతో విల పించ బోయింది.

"ఏం చెప్పను? తలుచుకుంటే దుఃఖంచేటు! నమ్మ తారో లేదో కాని సరిగ్గా మీ పోలికేనుమండి!" అని అప్పా రావు విలపించినాడు.

విశ్వస్త పెదవులలోనుంచి కొంచెంగా చిరునవ్వు వచ్చి "నిజంగా?" అని అన్నట్లున్నది.

"నిజంగా. మీరు నమ్మండి, మానండి. అచ్చంగా మీ రూపమే" అని మళ్ళీ కంటతడిపెట్టి "అదే బతికివుంటే ఇన్ని పాట్లు నాకెందుకు సంభవిస్తాయి" అని నిట్టూర్పు విడచి నాడు.

విశ్వస్త వినన ట్టు నటిస్తూ "ఆయనే బతికివుంటే, అడ్డ మయినవాళ్ళూ ఇలా న న్నెందుకు లోకువ చేస్తారు!" అని తన వర్తమాన స్థితిని గురించి విచారించింది.

ఆమాటలు వినడంతోనే అప్పారావుగుండెలో రాయి పడింది. కొంప మునిగిం దనుకున్నాడు. మంచిచెడ్డలు తెలియకుండా ప్రవర్తించినందుకు తగినశాస్తి జరిగిం దనుకున్నాడు.

ఇం కెప్పుడూ ఇలాంటిపని చెయ్యనని మనస్సులో ఒట్టు పెట్టుకున్నాడు; తన్ను తాను నిందించుకున్నాడు; గట్టిగా నాలిక కొరుకుకున్నాడు; ఆడవాళ్ళను నమ్మరాదురా బతికి వుండగానూ అనుకున్నాడు.

"తరుణివిభ్రమంబు తలపోయ శక్యమే ధాతకైన వాని తాతకైన" అనే పద్యం జ్ఞాపకం వచ్చింది. ఏలూరు ప్రయాణం చెడి యింతమట్టుకు వచ్చిందికదా అనుకున్నాడు. రాజ మంద్రంలో మెతుకులు వచ్చేవిధం ఎలాగ? మళ్ళీ ఏలూరికి ఎప్పుడు బండి వెళ్లుతుంది? అది తెలుసుకోవడం ఎలాగ? అని ఆలోచిస్తున్నాడు. ఇంకా అక్కడ నిలపడితే ఏమి చివాట్లు తగులుతాయో, యేమి చిక్కులు సంభవిస్తాయో అని వెనక బట్టడానికె ప్రయత్నాలు చేస్తుండగా ఆమె, "చూశారా యీావుత్తరం నమ్మించి ఎలాగ గొంతుక కోసేడో" అన్నది. అప్పారావుకు కొంతమట్టుకు ధైర్యం చిక్కింది. ఉత్తరం పుచ్చుకొని యిలా చదువుకున్నాడు.

బెజవాడ,

శ్రీమతి నరసాంబకు – సుబ్బారాయుడు రాసేది ఏమనగా: మన వివాహం విషయంలో గుంటూరు నీవు రావల

సిందనిన్నీ, అక్కడ యావత్తు సంగతులూ పరిష్కరించుకొని వివాహం చేసుకుందామని చెప్పియున్నాను. కాని మాతల్లి దండ్రులకు ఈ వ్యవహారం తెలియడంవల్లనూ, స్నేహితులు వెళ్లవద్దని బలవంతం చెయ్యడంవల్లనూ నేను గుంటూరు రాలేక పోయినాను. ఇందువల్ల నీకు తెలియచెయ్యడం ఏమంటే, నేను నిజంగా నిన్ను ప్రేమించివున్నా ప్రస్తుతంలో నిన్ను పెళ్లి చేసుకోడానికి వీలులేదు. నీవు తక్షణం రాజమండ్రికి వెళ్లిపోవలెను. వెనుకనుంచి వీలునుబట్టి వుత్తరం రాస్తాను. ఖర్చునిమిత్తం ఈ వుత్తరంతో అయిదు రూపాయిల నోటు పంపినాను. ఈ విధంగా రాయవలసి వచ్చినందుకు విచారిస్తున్నాను.

గ్రహించవలెను,
సుబ్బారాయుడు వ్రాలు.

"ఎంతద్రోహం చేసేడూ! ఇతగాడు చాలా దురాత్ముడు లా వున్నాడే!" అని తన కోపాన్ని, సుబ్బారాయుడి యెడల తనకుగల అభిప్రాయాన్ని ఒక్కమారు తెలియజేసేడు.

"ఇంక నన్ను చూసేవా రెవరు? ఏకాకినై యిలా తిరగవలసిందే. నాబతుకు ఇలా అయిపోయింది!" అని నర్సాంబ మళ్ళీ కంట తడి పెట్టింది.

"విచారించకండి. మీరు విచారి స్తే నేను విచారించినట్లుంటుంది. మీరు ఏకాకిగా వుండవలసిన కర్మ మేమిటి నేను బతికివుండగాను——? మీకు అభ్యంతరం లేకపోతే సరీ——"

నర్సాంబ మాట్లాడలేదు.

"మీరు సందేహించ వలసినపనిలేదు. నేనూ కొంత మట్టుకు ఇంగ్లీషు చదువుకొన్నాను. ఇంగ్లీషు మాట్లాడగలను కూడాను. తెలుగులో కవిత్వం చెప్పతాను. వుద్యోగంలో వున్నాను. వర్తకం చేద్దామనికూడా వుంది.—"

నర్సాంబ కొంచెం నవ్వింది.

ఇంతట్లోకే బండి నాళంవారి సత్రందగ్గిరికివచ్చి ఆగిపోయింది. సత్రంలో వాగిద్దరూ ఒకగది పుచ్చుకున్నారు. ఆరోజునే వారిద్దరికీ పెళ్ళి సంబంధం స్థిరపడింది. రెండు రోజులు పోయినతరువాత పెళ్ళి ముహూర్తం పెట్టుకోవచ్చునని అనుకున్నారు.

ఆరాత్రి అప్పారావు కాకినాడ వెళ్ళినాడు. పిల్లవాళ్లను ఇద్దరినీ సత్తెలింగం సత్రములో అప్పజెప్పినాడు. అక్కడ బడిలోనే వాళ్లను చదువుకు అప్పజెప్పినాడు. కుర్రవాళ్లు ఏదో మూడిందని చాలా ఏడ్చేరు. తండ్రితో వస్తామని మంకుపట్టు పట్టేరు. వాళ్లని ఊరుకోబెట్టడం బ్రహ్మాండం అయింది. మరునాడు అప్పారావు బయలుదేరి రాజమండ్రం వెళ్ళేడు. నర్సాంబ యితనికోసం ఎదురుచూస్తున్నది. వారిద్దరికీ రాజమహేంద్రవరం తోటలో పెళ్లి జరగగలందులకు ముహూర్తం మధ్యాహ్నం మూడుగంటలకు ఏర్పాటు చేశారు.

పెళ్లికొమారుడు మధుపర్కములు ధరించినాడు. తెల్లని షర్టు తొడుగుకొన్నాడు. చుక్కబొట్టు పెట్టుకున్నాడు. పెళ్లికూతురు కొత్తచీర కట్టుకుంది. జాకెట్టు తొడుగుకుంది. కాళ్లకు

పసుపు రాచిందో లేదో చెప్పడానికి వీలులేదు. ఎందుచేత నంటే అక్కడకు వచ్చిన పెద్దమనుష్యులలో ఈ విషయమై కొంత చర్చ జరిగింది. పసుపు రాసుకుందని కొందరూ—సుతరామూ రాసుకోలేదని మరికొందరూ. మొత్తంమీద దీని నిజానిజాలు పైకి తేలేయికావు.

పెళ్లి చేయించడానికి ఒక పురోహితుడు వచ్చేడు; నాలుగు రూపాయలికి ఒప్పందల అయి వచ్చినాడట. ఏలాగయితే నేమి పుస్తె ముడిపడింది. కరతాళ ధ్వనులతో హిప్పుహిప్పుహు ర్రాలతో మహాదాశీర్వచనము ముగిసింది. తరువాత అప్ప గింతలు. ఒక పెద్దమనుష్యుడు వచ్చి పెళ్ళికుమార్తెను పెళ్ళి కుమారుడికి వప్పజెప్పినాడు. యధాప్రకారం "అష్టవర్షా భవేత్కన్యా పుత్రవత్ పాలితా మయా ........" ఇత్యాది శ్లోకం చదివేడు. అష్టవర్షా అనేబదులు ఇరవైయేళ్ళు (వింశతి వర్షా) అంటే బాగుంటుం దని కొందరు అనుకొన్నారు. అసలు ఆ శ్లోకమే చదవడం తప్పని యింకా కొందరు అభి ప్రాయపడ్డారు. ఎలాగైతే నేమి వొకపెళ్ళి జరిగినది; ఒక కుటుంబము—కాదు—రెండు కుటుంబాలు నిలబడ్డవి.

1920

# మన్మథసందర్శనము

చాలాకాలంనుంచీ మన్మథుడి దర్శనం చేసుకోవాలని కుతూహలం వుండేది. అది నేటికి గాని సిద్ధించింది కాదు. ఎలా సిద్ధించిందో చెప్పడానికి వీలు లేదు. ఆవిషయాలు రహస్యంగా వుంచే షరతు మీాదనే కామదేవుడి దర్శనం నాకు లభించింది గనక ఆవిషయాలు వెల్లడి చేయడానికి వీలు లేదు.

వేటకు వెళ్ళడాని కని మన్మథుడు స్నేహితులతోనూ సహచరులతోనూ సిద్ధంగా వున్నాడు. ఆయన ఫలానా తావున వున్నా డని నిశ్చయించ లేకపోయినాను.

ఒకవైపున, చిగురుటాకుల పుట్టము కట్టుకొని, సిందూరము బొట్టు పెట్టుకొని, తోయజప్రసూనాలు తోరణం కట్టుకొని, వనలక్ష్మితో సరస మాడుతున్నాడు వసంతరాయుడు.

చల్లని నీళ్ళల్లో జలకా లాడి, దేహంనిండా పుప్పొడి పూసుకొని, మేఘాల వెంబడి వేటాడడానికి జింకబాబానెక్కి సిద్ధంగా వున్నాడు వాయుదేవుడు.

ఇంకోచోట, నల్లటి గొడుగు వేసుకొని, తెల్లటి బట్టలు కట్టుకొని, అస్తమానం నవ్వుతూ, చక్కని చుక్కలతో సరసా లాడు తున్నాడు చందమామ. అతన్ని చూసే సరికి మతి పోతుంది.

మరోచోట విల్లు కనిపిస్తున్నది. ఎక్కు పెట్టిన వింటిలో బాణాలు అవుపిస్తున్నవి. కిలకిల లాడుతూ చిలకలూ, కోకిలలూ రెక్కలతో వింజామరలు వేస్తున్నవి. కళ్ళు మిరుమిట్లు గొలిపే

అందం ఇలా మూర్తీభవించిందా అనేలాగు తోచే సుంద రాంగి—రతీదేవి కాబోలు—ఒక పక్కన కనిపిస్తున్నది. కామ దేవుడు కనబడడం లేదు. అయినప్పటికీ, కొంచెం వూహించి ఆస్థలాన ఆయన వున్నట్లు నిశ్చయించుకొని సమీపించి "కామ దేవా, నమస్కారము!" అన్నాను. "నిత్యశోభన మస్తు!" అనే మాటలు వినబడ్డవి.

"తమ రూప దర్శనం చేసుకోవడానికి మా బోంట్లకు అనుజ్ఞ దయ చెయ్యరా!" అన్నాను. అని వెంటనే చాలా నొచ్చుకొన్నాను. కామ దేవుడికి జరిగిన పరాభవం జ్ఞప్తికి తేవడం తప్పు. మాట జారిపోయింది! నా ప్రశ్నకు సమా ధానం రాలేదు.

"తమ సౌభాగ్యం చూచి పోవడానికి ఎంతో శ్రమ మీద ఇక్కడికి వచ్చాను" అన్నాను. అనీ అనడంతోనే— ఆయన ఆజ్ఞ పొందినాడు కాబోలు—వాయుదేవుడు నన్నెత్తు కొని పోయి కామదేవుడి ఆయుధాగారంలో దింపినాడు.

ముల్లోకాలనూ అవలీలగా జయించిన మహాయోధ ఆయుధాలు అయిదే అని యిదివరలో నావూహ. కాని అక్కడ చాలారకాల పువ్వులూ, చిగుళ్ళూ, తులసిదళాలు, దర్భలూ, మొగలిరేకులూ ఇంకా యేమేమో వున్నవి. అప్పుడు వాయుదేవుడి కేసి తిరిగి అడిగాను "అరవిందము, అశోకము, చూతము ఇత్యాది అయిదు బాణాలే కదా మన్మథుడివి. ఇవన్నీ యెందుకు!"

వాయుదేవుడు నవ్వి యిలా అన్నాడు. "వెర్రివాడా, పూర్వ యుగాలలో ఆబాణాలు వినియోగించేవాడు. స్వర్గ

లోకంలో ఇప్పటికీ ఆ అయిదే వినియోగిస్తాడు. కాని భూలోకాన కలికాలాన పరిస్థితులు మారడంచేత ఇన్నిరకాల బాణాలు కావలసి వచ్చింది. విన లేదా భూలోకంలో ప్రచారంలో వున్న ఈపద్యం—

జవరాలి బొడగన్నసన్యాసిపై నేయు
తులసి లేజిగురాకుతూపు మరుడు;
వేదవిప్రుని గన్నవిధవపై ఝళిపించు
దర్భపల్లవహేతి దగ్పకుండు;
కటకారకులకన్య గనిన హాళికుమీద
బొడుచు బూమునికోల పుష్పశరుడు;
నాడి■ధముని గన్ననాతిపై నేయును
నలరు జిచ్చరకోల నంగభవుడు;
బెరసి వెన్నెల గాయంగ బేరకమ్మ
పులినతలముల నాయూయిక్కొలము లెరిగి
దాల్చు శస్త్రాస్త్రములు జారదంపతులకు
నసమబాణుండు తిరుణాళ్ళ నన్నినాళ్ళు".

"అయితే భూలోకంలో పరిస్థితులు మారడంవల్ల మన్మథుడికి పని యెక్కువయినట్టు తోస్తుంది. పూర్వయుగాలలో వసంతకాలములో మాత్రం మన్మథుడికి పనివుండేది. అప్పుడయినా పర్వదినాలనీ, ఏకాదసులనీ ఇలాంటి సెలవుదినాలుండేవి. ఈ యుగంలో అన్నికాలాలలో అన్నిపూటలా చేతినిండా పనే. అందుచేతనే ఆయుధాలు హెచ్చుచేయవలసి వచ్చింది. ఆఫీసుకూడా వృద్ధిచేయవలసి వచ్చింది.

ఒకమూల మరతుపాక్కీ, పిస్తోళ్ళూ చూసి ఆశ్చర్యపడి అవి

యెందుకని వాయుదేవుణ్ణి అడిగాను. ఆయన అన్నాడు: "చెప్పలేదా ఈ కాలంలో అలాంటివి కావలసి వచ్చాయని? వింటినుంచి వదిలిన బాణాలు కొందరిమీద పనిచెయ్యవు. అలాటివాళ్లను పిస్తోలులో పువ్వులుపెట్టి కొడతాడు. తిరునాళ్ళు జరిగేటప్పుడూ, పెద్దపెద్ద సభలలోనూ, పశ్చిమదేశవాసుల విందులలోనూ, తోటవిందులలోనూ, తనకు కష్టం లేకుండా వుండేటందుకు సంఘంమీద ఒక్కసారిగా మరతుపాకీ ప్రయోగిస్తాడు. చాలాదూరాన వున్నలక్ష్యాన్ని కొట్టడానికి ప్రత్యేకంగా తుపాకు లున్నవి. వాయువిమానాలలో వెళ్ళే పాశ్చాత్త్యులమీద ప్రయోగించడానికి మాత్రం అవి ఉపకరిస్తవి."

"అయితే ఇంతపనీ ఒక్క మన్మథుడే చేసుకోగలడా?"

"ఆయనకు లోటేమిటి? ఎంతసిబ్బంది వున్నది! అందరూ ఆయనకు సహాయం వస్తారు. చంద్రుడి బాణాలు మట్టుకు మతిసంచలనంమాత్రం చేస్తవి. చూడు మన్మథుడి పద్దులు!" అని నాకు వాయుదేవుడు పద్దులు చూపినాడు. ఆయన దినచర్యా, మాసచర్యా, సర్వమూ అక్కడ వ్రాసి వున్నవి. ఆ లెక్కలు సంవత్సరాంతానికివిష్ణు మహేశ్వరులకు వెళ్ళవలె. ఒకనకలు బ్రహ్మదేవుడికి కూడా పంపినట్టు ఉదహరించి వున్నది. సృష్టి స్థితిలయాలు ఒక్కతాకీగా జరుగుతూ వుండడానికి ఈ లెక్కలు త్రిమూర్తులకూ అవసర మని తోచింది. వాయుదేవుడు తొందరచేస్తూవున్నా ఏదేశంలో ఎక్కువబాణాలు వినియోగపడ్డవో వినోదం తెలుసుకోవలె నని పద్దులు తిప్పి చూచాను. మొదట ఫ్రాంసు, తర్వాత

ఇంగ్లండు—ఇలా వున్నవి. మన హిందూదేశము ఏచివర సంఖ్యలలోనో కనబడ్డది.

"అయితే మన్మథుడు ఎక్కడ తరుచుగా వర్తిస్తూ వుంటాడు?" అన్నాను.

"నీవూహా యేమి?"

"అల్పజ్ఞుణ్ణి. నాకు తెలియదు. అయినా మాలోకంలో అనుకోవడం మాత్రం ఇది—

సంధివిగ్రహయానాది సంఘటనల
బంధకీ జారులకు రాయబారి యగుచు
పట్టణంబున నిత్యంబు పవలు రేలు
పూటకూటింట వర్తించు బుష్పశరుడు.

మరిన్నీ మన్మథ కూటమే వేశ్యావాటిక అని తలుస్తారు."

"ఆమాత్ర మయితే బాగానే వున్నది. ఇప్పుడు ఆయన వర్తించని ప్రదేశమే లేదు. అందులో ముఖ్యంగా సముద్ర తీరాలు, ఉద్యానవనాలు, ఉత్సవాలు, జూదపు కొంపలు, మద్యపుదుకాణాలు, ఓడలు, రైలుబళ్ళు, బస్సులు, వాయు విమానాలు. ఇంకో చిత్రం. ఇప్పుడు మన్మథుడు తన బాణాలు టెలిగ్రాఫు తీగెలలో నుంచీ, టెలిఫోను తీగెలలో నుంచీ పంపవలసి వస్తున్నది."

"అయితే మాలోకంలో పోష్టాఫీసు ఉద్యోగస్థులకు వలె మన్మథుడికి సెలవులు లేనట్టు తోస్తుంది,"

"అలాగే. ఇక వేటకు వేళ అయింది. వెళుదాముర్రా!" అని నన్నెత్తుకు పోయి యథాస్థానం చేర్చాడు వాయు దేవుడు.

అందరూ వేటకు సన్నద్ధులై బయలు దేరారు. ఈ తమాషాకూడా కొంచెం చూతామని నేనూ వెనక బయలు దేరాను. ఎప్పుడు చేరామో ఎలా చేరామో నాకు తెలియదు. కాని రెప్పపాటుకాలంలో మే మంతా భూలోకంలో వున్నట్టు గ్రహించాము.

మధ్యాహ్నం మొదలు మళ్లీ తెల్లవారేదాకా మన్మథుడు ఆడినవేట వర్ణించడానికి భారత మంత గ్రంథం అవుతుంది. అందులో కొన్ని ముఖ్యమైన సంగతులుమాత్రం చెప్పి మిగిలినవి ఊహాకు వదలుతాను.

వేటాడడంలో సాంప్రదాయం సాధారణంగా బాణానికి సులభంగా లొంగే జంతువుల జోలికి వేటకాడు వెళ్ళక పోవడము. అందుచేతనే పందిని వేటాడడ మన్నా జింకను వేటాడడ మన్నా చెవి కోసు కొంటారు. కాని మన్మథుడి సాంప్రదాయం ఇది కాదు. ఎవరు బాణాలకు త్వరగా చిక్కు తారో వారిమీదే బాగా బాణాలు ప్రయోగిస్తాడు. ఇందుకు తార్కాణం. పరాసుదేశపుస్త్రీలు బాణము చూడడంతోనే గడగడా వణుకుతారు. వింట సంధించి బాణాలతో కొట్టడు వారిని మన్మథుడు; చేతితో పువ్వులు విలాసంగా విసురు తాడు. అప్పుడు వాళ్ళు పడే క్షోభ చెప్పడానికి అలవి కాదు! కాఫీక్లబ్బులకుపరుగెత్తేవాళ్ళూ, నాటకశాలలకు పరుగు లెత్తే వారూ,తోటలకు పరుగు లెత్తేవారూ, పరదేశాలకు పరుగు లెత్తేవారూ! పరాసుదేశపు పురుషులమీాద మన్మథుడు అట్టే బాణాలు వెయ్యడు; పిస్తోలులో పెట్టి కొట్టేవాడు. ఇంగ్లీషు యువతులుకూడా పరాసుయువతుల చెల్లెళ్ళే ఈవిషయంలో.

మదరాసు సముద్రతీరం దగ్గిర విశేషాలు చెపుతాను. ఒక బైరాగి గూడకట్టు కట్టుకొని అలా వెళ్లుతున్నాడు. పిస్తోలులో పెట్టి మన్మథుడు ఒక్క పువ్వు పేల్చినాడు. వింటినుంచి వదిలిన పువ్వులు బైరాగుల మీద పని చెయ్యవట. పేల్చినా ఆపువ్వును అతడు దులిపేసుకొని వెళ్ళిపోవడం మొదలు పెట్టి నాడు. నా కాశ్చర్య మయింది. వాయుదేవుణ్ణి అడిగినమీదట దాని యధార్థకారణం తెలిసింది. బుద్ధి కొంచెమైనా మన్మథ ముఖమై వుంటేనేకాని బాణాలు పనిచెయ్యవు. మోక్షకాంక్ష గల బైరాగులమీద పిస్తోలుదెబ్బ పడకపోవడానికి కారణం అది. ధనకాంక్ష వున్నవారి మీదకూడా పనిచెయ్యవట. కాని మన్మథుడు అలాంటి వాళ్ళ విషయంలో సూటిగా వున్న మొగలిరేకులు వింటి కను సంధించి కొడతాడు. అప్పుడు ఎవ్వరూ లొంగకుండా వుండలేరు.

మన్మథుడు ఒకకొంటెతనంచేసేవాడిక్కడ. నవవధూటుల వెనక పొంచుండి సాధారణంగా బాణాలు వేసేవాడు. అటువంటి బాణాలు గురితప్పకుండావెళ్ళి అమోఘంగా పనిచేస్తవి.

బొంబాయి సముద్రతీరం దగ్గిర ఒకవింత జరిగింది. ఒక నవనాగరీకుడు ఒకఇంగ్లీషు యువతితో కలిసిషికారువచ్చాడు. మన్మథుడు అతనిమీద ఒక బాణం వేసి ఇంకో బాణం ఆవిడ మీద విసిరినాడు. ఆ నాగరీకుడి ఓవర్‌కోటు తక్షణం కింద రాలింది. యువతి ఆకోటు మీద మూర్ఛ పోయింది!

మన్మథబాణాలు రకరకాల. మనుషులమీద రకరకాల పనులు చేస్తవి. ఆమనిషి శరీరతత్వాన్ని బట్టి వుంటుంది. కొందరికి కూనిరాగాలు పుడతవి. కొందరికి మీసాలపైకి

చేతులు పోతవి. కొందరికి కళ్ళు చలించి దారి కనపడదు. కొందరికి పైత్యవికారం కలుగుతుంది.

మన్మథుడు మొత్తంమీద కొంటె ముండావాడు. పెద్దా చిన్నా తారతమ్యం అతగాడికి లేదు. బీదవాళ్లు భాగ్యవంతులు అనే భేదం కూడా లేదు. కాకపోతే, దేవుడుగుళ్లల్లోకి వెళ్ళే స్త్రీ పురుషులమీద బాణాలు వెయ్యడం ఏమి భావ్యంగావుంది? ఒకచోట కొందరు స్త్రీ పురుషులు ప్రార్థనార్థమై చేరినారు. మన్మథుడు ఆయింట్లో ప్రవేశించి అందరిమీదా పువ్వులు చల్లి లేచి వచ్చినాడు. అప్పుడు ఒక్కొక్కరిలోనూ పుట్టిన చిత్తవృత్తులు ఏమని చెప్పను!

ఒకచోట ఒకానొక విద్యార్థి పుస్తకం విప్పి చదువుకొంటున్నాడు. అతగానిమీద ఒక్కబాణం విసిరినాడు మారుడు. ఆ విద్యార్థి పాపం! బ్రహ్మచారి. తత్క్షణం అతగాడు ఇంటికి పరిగెత్తి పాత వార్తాపత్రికలు వెతికి వీర్యవృద్ధి ఔషధాలు వీ. పి. గా తెప్పించుకొన్నాడు.

ఇంకోచోట ముసిలిభర్త పడుచు పెండ్లామూ ఉండడం చూచి, మన్మథు డాపడుచుమీద లక్షపూలు విసరినాడు. ముసలిభర్తమీద ఒక్క పూవైనా వెయ్యకుండా వెళ్ళిపోయినాడు. పాపం! ఆముసలివాడు పుత్రకాంక్షతో కాశీ రామేశ్వరాలు వెళ్ళివచ్చినాడట.

మన్మథుడి కొంటెతనం ఇలా వుంటుంది. ఇంకా ఎన్నో తమాషాలుచేశాడు. ఈవిషయాలు భూలోకంలో ప్రకటించడానికి ఆయన అనుమతి పుచ్చుకొని తిరిగివచ్చాను.

# వామహస్తోద్ధారకసంఘము

మంగయ్య ఉద్యోగము పోవడముకు అనేకమంది అనేక కారణాలు చెప్పారు. లక్షణమైన గవర్నమెంటు ఉద్యోగం పోవడమంటే సామాన్యము కాదు. ఉద్యోగముతోపాటు అధికారమూ, జీతముకూడా పోయినట్లేగదా. అంతకంటే ముఖ్యమైన సంగతి – నెలజీతాన్ని మించిన డబ్బు దోసిళ్లాది డబ్బుకూడా పోవడము తటస్థించింది. ఆ కారణముచేత మంగయ్య ఉద్యోగము పోవడాన్ని గురించి ఆతని మిత్రులలో కలవరం పుట్టిందంటే ఆశ్చర్యము లేదు.

వారు చెప్పిన కారణాలలో ఒకటి ఏమిటంటే–ఒకనాడు ఒక తెల్లదొర ఆఫీసు తనిఖీచేయడానికి వచ్చాడు. మంగయ్య ఆయన దర్శనం చేసుకొన్నాడు. వారి కిద్దరికీ జరిగిన సంభాషణలో మంగయ్య "మాది గోదావరిజిల్లా" అని చెప్పినట్లూ, దొర "గొడావెరిజిల్లా ఏ ఊరు?" అని అడిగినట్లూ, "గొడావెరి" కాదు "గోదావరి" అని మంగయ్య తప్పు దిద్దినట్లూ, తనతప్పు సవరించుకోకుండా తెల్లదొర "గోడారీ జిల్లా" కాదా అని ముఖం ఎఱ్ఱజేసినట్లూ "గోడారీ" కాదు "గోదావరి" అని మంగయ్య మళ్లీ చెప్పినట్లూ, దానిమీాద దొర కోపం పట్టలేక, శ్వేతప్రభుత్వగౌరవమును నిలవబెట్టే ఊహతో మల్లసంప్రదాయసిద్ధముగా చేతులను సవరించుకున్నట్లూ, తరువాత మంగయ్య శరీరమాద్యంఖలు ధర్మసాధనమ్మను వాక్యమును జ్ఞాపకముచేసికొని, పారిపోయి

నట్లూ, మరునాడు ఉద్యోగము పోయినట్లూ కొందరు చెప్పుచున్నారు.

కాని నిజమైన కారణ మదికాదు. అంటే అది ఒకటే కాదు. మంగయ్యపైని అధికారం చలాయించే అధికారి పరంపరలో ఒక పూర్వాచారపరాయణుడైన నల్లదొర ఉన్నాడు. ఆ నల్లదొర దగ్గరకు మంగయ్య కాగితాలు దస్కతు చేయించుకోవడానికి వెళ్లుతూ ఉండేవాడు, ప్రతిరోజును. ఎన్నిమాట్లు వద్దని చెప్పినా మంగయ్య ఎడమచేతితో కాగితాలు అధికారికి అందించేవాడు. ఆరీతిగా చేయడం తప్పని అధికారి ఎన్నిమాట్లు మందలించినా అలవాటుచొప్పున మళ్లీ మళ్లీ ఎడమచేతితోనే కాగితాలు అందించేవాడు. అధికారికి కోపంవచ్చి, మంగయ్య అవిధేయతతో మెలగుతూ ఉంటాడని పైఉద్యోగస్తులకు వ్రాసినాడు. ఆ అవిధేయత ఒక కారణమూ, గోడావరీ చర్చ వొక కారణమూ – ఈ రెండు కారణాలూ మంగయ్య వుద్యోగమును పోగొట్టినవి.

మంగయ్యఉద్యోగము పోవడముకు ఎడమచెయ్యి కారణమైనదన్న సంగతి ఎడమచేతులలో పొక్కింది. ఎడమచేతులు చేసేకార్యాలన్నీ నీచములని ప్రజలు గ్రహించుచున్నట్లు అవి గ్రహించినవి. కొంతకాలానికి ఎడమచేతులన్నింటికీ ప్రబోధం కలిగింది. వెలుగులో పడ్డవి. కుడిచేతులుచేసే పనులు గౌరవాస్పదములన్న సంగతికూడా అవి గ్రహించినవి. కుడిచేతులమీద ఎడమచేతులు కత్తి దూసినవి. నలుసంత నిప్పంటే ఎన్నిగ్రామాలైనా తగులపడతవి. మహాసంగ్రామానికి కారణము ఎంత సూక్ష్మమైనా అందరూ గ్రహించి

నదే. కుడి ఎడమచేతుల మహాసంగ్రామానికి కూడా మంగయ్య ఉద్యోగం పోవడమనే చిన్నవిషయమే పెద్దకారణ మయిన దనడములో ఆశ్చర్య మేమీ లేదు.

కుడిచేతులను చూస్తే పూర్వం అన్యోన్యంగా ఉండేవి ఇప్పుడు కుడిచేతులమాట తలపెట్టితే తల కంటగించుకొను చున్నవి ఎడమచేతులన్నీని. కుడిచేతులుమాత్రం ఎడమచేతు లను చూచి నవ్వేవి. ఆనవ్వు పరిహాసంక్రింద ఎడమచేతులు భావించి వాటిని మరీ అసహ్యించుకొనేవి. ఈరీతిగా కొన్నాళ్ళు జరిగినది.

ఐకమత్యం బల మనే న్యాయం జ్ఞాపకం చేసుకొని ఎడమ చేతులన్నీ ఆవిషయాన్ని గురించి పెద్దపెద్ద ఉపన్యాసాలు వగైరా చేసి చివరకు ఒక సంఘం స్థాపించుకొనుటకై తీర్మా నము చేసుకొన్నవి. దానికి "వామహస్తోద్ధారకసంఘ" మని పేరు పెట్టినవి. స్వసంఘపురోభివృద్ధికి ముఖ్యముగా పాటు పడుటకై ఈసంఘము నేర్పాటు చేసినట్లు అవి ప్రకటించు కొన్నవి.

సంఘమనడముతోనే దానికి అధ్యక్షుడు వగైరా లాంఛ నాలన్నీ వుండవలెనుగదా. అందుకని చెప్పి "మంగయ్య వామహస్తము" అధ్యక్షుడుగా ఉండుటకై ఎడమచేతుల సభలో తీర్మానమైనది. అన్నిపనులూ ఎడమచేతితోనే చేస్తూన్న ఒక స్థూలకాయుని "స్థూలవామహస్త" ముపాధ్యక్ష పదవి గ్రహించినది. ఎడమచేతితోనే వ్రాతవ్రాసే ఇంకో ఆసామీ వామహస్తము కార్యదర్శిపద మలంకరించినది. ఎడమచేతితో రూపాయలు ఎంచడము, బొత్తులు పెట్టడము

మొదలైన కార్యములు చేసే ఇంకో వామహస్తము కోశాధ్యక్షపదవి స్వీకరించినది. మిగిలిన ఎడమచేతు లన్నీ సభ్యులైనవి. ఈరీతిగా ఒక సంఘమును ఏర్పాటు చేసికొని అవి అనేకతీర్మానములను అనేకసభలలో ప్యాసు చేసికొన్నవి. వాటి వాద మిది.—

"అనాదినుంచీ విద్యాగంధము లేనివాటినిగా జేసి కుడిచేతులు మమ్ము అనాదరణ చేస్తూ వున్నవి. కుడిచేతులూ, మేమూ ఒక్కమోస్తరుగానే పుట్టితిమి. వాటిని కోస్తే పాలూ, మమ్ము కోస్తే రక్తమూ రావడము లేదు. ఒకమోస్తరు రక్తమే, ఒకమోస్తరు ఎముకలే, ఒక మోస్తరు కండలే, ఒక్కటేపొడవు, ఒక్కటే నిర్మాణము మా ఉభయులకూ గలవు. భగవంతుడు మా కన్యాయము చేయలేదు. కుడిచేతులే మా కన్యాయము చేసినవి.

కమ్మని భోజనము లారగించుటకు కుడిచేతులే కావలెను. కష్టతరమైన కార్యములు చేయుటకు కుడిచేతులే కావలెను. బరువులు మోయుటకు, చెట్లు కొట్టుటకు, చిత్తరువులు వ్రాయుటకు, రాళ్ళు మలుచుటకు యంత్రములు నడుపుటకు సమస్తకార్యములకూ కుడిచేతులే కావలెనట. చక్కనివ్రాత వ్రాయుటకూ చదివేటప్పుడు పుస్తకము పట్టుకొనుటకూ కుడిచేతులే కావలెనట. చదువుకూ వ్రాతకూ మమ్ము ఈరీతిగా దూరము చేస్తూఉన్న వీ కుడిచేతులు. విద్యాగంధము లేనివాటినిగా ఈ కుడిచేతులు మమ్ము చేసి తరువాత విద్యాగంధము లేదని ఆక్షేపించుచున్నవి. ఆడవాళ్ళతో షేక్‌హాండు చేసికొనుటకు, పుష్పములతో దేవుని పూజించుటకు, దేవునికి

అభిషేకము చేయుటకు కుడిచేతులు లేనిదే జరుగదు. ఇక మేము ఆడారివాళ్లలాగ ముసుగు వేసుకొని ఇంట్లోకూర్చోవలసిందే.

మేము నాజూకువాళ్ళం కాబట్టి కష్టమైనపనులు చేయ లేమట. మమ్మల్ని నాజూకుగా చేస్తయీ కుడిచేతులే. ఇప్పుడు మమ్మల్ని నాజూకని ఆక్షేపిస్తూవుంట ఈ కుడిచేతులే. మాకు చేసిన ద్రోహం ఇంతా అంతా అని చెప్పడానికి వీలులేదు. ప్రతి నీచకార్యానికీ మమ్మల్ని నియోగించడమూ, ప్రతిఘన కార్యానికీ తాము తగుదు మమ్మాలని పురస్కరించుకొని పని చెయ్యడమూను. ఇంత అన్యాయం ఎక్కడైనా కద్దా ?

చూడండి తెల్లదొరల చేతులు. భోజనానికి కుడి ఎడమ భేదం లేకుండా రెండు చేతులూ ఉపయోగపడుచున్నవి. ఏనీచ కార్యానికైనా ఒక్క ఎడమచేతులే చెయ్యాలనికాని లేక ఒక కుడిచేతులే చెయ్యవలెనని కాని లేకుండా ఏలాగ వీలుగా వుంటే ఆలాగ పనికి వస్తున్నవి. ఇంతెందుకూ? ఒక్క గోకు కోవడము మాట ఆలోచించండి. మా సంఘములో గోకు కోవడముకూడా కుడిచేతులే చేయవలెనట! అందుకే మేము పనికిరామట. తెల్లదొరలలో ఏవైపు దురదుంటే ఆవైపు చెయ్యే గోకుతుంది. ఈ ఆచారము జంతువులలో కూడా వుంది. కోతులలో ముఖ్యముగావున్నది. మమ్మల్ని ఈ కుడి చేతులు కోతులకన్నా, జంతువులకన్నా హీనముగా చూస్తూ వున్నవి. ఈ దాస్యములో ఎంతకాలము మేముండడము ? పామంటిదానికి విరుగుడు ఉంది. ఈ కుడిచేతులకు ఉండక పోతుందా చూద్దాము.

మమ్మల్ని ఈ కుడిచేతులు నీచముగా చూస్తూన్న వనుటకు

యింకో నిదర్శనం. కుడిచేతులు మాకు పుర్రచేతులనే అవమానకరమైన పేరు పెట్టి ఆక్షేపిస్తూ వుండడము అందరూ ఎరిగిన విషయమే. ఎడమచేతులతో వ్రాత మొదలగు పనులు చేసే వారిని పుర్రచేతివాళ్లని, ఆడారి పెద్దమ్మలనీ గేలిచేయుడం సర్వసామాన్యము. ఇకముందు ఇట్టి నీచనామములు మనకుంచరాదని మనము గట్టిగా తీర్మానము చేయవలసివున్నది." ఇంతటినుండీ ఎడమచేతులన్నీ దొరలసాంప్రదాయము ననుసరించుచు ఘనకార్యాలన్నీ తామే చెయ్యడము మొదలుపెట్టినవి. ఆ దేశములో ఎక్కడచూచినా ఎడమచేతితో భోజనముచేసేవారే, వ్రాసేవారే, ఎడమచేతితో టెన్నీసాడేవారే. ఈరీతిగా కొంతకాలం జరిగింది. ఇక కుడిచేతులు ఏమిచేసినవంటే, అవికూడా ఒకసంఘమును ఏర్పాటు చేసుకొని, ఒకటి రెండు పత్రికలు స్థాపించి కార్యక్రమము నడిపించుటకు మారుగా ఎడమచేతుల వాదమును మాత్రము ఖండించి ఊరుకొన్నవి. వామహస్తోద్ధారక సంఘవాద ఖండనము అనుపేరుతో ఈరీతిగా అవి ప్రకటించినవి.

"శ్రుతిస్మృతి పురాణేతిహాసములను తరచితరచి చూడగా ఎక్కడా కుడిచేతులకే ప్రాధాన్యమున్నది కాని ఎడమచేతులకు లేదనీ, ఆచారముకూడా ఆరీతిగానే ఉన్నదనీ, పూర్వాచారములను మీరి సంచరించడము సంఘమున కనర్థదాయకమనీ, కలికాల ప్రభావమువల్ల యిట్టి ఆందోళనలు సంఘములో పుట్టుచున్నవనీ, ఇంతకీ కుడిచేతులు ఎడమచేతులకు అపకారము చేస్తూవున్నవని చెప్పిన హేతువులు హేతువులు కావనీ, ఎడమచేతులకూ కుడిచేతులకూ సమాన

మైన హక్కువున్నదనీ ఇంకా ఏమేమో చెప్పినవి.

చేసే ప్రతిపనికీ కుడి ఎడమ చేతు లుపయోగపడుచున్న వనికూడా అవి చెప్పినవి. భోజనము చేసేటప్పుడు మంచి నీళ్లు త్రాగుటకు ఎడమచేతులే ఉపయోగపడుచున్నవి. చెట్లు కొట్టుటకు కుడిచేతు లెంత అవసరమో ఎడమచేతులుకూడా అంత అవసరమే. చిత్తరవులు వ్రాయుటకు కుంచె కుడి చేతులో ఉంటే రంగులపలక ఎడమచేతిలోనే ఉంటుంది. ఇంక వ్రాతవిషయములో ఎడమచేయి కాగితం పట్టుకోం టేనేగాని కుడిచేయి వ్రాయనేలేదు. చదువు విషయమై ఎడమచేతులు అబద్ధములను వ్రాసినవి. ఎడమచేతుల వాద మంతా అబద్ధములతోనూ, హేత్వాభాసలతోనూ నిండి యున్నది. చదువుకొనేటప్పుడు ఎడమచేతులే పుస్తకమును పట్టుకొనుచున్నవి కాని కుడిచేతులుకావు. కుడిచేతులు పత్ర ములు తిరగవేయుటకు మాత్ర ముపయోగించుచున్నవి. ఇంక ఎడమచేతికి ప్రాముఖ్యమున్న యితర విషయములు ఆలోచిద్దాము. పెండ్లిండ్లలో ఎడమచేతితోనే తాను ప్రేమిం చిన వధువు కుడిహస్తమును పట్టుకొనుచున్నాడు వరుడు. అర్ధనారీశ్వరుడగు శివుడు తన ఎడమభాగము జగజ్జననియగు పార్వతికిపంచియిచ్చాడు. ఇంక దేవతావిగ్రహాల్లో కుడి ఎడమ భేదం లేనేలేదు. ఒక చెయ్యి అభయహస్తం, ఒక చెయ్యి వరదహస్తం, ఇత్యాదిగా ఉంటున్నది. ఎన్నివిధాల చూచినా ఎడమచేతులకు కుడిచేతులకు అనాదరణ చేస్తూన్నట్లులేదు. మాయాప్రపంచాన్ని కల్పించుకొని చేయని అపచారములు కుడిచేతులు తమకు చేస్తూన్నట్లు అవి ప్రకటించుకొను

చున్నవి. దానివల్ల వాటికేమి ఉపయోగమో తెలియదు. తెల్లవాళ్లతో జట్టుకట్టి డబ్బు సంపాదించుకోవాలంటే ఇతర మార్గములు లేవా ? ఇక గోకుకోవడం సంగతి. న్యాయానికి రెండుచేతులూ గోకుకోడానికి పనికివస్తూనే వున్నవి. అందులో ముఖ్యముగా ఎడమవేపు దురదకు కుడిచేతులూ, కుడివేపు దురదకు ఎడమచేతులూ ఉపయోగపడుతూనే ఉన్నవి. కుడి చేతికి దురదపెట్టితే కుడిచేతులే గోకుకోవడము లేదుకదా? అంత గోకుకోవడమనేది ఘనకార్యముక్రింద భావించు కొన్నట్లయితే ఆ ఘనకార్యమును ఎడమచేతులు చెయ్యడానికి ఏమీ ఆక్షేపణలేదు.

వీణ వాయించేటప్పుడు, పిల్లంగ్రోవి ఊదేటప్పుడు, కుడి చేతులెంత ఉపయోగపడుచున్నవో ఎడమచేతులుకూడా అంత ఉపయోగపడుచున్నవనేసంగతి ఎడమచేతులు మరచి పోవడము ఎట్టి చిత్తవృత్తిని తెలియచేస్తున్నదో ప్రాజ్ఞులు గ్రహించకపోరు."

ఈరీతిగా ఖండనమువ్రాస్తే దానికి ప్రతిగా ఎడమచేతు లన్నీ 'వామహస్తోద్ధారక సంఘవాదఖండనముండన' మనే పేరుతో వేరొక వ్యాసమునువ్రాసి ప్రకటించినవి. "వధువును ఎడమవేపు పెట్టుట ఎడమచేతుల గౌరవమునకు కాదనీ, స్త్రీలు సంఘములో నీచస్థానమును ఆక్రమిస్తున్నారు కాబట్టి నీచమైన ఎడమచేతిక్రిందనే వారిని పెట్టడము తటస్థించినదనీ, ఇంక మానవుడు చేయు ప్రతికార్యములోనూ ప్రాముఖ్యత కుడిచేతులకే గాని ఎడమచేతులకు లేదనీ, కుడిచేతుల వాద మంతా స్వవచన వ్యాఘాతాలతో నిండియున్నదనీ, ఎడమ

చేతులన్నీ మేల్కొని కుడిచేతుల దుర్ణయములనూ దురాక్రమములను అరికట్టితేనేగాని సంఘము బాగుపడదనీ, స్వరాజ్యము రాదనీ" వ్రాసుకొన్నవి.

వీరి వాదము ఈరీతిగా ఉంటూండగా పులిమీద పుట్ర అన్నట్లు దేశమందంతటా అనేక సంఘములు బయలు దేరినవి. అందులో ముఖ్యముగా చెప్పతగ్గవి "అంగులీ సంఘములు". స్వశాఖాభివృద్ధినీ, స్వశాఖోత్కృష్టతనూ సూచించుటకై ఈ అంగులీసంఘములు స్థాపింపబడ్డవి.

అంగుష్ఠాంగులీసంఘము తామే పెద్దలమని లోకమునకు చాటుటకు స్థాపింపబడ్డది. అన్నివేళ్ళకంటె అవి పెద్దవి కాబట్టినీ, బొటనవ్రేళ్ళు లేనిదే ఏవస్తువునూ పట్టుకొనుటకు వీలులేదు కాబట్టినీ వాటికే ఆధిక్యతఉన్నదని వాటివాదము.

తర్జన్యాంగులీసంఘము తామే గొప్పవారమని ప్రకటించుకొనుట కేర్పడ్డది. నిర్దేశించుటకు దేనిని చూపవలసివచ్చినా తమ సహాయము లేనిదే జరగదు. కాబట్టి వాటికి ఆధిక్యత కలదు అని వాటివాదము. మధ్యమాంగులీసంఘము పొడుగునుబట్టి ఆధిక్యత కోరుచున్నది. అనామికసంఘము వారు తమకు అనామకులని శత్రువులు పేరుపెట్టి అన్యాయము చేసినారనీ, తామే బంగార మెప్పుడూ ధరించవలసిన ఐశ్వర్యవంతులమనీ కావున తమకే ఆధిక్యముండవలెననీ వాదించుచున్నారు.

కనిష్ఠికాంగులీసంఘమువారు తమ్ము అందరూ కడవారిగా చూచి తమకు తగని పేరుపెట్టినారనీ, తాము అల్పులు కాబట్టి తమకే ఆధిక్యమీయవలసినదనీ, వాదించు

చున్నవి. ఈ అంగుళీసంఘములు తమలో తాము పోరాడు కొనడమేగాక వామహస్తములతోనూ, దక్షిణహస్తముల తోనూ హోరాహోరి పోరాడుటకు రణరంగమున దిగినవి.

స్థితిగతు లీ రీతిగా ఉండగా మిగిలిన తెగలకుకూడా ప్రబోధము కలిగింది. నేత్రోద్ధారక సంఘము, ఉదరోద్ధారక సంఘము, పాదప్రబోధసంఘము, శ్రోత్రోపకారిణీసంఘము, యిత్యాది సంఘము లనేకములు బయలుదేరి తమతమ సంఘములను బాగుచేయు ఉద్దేశ్యముతో పనిచేయుచున్నవి. కాని యీసంఘములు అధ్యక్షాదుల నెన్నుకోవడము యిత్యాది పనులతోను, సాలుసాలుకు కొన్ని తీర్మానములను ప్యాసు చేసుకోవడముతోను, తృప్తి పొందినవి. వామహస్తోద్ధారక సంఘముమాత్రము చాలా పట్టుదలతో పనిచేసినది. కుడి చేతులపనులన్నీ ఎడమచేతులు చేయడము మొదలుపెట్టినవి. కుడిచేతులను నిర్లక్ష్యముచేసి ఏపనీ వాటికి లేకుండా చేస్తే అవి కృశించిపోవుననీ, ఆపైని అన్నిపనులూ తామే చేసుకో వచ్చుననీ ఎడమచేతులు భావించినవి. ఇకముందునుంచి ఎడమ చేతులన్నీ తమ పేర్లను మార్చుకొని కుడిచేతులనే పేళ్లుపెట్టు కోవలెననే తీర్మానములు కూడా సభలలో చర్చకువచ్చినవి. కొన్ని ఎడమచేతులు కుడిచేతు లను పేరుతోనే వ్యవహారింప బడడంకూడా తటస్థించినది.

కుడిచేతులు పని లేకపోవడంవల్ల విశ్రాంతి తీసుకోవడం మొదలు పెట్టినవి.

సంఘములు క్రొత్తగా స్థాపించినకాలములో ఎడమచేతి చిటికినవేలూ, అనామికా కలసి కలం పుచ్చుకొని వ్రాతలు

వ్రాయడం నేర్చుకొన్నవి. కాని ఆకలం క్రమక్రమంగా బొటన వ్రేలు సమీపానికి వస్తూవున్నది. కొంతకాలానికి కుడిచేతి లోనికి కూడా రావచ్చునని ఈమధ్య క్రొత్తగా స్థాపించిన "వరాహమిహిరజ్యోతిషాలయము" వారు ప్రకటించినారు.

ప్రస్తుత పరిస్థితులనుబట్టి భవిష్యత్తు ఏలాగ వుంటుందో నిర్ణయించడము కష్టము కాని ప్రస్తుతము దీని పర్యవసాన మేమిటంటే, మంగయ్యకు మంచి ఉద్యోగము దొరికినది. పూర్వమువలెనే దోసిళ్ళాది డబ్బు గడించుకొంటున్నాడు.

పనిపాటలులేని కవులకూ, వ్యాసకర్తలకూ, నవలాకారులకూ కథకులకూ ఎడమచేతినిండా వ్రాయడానికిపనిదొరికింది.

1926

# కనిపెట్టుకు ఉండడాన్ని గురించి

ఏకార్యముకోసమైనా ఏ వస్తువుకోసమైనా మరి యే యితర విషయముల కోసమైనా కనిపెట్టుకు ఉండడమనేది మానవులకు సహజమని తోస్తుంది. ఏకాలములోనూ ఏ దేశములోనూ ఏదో ఒకదానికోసమై కనిపెట్టుకు ఉండనివాళ్ళు ఉండరు. అట్లా ఉండకపోవడమనేది అస్వాభావికము. మానవ సంఘములో కనిపెట్టుకుఉండడ మనేకార్యము లోపించినట్లయితే ఆ సంఘము నిలిచి ఉండ దనే తోస్తుంది. బీదవాడు హఠాత్తుగా తనకు ధనలాభము కలుగుతుందని జీవితకాలమంతా కనిపెట్టుకు ఉంటాడు. భారతీయులు స్వరాజ్యలాభానికై నిరూపించడానికి వీలులేనంత కాలము కనిపెట్టుకు ఉంటారు. గ్రంథకర్త కీర్తికోసమై చిరకాలము కనిపెట్టుకు ఉంటాడు. సర్వసంగపరిత్యాగము చేసిన సన్యాసి సైతము ముక్తికాంతకోసము ఎదురుతెన్నులు చూస్తూ కనిపెట్టుకు ఉంటున్నాడు. ఇక ఇతరులసంగతి చెప్పడమెందుకు?

కనిపెట్టుకు ఉండడమనే ఈ కార్యము ఒక్క మానవులలోనే కాకుండా మృగములలోనూ, వృక్షములలోనూ కూడా కానవస్తున్నది. చెట్లు, పూయడానికిగాని, కాయడానికిగాని సరియైన ఋతువువచ్చేవరకూ కనిపెట్టుకొని ఉంటవి. ఈ విషయములోనేకాకుండా యితర విషయములలోకూడా జంతువులు కనిపెట్టుకొని ఉండడము మనము చూస్తున్నాము. మోకాలిలోతు నీళ్లల్లో నిలబడి తననీడ తాను చూచు

కొంటూ కదలకుండా మెదలకుండా ఏకాగ్రచిత్తముతో—కేసులకోసం కనిపెట్టుకొనిఉండే కొత్తప్లీడరులాగ—ఏదైనా ఒకచేప సందర్భపడుతుందా దానిని నోట్లో వేసుకొందామా అని తపస్సుచేసే కొంగ, కనిపెట్టుకొని ఉండడ మనేకార్యములో ఆరి తేరి ఉన్నది. ఏకాగ్రచిత్తము, నిశ్చలమైన మనస్సు, ఆశాపూరితమైన హృదయము, శమము, దమము మొదలైన సుగుణము లాసమయమున ఆ కొంగలో మూర్తీభవించి ఉంటవనే సంగతి అందరికీ తెలిసినదే. కనిపెట్టుకు ఉండడములో కొంగనుమించినవా రెవరూ సృష్టిలో లేరని చెప్పవచ్చును. ఈజంతువునుబట్టే కనిపెట్టుకొని ఉండడమనేది కళ అని మనము గ్రహించవచ్చును. అరవైనాలుగు కళల లోనూ మన పూర్వులు దీన్ని ఒకదాన్నిగా చెప్పకపోవడానికి కారణము ఊహించడము కష్టము. ఆకాలములో జనులకు కనిపెట్టుకు ఉండడము అవసరములేకుండా ఉండేదేమో ? ఈసంగతి నిర్ధారణచేసి చెప్పడానికి సరియైన శాసనాది చారిత్రక నిదర్శనము లేమీ లేనట్లు తోస్తుంది. కాని ఊహానుబట్టిచూస్తే వారు కనిపెట్టుకుఉండేవారనే తోస్తుంది. ఈ కాలములోకంటె ఆకాలములో తద్దినాలు ఎక్కువ భక్తిశ్రద్ధలతో పెట్టేవా రనేవిషయము నిర్వివాదము. అటువంటి సంగతిలో నాటికీ నేటికీ మానవ స్వభావములో మార్పులు జాస్తీగాలేవు. కాబట్టి వారు తద్దినపు బ్రాహ్మలకోసము కనిపెట్టుకుఉండలేదని ఎట్లా చెప్పగలము? పెళ్లిళ్లలో భోజనాల సమయమున వీరు వస్తారు వారు వస్తారని పగలూ రాత్రీ రెండుజాములు దాటేవరకూ కనిపెట్టుకు ఉండలేదని ఎట్లా

చెప్పగలము? జాగ్రత్తగా ఆలోచించిచూస్తే చాలావిషయా లలో వారు కనిపెట్టుకు ఉండేవారనే స్పష్టపడుతుంది. కాని ఈ కార్యమును వారు చతుష్షష్టికళలలో ఎందుకు చేర్చ లేదో? ఒకవేళ ఈకార్యము ఆకాలములో లేదేమో! ఈకాలములో బ్రిటిషు దొరతనమువల్ల మనకు కలిగిన మేళ్లల్లో ఇదికూడా ఒక మేలేమో అని మొదట అభిప్రాయపడేవారు. పై సంగ తులను చూచి తమ అభిప్రాయమును మార్చుకోవలసి ఉంటుంది.

మన పూర్వులు దీనిని కళగా గ్రహించకపోవడానికి కార ణము ఒకటి తోస్తుంది. ఈ కాలములో కనిపెట్టుకు ఉండడ మంటే దుర్బల శరీరులమైన మనకు చీదరగాఉంది. దేనికోస మైనా కనిపెట్టుకొనిఉండే ఇతరులను మనము చూడడము తటస్థించినప్పుడు వారిలో ఉండేసుగుణములు మనమనస్సుకు తట్టి ఆ కార్యమును మనము కళగా భావించడము తటస్థిస్తు న్నది. పూర్వముకంటె ఇప్పుడు, — రైలుస్టేషనులదగ్గిరా, పోస్టాఫీసులదగ్గిరా, అధికారుల యిళ్లదగ్గిరా యింకా యితర ప్రదేశములలోనూ కనిపెట్టుకు ఉండడము సంభవిస్తుండడ ముచేత దాని బాగోగులు మనకు బాగా అనుభవములోకి వస్తూఉన్నవి. పూర్వుల అనుభవములు విరివిగా లేకపోవ డముచేత వారీ కార్యమును అంతగా లెక్కచేసేవారుకారు. కాబట్టి వారు దీనిని కళగా భావించకపోయి ఉండవచ్చు. కనిపెట్టుకు ఉండవలసి వచ్చిందనే జ్ఞానము వారికి లేకపోవడ మున్నూ, ఎప్పటి కప్పుడు కనిపెట్టుకు ఉండవలసివచ్చిందే అనే జ్ఞానమూ, తొట్రుబాటూ, దానినిగురించి చింతనా

మనకు ఉండడమువల్లనూ వారికీ మనకూ ఈ కార్యము నిష యమై అభిప్రాయ భేదము కలిగినదని తోస్తుంది. కనిపెట్టుకు ఉండడమనే జ్ఞానము మనకు కలగడమునకు కారణము నేటి నాగరికత అని చెప్పితే సత్యదూరము కాదు.

కనిపెట్టుకు ఉండడమనే కార్యము సరియైన మార్గమును బట్టిపోతే కళగా మనము భావించవచ్చును గాని దానిని తప్పుత్రోవల వెంబడితిప్పితే అది కళ అనిపించుకోదు. కని పెట్టుకు ఉండడానికి కారణమూ, దానివల్ల కలిగే లాభమూ, ఆకార్యమును నిర్వహించడానికి చూపే చాకచక్యమూ మున్నగు లక్షణాలు పట్టినప్పుడే అది ప్రశంస చేయదగిన దవుతుంది. చేపను పట్టడానికి కొంగా, ఎలకను పట్టడానికి పిల్లీ, గోడకుకొట్టిన లాంతరుదగ్గర పురుగులను పట్టడానికి బల్లీ, ఈగలను పట్టుకోవడమునకు గూడు అల్లుకొని కూర్చునే సాలె పురుగూ, సృష్టి విచిత్రములను తెలుసుకోవడమునకు శాస్త్ర జ్ఞుడూ, క్లయింట్లను ఆకర్షించడానికి ప్లీడరూ, కనిపెట్టుకు ఉండడమనే కళలో చాకచక్యము చూపుతూవుంటారు.

రైలు ఫలానా యిన్నిగంటలకు వస్తుందని తెలిసిఉండిన్నీ అంతకుముందుగావెళ్ళి రెండుమూడు గంటలకాలము పడి గాపులు పడి కనిపెట్టుకొని ఉండేవాళ్లనుచూస్తే ఎవరికి జాలి పుట్టదు? ఇట్టివారు కనిపెట్టుకొని ఉండడములో అందము లేదు. సాలెపురుగు కనిపెట్టుకొని ఉండడమనే కార్యమును ఇట్టివారి కార్యముతో పోల్చి చూచినట్లయితే వీరుచేసేపని కళ అనిపించుకోదని తేలుతుంది.

కాని ఎవరైనా గొప్పవారు కావలెనని ఆశించుచున్న

ట్లయితే వారు ముఖ్యముగా కనిపెట్టుకు ఉండడ మనేవిద్యను నేర్చుకోవలసిఉన్నది. గొప్పతనము చెందడానికి కావలసిన లక్షణాలు చాలా ఉన్నవని గొప్పవారు చెప్పుకోవడముకద్దు. సత్యసంధత, ధైర్యము, వాక్పాటవము, భూతదయ, భావిదృష్టి, పట్టుదల, కృషి యిత్యాదిగుణములు చాలా ఉన్నవి. ప్రతిగొప్పవాడిలోనూ ఈ గుణములన్నీ ఉన్న వన డానికి సందేహము లేదు. కాని గొప్పతనమనే సౌధము నెక్క డానికి కనిపెట్టుకు ఉండడము ఒకమెట్టు. ఈమెట్టుమీదనుంచి ఎక్కి సౌధము చేరుకున్న తరువాత ఇతరులను తమకోసము కనిపెట్టుకుఉండేటట్లు చేయడము గొప్పతనముయొక్క ప్రధాన లక్షణము అవుతూ ఉన్నది. గొప్పతనానికి అవసరమైన ముఖ్యలక్షణములలో ఇదికూడా ఒకటిగా పరిగణించవచ్చును. ఇరవైరూపాయల గుమాస్తాగా పనిచేస్తూన్న కాలములో కనిపెట్టుకు ఉండడమనే విద్య నేర్చుకొన్న ఒకమానవుడు డిప్టీకలెక్టరీపదవి పొందినట్లయితే ఇతరులను ఏరీతిగా తన కోసము కనిపెట్టుకు ఉండేటట్లు చేస్తాడో అందరికీ తెలిసిన విషయమే. ఈవిషయములో ముఖ్యముగా తెల్లదొరలు అగ్రేసరులు. ఇతరులు వారికోసము కనిపెట్టుకు ఉండజాలరు. తెల్లదొరలను అనుకరించే నల్లదొరలసంగతి యింతే. ఒక ఊళ్లో ఒక చిన్న నల్లదొర ఉండేవాడు. ఈయనకు చిన్న ఉద్యోగము. ఆ చిన్న ఉద్యోగస్తునికింద మరీ చిన్న నౌకరులు మేష్టరు లుండేవారు. ఈ చిన్న నల్లదొర పరువు మర్యాదల కోసము పాట్లుపడేజాతి మనుష్యుడు. పరువు మర్యాద లంటే వంశమునకుగాని, తనజాతికిగాని, దేశమునకుగాని సంబం

థించినవి కావు. తన ఉద్యోగమునకు సంబంధించినంత వరకే పరువుమర్యాదలు. తన ఉద్యోగపదవికి అగౌరవము వస్తే సహింపజాలడు ఆయన. ఒకనాడు ఒక చిన్న బడిపంతులు అర్జీపట్టుకొని ఈ చిన్న నల్లదొరదగ్గరకు వచ్చాడు. ఈ చిన్న నల్లదొర తలపాగాతో, ముక్కద్దములతో బల్ల వెనక కుర్చీలో కూచుని ముందున్న కాగితాలు దర్జాగా తిలకిస్తూన్న సమయములో బడిపంతులు అర్జీ తెచ్చి నమస్కారము చేశాడు. ఉద్యోగగౌరవము మూర్తీభవించినట్లు కూర్చున్న ఆ నల్ల దొరకోసము ఉద్దేశింపబడిన ఆ నమస్కారము ముందుబల్లకు తగిలి ఉండవచ్చును. నమస్కరించిన పిమ్మట నడుము వంచి చేతులు చాచి అర్జీని చేతులలోనుంచి అందిచ్చేటట్టు పట్టుకొని వడుకుతున్నాడా చదువులయ్య. ఎవరినీ గమనించకుండా నల్లదొర తదేకదృష్టితో కాగితములు చూస్తూన్నాడు. ఐదు నిమిషములు గడచినవి. పది నిమిషములు గడచినవి. పావుగంట గడచినది. బడిపంతులు చేతిలో కాగితము గడగడ వణకుతున్నది. చివరకు సులోచనములు పైకి లేచినవి. నల్లదొర బడిపంతులకేసిచూచి, అర్జీకేసిచూచి వెనక్కుతిరిగి "ఇప్పుడు కాదు; తర్వాత తర్వాత" అని ఉత్తరువు చేశాడు. బడిపంతులు బుర్రవంచుకు వెళ్లిపోయాడు. కనిపెట్టుకు ఉండడమంటే అది; కనిపెట్టుకు ఉండేటట్లు చేయడమంటే అది.

కనిపెట్టుకు ఉండడాలు అనేకరకములు. గవర్నమెంటు ఉద్యోగములో ప్రమోషన్ అవుతుందని కనిపెట్టుకుఉండడము, ఉరిశిక్ష పడినవాడు ఉరితాటికోసము కనిపెట్టుకు ఉండడము, ప్రకటించడానికి ఒక పత్రికకు వ్యాసమో,

పద్యమో పంపించి అది ఎప్పుడు ప్రకటిస్తారు దైవమా అని కనిపెట్టుకు ఉండడము, స్వరాజ్యముకోసము కనిపెట్టుకుఉండడము, ఎప్పటికైనా జాతకము బాగుపడదా అని కనిపెట్టుకు ఉండడము, ఇవి కొన్నిరకములు.

మానవులలో రెండు తెగలు:కనిపెట్టుకు ఉండగలిగినవారు, కనిపెట్టుకు ఉండలేనివారు. మొదటి తెగవా రుత్తములు. వారిని సాధారణముగా మనము పెద్ద ఉద్యోగస్తుల యిళ్లముందర చూస్తూఉంటాము. రెండవతెగ మనుష్యులు మధ్యములు. వారికి ఓర్పు మున్నగు మంచిగుణములులేవు. ఇటువంటివారు లోకములో నెగ్గలేరు. ఇక కొందఱు మనుష్యులు దొరల యిళ్లదగ్గిర కనిపెట్టుకుఉండడాని కిష్టపడతారుగాని తమతో తుల్యులైన వారికోసము మాత్రము కనిపెట్టుకొని ఉండజాలరు.

మొత్తముమీద కనిపెట్టుకు ఉండడమనేది మంచి కార్యమే. దానివల్ల వినయమూ, ఓర్పూ, ఆశాపూరిత హృదయమూ, మానవస్వభావమును గ్రహించడానికి తగిన అవకాశమూ, దివాస్వప్నముల కవకాశమూ, కలుగుతున్నవి.

# శాస్త్రపాఠము

ఒక సంవత్సరము చెన్నపట్టణములో కాపురము చేసి క్రొత్త బోధనా పద్ధతులు నేర్చుకొన్నాను. అవి శల్యాగతము లగుటవల్ల మన పూర్వుల విద్యాభ్యాస క్రమముపై నాకు గౌరవము లేకపోయింది. ఈ నేర్చిన పద్ధతులన్నీ కొంతమట్టుకు క్లాసులలో ప్రయోగం చేయ మొదలు పెట్టాను. కాని దాని విలువ విద్యార్థులు గ్రహించకపోవుట చేత "ఓగు నోగు మెచ్చు" అనే వేమన్నపద్యం జ్ఞాపకం చేసుకొని మాట్లాడక ఊరుకొన్నాను. ఈ పద్ధతులను ఉపయోగించుటకు సమయము రాకపోతుందా అని ధైర్యము.

ధైర్యము ఎందుచేతనూ అంటే నాకు మూడేళ్ల ఈడు గల కొడుకు. వాడికి చదువు నేర్చుకొనుటకు తగిన వయస్సు-అనగా నాలుగు సంవత్సరములు వచ్చినట్లయితే సక్రమముగా పుస్తకాలలో వున్న రీతిగా బోధనపద్ధతులను ప్రయోగించి తద్ద్వారా ఉత్తమవిద్య కరపించవలెనని నే నభ్యసించిన మానసిక శాస్త్రమును పురిస్కరించుకొని పని జరపినట్లయితే నా కొడుకు ప్రతిభాశాలి అవుతాడని నా ధైర్యం.

విద్యాభ్యాసమును ఓనమాలతో మొదలు పెట్టరాదు. వస్తువుల యథార్థ గుణ గ్రహణము జ్ఞానేంద్రియములు చేయుచున్నవో లేదో తెలిసికొనవలెను. అట్లు చేయని యెడల వాని నభ్యాసపరిచి సరిగా గుణములు గ్రహించు నట్లు చేయవలెను. అనగా బాలుడు తొలుదొల్త ఓనమాలను

దిద్దుకొనుట మాని వేర్వేరు రుచుల దెలిసికొనుట, వేర్వేరు రంగుల, దెలిసికొనుట, వేర్వేరు వాసనల దెలిసికొనుట, వేర్వేరు శబ్దముల గుర్తుబట్టుట, పదార్థముల వేర్వేరు స్థితులను తాకి తెల్సిసికొనుట నేర్చుకొనవలెను. అట్లు నేర్చుకొనుటవలన వారి జ్ఞానేంద్రియములు వస్తువుల యథార్థ గుణములను గ్రహింప గలిగి వుంటవి.

ఈ వుద్దేశముతో నేను ఒకనాడు నిమ్మకాయ, బెల్లం ముక్క, వక్కపొడి, పచ్చిమిరపకాయ ఇత్యాదులు రుచులు నేర్చుటకును, గన్నేరుపువ్వు, పచ్చగడ్డి, మల్లెపువ్వు, దేవకాంచనము, మసిబొగ్గు, పసువు కొమ్ము ఇత్యాదులు రంగులు నేర్చుటకున్ను సంతరించుకొని మావాడిని దగ్గిర కూచో బెట్టుకున్నాను. మా అమ్మ దూరంగా కూచుని, పత్తి బుట్ట దగ్గిర పెట్టుకొని వత్తులు చేసుకొంటున్నది.

నేను చదువు చెప్పడం మొదలు పెట్టేను. ఏకాగ్రచిత్తముతో విషయగ్రహణము చేయగలిగి ఉండుటకు మావాడిని బాసినపట్టు వేసుకొని కూచోమన్నాను. విద్యాభ్యసనసమయమునందు బాలురస్వేచ్ఛ నరికట్టుట మంచి పద్ధతి కాదు. అందుచేత బాసినపట్టు వేసుకొమ్మని చెప్పినా మావాడికి స్వేచ్ఛ నేను తగ్గించలేదు. రవంత సేపు బాసినపట్టు, రవంత సేపు పండుకోవడం, రవంత సేపు మొగ్గలు వేయడం, రవంత సేపు గంతులు వేయడం మొదలయిన పనులన్నీ చదువు నేర్చుకొనేటప్పుడు మావాడు చేస్తునే ఉన్నాడు. మొట్టమొదట గన్నేరుపువ్వు పుచ్చుకొని "నాన్నా, ఇదేమి?" టన్నాను.

"ఇది పువ్వు."
"దీని పే రేమిటి ?"
"దీని పేరేమిటి నాన్నా ?"
"నువ్వు చెప్పు."
"నువ్వు చెప్పవు నాన్నా ?"
"నేను చెప్ప కూడదు! నువ్వు చెప్పుకోవాలి."
"నేను చెప్పవచ్చునా నాన్నా ?"
"ఆ. చెప్పు."
"నేను చెప్పను. నువ్వు చెప్పుకో నాన్నా!"
"నాకూ తెలియదు. నువ్వు చెప్పు."
"నాకూ తెలియదు. నువ్వు చెప్పు."
"అయితే చెప్పుతాను విను. ఇది గన్నేరుపువ్వు."
"ఇది గన్నేరుపువ్వా నాన్నా ?"
"అవును."
"నువ్వెక్కడ తెచ్చావు నాన్నా దీనిని ?"
"దేవాలయం తోటలో నుంచి."
"నేనూ వెళ్లి తీసుకు రానా నాన్నా ?"
"వద్దు. నువ్వు అట్టే మాట్లాడకు. నేను చెప్పేది విను."
"మరి, గన్నేరుపువ్వు ఎందుకు తెచ్చావు నాన్నా ?"
"చెప్పుతాను గాని – ఇది ఎలా వుంది ?"
"మరి, నాకా పువ్వు ఇవ్వవు నానా ?"
"ఇంద, పుచ్చుకో. పుచ్చుకొని దానిరంగు ఏమిటో చెప్పుకో."
"దీని రంగా నాన్నా ?"

"అవును, అదుగో, దాని రేకులు లాగివేయకు, అలాగ నలిపి వేయకురా!"

"నలపనుగాని, నాకు ఇంకొక పువ్వు ఇవ్వవూ?"

"ఇది అయిన తరవాత ఇస్తాను. నే నడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పు."

"ఏమి చెప్పను నాన్నా?"

"దీని రంగు."

"దీని రంగా?"

"అవును."

"నువ్వు చెప్పవు? నాన్నా!"

"ఈ మాటు నేను చెప్పను. నువ్వు చెప్పుకోవాలి."

"ఏమి చెప్పుకోవాలి నాన్నా?"

"దీని రంగు."

"అంటే ఏమిటి నాన్నా?"

"ఇది తెలుపా, పసుపా, ఎరుపా, నలుపా చెప్పు."

"ఇదా? నాన్నా?"

"అవును."

"ఇది తెల్లగా ఉంది."

"ఇది తెల్లగా ఉందా? పోనీ ఈ మల్లెపువ్వు ఎ ఉంది."

"ఇదా నాన్నా? ఇది ఎంచక్కుండి."

"దీని రంగు?"

"తెల్లగా ఉంది."

"ఈ రెండూ తెల్లగానె ఉన్నాయా?"

"తెల్లగా లేవు నాన్నా ?"

"లేవు, గన్నేరుపువ్వు ఎరుపు, మల్లెపువ్వు తెలుపు, మళ్లీ చెప్పు."

"ఇది ఎరుపు, ఇది తెలుపు."

"సరే, ఈ మసిబొగ్గు ఎలా వుంది ?"

"ఇదా ? యిది ఎఱ్ఱగా వుంది."

"ఇది ఎఱ్ఱగా వుందఱ్ఱా ?"

"మరి యెలా వుంది నాన్నా ?"

"నల్లగా వుంది."

"మసిబొగ్గు నల్లగా వుంది."

"సరే, ఈ పచ్చగడ్డి ?"

"ఇదీ ? ఇది నల్లగా వుంది."

"ఇది మసిబొగ్గులాగ వుందిరా ?"

"ఎలా వుంది మరి ?"

"ఇది ఆకుపచ్చగా వుంది."

"ఆకుపచ్చగా వుంది ?"

"సరే యీమాటు మళ్లీ చెప్పు. గన్నేరుపువ్వు ఎలా వుంది."

"ఎఱ్ఱగా వుంది."

"మసిబొగ్గు ?"

"నల్లగా వుంది."

"మల్లెపువ్వు ?"

"ఆకుపచ్చగా వుంది."

"ఆకుపచ్చ కాదు; తెలుపు ?"

"ఆకుపచ్చ గాదు; తెలుపు ?"

"పచ్చగడ్డి ?"

'పచ్చగడ్డి ఆకుపచ్చ కాదు –"

"ఆకుపచ్చే.

"ఆకుపచ్చగా వుంది."

"సరే, ఇది జ్ఞాపకం ఉంచుకొంటావు కదూ."

"అలాగే నాన్నా, నాకా బెల్లం ముక్క పెట్టవు ?"

"ఇంద. మరి అదంతా తినెయ్యకు."

ఇంతట్లో ఇంట్లోంచి నా భార్య కేక వేసింది "ఔనుగాని" కచేరీకి వేళ అయినట్లు వుంది. మీ అమ్మ వుండలేదు."

"కుర్రాడితో ఆడుకొనేబదులు స్నానం చెయ్యకూడదు?"

లేస్తూ ఉండగా మా అమ్మ వత్తులు పత్తిబుట్టలో పెట్టి మూతవేస్తూ అన్నదిగదా "అబ్బాయి! ఎప్పటి కప్పుడు వాడితో ఆడుతావు. వాడికి రెండుముక్కలు చెప్పుతూ వుంటేగాని వాడికి చదువు వచ్చేవిధం ఎలాగ?

మొత్తంమీద ఆడవాళ్లు—ఏమనడానికీ నోరురాదు.

# మా యింట్లో పిల్లి

పిల్లులకీయితర జంతువులకీ తెలివి తేటలు లేవనీ, ప్రపంచంలో వున్న తెలివి తేటలన్నీ మనిషిలోనే మూర్తీభవించినవనీ, చెప్పేవాళ్ళకీ నాకూ స్నేహం లేదు. అలాగని చెప్పి అన్ని జంతువులతోటీ నేను నేస్తంకట్టను. ఆమాట కొస్తే కుక్కకీ నాకూ పరమ శత్రుత్వము. కారణము – కుక్కకూ ఇంగ్లీషు వాడికీ పరమస్నేహం కాబట్టి.

పిల్లిమీద నాకు ఒకమోస్తరు కోపం. అయినప్పటికీ దానిమీద అభిమానం లేక పోలేదు. ఏమంటారా–మా మేనత్త–ఆవిడకు నేనంటే చాలా మమకారం. నేను వాళ్ళింటి కెప్పుడు వెళ్ళినా చాలా ఆదరించి, వచ్చావా నాయనా అని, నాకు జంతికలుచేసి పెట్టుతుంది కాబట్టి–ఒకపిల్లిని పెంచు తుంది. అన్నట్టు చెప్పడం మరిచిపోయాను; మా మేనత్త వితంతువు. వితంతువులకీ పిల్లులకీ ఒకమోస్తరు సంబంధం వుండివుండాలి; ఈ జన్మంలో కాకపోయినా పూర్వజన్మంలో నైనాను. లేకపోతే, వారిద్దరికీ యింతటి మక్కువ ఎందు చేతనో నాకు బోధపడడంలేదు. నా అదృష్టమేమోకాని–దురదృష్టం అనండి మీయిష్టం–నేను ఎందరో వితంతువులను చూచాను. ప్రతీ వితంతువూ ఒకపిల్లిని–తెల్లపిల్లీ, గండుపిల్లీ, నల్లపిల్లీ, పొడలపిల్లీ, పిల్లికళ్ళపిల్లీ, ఇంగ్లీషు పడుచుల్లాగ నీలి కళ్ళపిల్లీ–ఏదో ఒక పిల్లిని పెంచడమే చూచాను. వెనకటికి ఎవరో ఒక యిల్లాలు వుండేదిట, మా మేనత్త చెప్పేది:

ఆవిడకు పెంచుతూన్న పిల్లంటే ప్రాణం. వారానికొకమాటు దానికి నూనెరాసి కుంకుడుకాయ పులుసుతో రుద్ది తల నీళ్లు పోసేదిట! చెవులో నూనెకూడా పోసేదట! మధ్యాహ్నం వంట చేసుకొని, తా నింత తిని పిల్లి కింత పెట్టి, వీధి అరుగు మీద కూచుని, చేటలో పెసరపప్పు ఎండలో బెట్టి, పిల్లిని ఒళ్లో కూచోబెట్టుకొని, కాకుల్ని కొట్టుతూ, గుళివి తెడ్డుతో గులివి తీసేదిట! ఎంత మమకారమో! అయితే స్వేచ్ఛ కోరి, యిష్టానుసారం తిరిగి, మనుష్యులను లక్ష్యపెట్టని, పిల్లి యిన్ని విధాలుగా యిబ్బంది పెట్టుతూఉంటే ఎలాగ పూరుకుందో అనుకుంటాను. కాని యీపిల్లి సామాన్యపు పిల్లి కాకపో వచ్చును. పూర్వజన్మంలో, బహుశా యీ వితంతువుకు దగ్గిరబంధు వని మాత్రము నా నిశ్చితాభిప్రాయం. ఎలక లని పట్టి చంపడానికని పిల్లిని పెంచుతారుగాని, వాస్తవానికి పిల్లి ఎలకలని పట్టదని నా నమ్మకం. తినడానికి తగినంత వున్నట్లయితే, ఏపిల్లీ ఏ ఎలకజోలికీ వెళ్ళదని నేను నమ్మ తాను. యదార్థానికి పిల్లులున్నచోటే ఎలకలు ఎక్కువగా వుంటాయి. కడుపునిండిన పిల్లిదగ్గర ఎలకలు తైతక్క లాడతాయి.

ఈసంగతి ఒక దేశపు గవర్నమెంటువారు బాగా గ్రహించి నట్లు తోస్తుంది. ఆ మధ్య ఖర్చు తగ్గించడానికి ప్రయత్నాలు చేస్తూ తక్కువ ఉద్యోగస్థుల జీతాలు, స్కూలు మేస్టర్ల జీతాలూ తగ్గించారు. ఆరీతిగానే పిల్లుల కిచ్చేభత్యంకూడా తగ్గించినట్లు తెలియవస్తోంది. ఏదో వూళ్లో ఏదో ఆఫీసులో ఎలకలు విస్తారముగా వున్నాయట. ఆ ఎలకలబాధ పడలేక,

ఆ ఆఫీసులో ఒకపిల్లికి ఉద్యోగం యిచ్చారట! ఆపిల్లి యథా విధిగా తన విహితధర్మము నిర్వహిస్తూ, దొరతనము వారు వేతనరూపకముగా యిచ్చే భృత్యము ననుభవిస్తూ, లోకముతో సంతృప్తి జెంది వుండేదట. ఆ మధ్య జీతములు తగ్గిస్తూ పిల్లి భృత్యమును ఆ దొరతనము తీసివేసినారు. తీసివేస్తూ అన్నారట, "ఎలకలను తినే పిల్లికి వేరే ఆహారంకోసం భృత్య మెందుకు? భృత్యంతో ఆహారము కొనివేస్తే అది మళ్లీ ఎలకలను ముట్టదు కాబట్టి, ఎలకలను ముట్టనిపిల్లి ఆఫీసు కెందుకు?" అని. ఆమాట నిజము. ఇందులో ఇంకో విశేషం వుంది. జీతములు తగ్గుటచే, బాధపడుచున్న వాళ్ళము, స్కూలు మేష్టర్లము, మే మొక్కరిమే అని వాళ్ళు విలపిస్తూంటే, వాళ్ళకు సహవాసంగా పిల్లికూడా దొరికింది. ఈ మార్జాల సహవాసమును స్కూలుమేష్టర్లకు కల్పించినందుకు, ఆ తెగవారందరూ ఆ గవర్నమెంటు బుద్ధివైభవమునకు సంతోషిస్తూ, వారియెడల కృతజ్ఞత కలిగి వుంటారని నేను దృఢముగా నమ్ముచున్నాను. ఇట్లా వున్నట్లయితే వారికి కుక్క మున్నగు యితరజంతువుల సహవాసముకూడ అచిరకాలములోనే సమకూరగలదని నమ్ముచున్నాను. మా మేనత్తమీద నాకు మక్కువ. ఆకారణంచేత ఆవిడపిల్లిమీద నాకు అభిమానం. ఎంత అభిమానం వున్నా రాత్రి భోంచేసి, పరుపు వేసుకొని పండుకొని, మంచి నవల చదువుకుంటూన్నప్పుడు, సద్దులేకుండా వచ్చి భ్రష్టుపిల్లి—వేధవపిల్లి — పక్కను పడుకొని, గుర్రుమంటూంటే, ఎవళ్ళకి ఒళ్ళు మండుకుపోదు—వితంతువులకు తప్ప. ఆసంగతి అలా వుండగా శుబ్భరంగా

అరటిఆకు వేసుకొని, యిష్టమైన పదార్థాలు ఆప్యాయంగా తినే సమయాన్ని, ఎదూరుగుండా కూచుని ఈపిల్లి రెప్ప వెయ్యకుండా చూస్తూ, నీవు తినే అన్నంముద్దలు లెక్క పెట్టుతూంటే, ఒళ్లు మండుకుపోతుందా పోదా? ఏమంటారా,- మనం హిందువులము కాబట్టి, దృష్టిదోషం అంటే నమ్మకం యింకా పోలేదు. పచ్చకళ్ళతో యీ పిల్లి యీ విధంగా చూస్తూంటే, దృష్టిదోషం తగలదని ఎలాగ అనుకోగలము? అన్నం అరగక అజీర్ణరోగము రాదని ఎలాగ అనుకోగలము? ఆ సమయంలో, పక్కనున్న నీళ్లచెంబు తీసుకొని మొహాం బద్దలగొట్టవలె నని బుద్ధి పుట్టకపోదు. నీళ్ల చెంబంటే జ్ఞాపకం వచ్చింది. పిల్లి అంటే నాకు కోపానికి ఒక కారణం వుంది. తల్లితండ్రుల గుణాలు కొన్ని గాకపోయినా కొన్నైనా పిల్లలకు వస్తాయని చెప్పుతారు. పిల్లిని చూచి అసహ్యించుకోవడం అనేగుణం నాకు మా అమ్మనుంచి వచ్చింది. మా అమ్మ చాలా ఆచారమంతురాలు. కడిగిందే కడుగుతూ, తోమిందే తోముతూ, స్నానాలమీాద స్నానాలుచేస్తూ మాకు సాధారణంగా మూడోజాామునగాని భోజనం పెట్టేది కాదు. ఆవిడకూ పిల్లికీ బద్ధవైరం. ఆవిడున్నచోట పిల్లి వుండదు. పిల్లి వున్నచోట ఆవిడ—పిల్లిని వుండనియ్యదు. ఎందుచేతనంటే?

పిల్లికి ఆచారం తెలియదు. ఎప్పుడేనా స్నానం చేస్తుందో లేదో మనకు తెలియదు. మనం ఎరిగినంతమట్టుకు చూస్తూన్నంతమట్టుకు దానికి స్నానంలేదు. తరువాత అది అన్నం తిని మూతి కడుక్కోదు. మా అమ్మకు దానిమీద కోపానికి

యిదే ప్రధానకారణం. వి స్తళ్ళల్లో మిగిలిన అన్నం మెతు కులు రెండు తిని యీ పిల్లి యింట్లోవున్న వస్తువులన్నీ ముట్టుకుంటుంది. మా అమ్మగానీ దానిని ఆ సందర్భంలో చూచినట్లయితే, దాని నుద్దేశించి ఒక చిన్న ఉపన్యాసం చేసేది,- "ఎక్కడ దాపరించిందమ్మా యీ వెధవపిల్లి? నూరుకళ్లతో చూస్తున్నా, ఎక్కడా వుండేమార్గం అగు పడదు. ఎక్కడకని, నేను చూడగలను? పోనీ, దాన్ని పట్టు కొని సంచీలో పెట్టి ఎక్కడేనా వదలిపెట్టిరమ్మంటే చెవిని బెట్టరు. (యిది మొగాళ్లను ఉద్దేశించి). ఇది పూర్వజన్మంలో, నాకు సవితికాబోలు. లేకపోతే యిలా వేపుకు తింటుందా? ఎంతమట్టుకని చూస్తూ వూరుకోను? మెతుకులన్నీ పొట్ట విచ్చేలాగ తిని ఆ అంటమూతితో యింట్లో కూరలబుట్ట ముట్టుకుంది. దాన్నంతా యిప్పుడు కడుక్కు చావాలి. ఆ అంటమూతితో ఊరగాయలకుండ ముట్టుకుంటే ఇం కేమేనా వుందా?" ఇత్యాదిగా గబగబ ఒక ఉపన్యాసం యిచ్చి చెంబెడు నీళ్లు తరుముకువెళ్లి దాని నెత్తిమీాద పోసీ దావిడ-చచ్చి స్వర్గాన్నుంది. అంట మూతిపిల్లికి, ఆ చెంబెడు నీళ్లతోనూ శుద్ధి అయేది. ఒక్కొక్క గండుపిల్లి తప్పించుకు పోయేది కూడాను. ఆ సందర్భంలో మా అమ్మకు కోపమూ దుఃఖమూ ఇంతా అంతా కాదు. ఎంచేతనంటే-ఈ వెధవ పిల్లి ఊరూరూ ఇల్లిల్లూ తిరిగి, అందరి ఎంగిళ్లూ కలిపివేసి, ఆఎంగిలి మాయింటికి మళ్లీ తీసుకు వస్తుందని. మా అమ్మ అప్పుడప్పుడు పిల్లిని పట్టుకోడానికి ప్రయత్నించేదికూడాను. ఖర్మంచాలక ఏదేనా ఒక పిల్లి దొరికినట్లయితే దాన్ని

బిందెలో వేసి, బిందెనిండా బట్టలువేసి, నీళ్ళకు వెళ్ళే టప్పుడు కాలవకు తీసుకు వెళ్ళేది. అక్కడ ఆ పిల్లిని వదలి పెట్టి, రెండుదాన్ని తిట్టి, బట్టలు వుతుక్కొని, స్నానంచేసి, మడినీళ్ళ బిందెతో యింటికి వచ్చేది. ఇంట్లోకి వచ్చి, నీళ్ల బిందె దింపి "విరగడైందమ్మా నెధవపిల్లి" అనేది. అనీ అనడంతోనే మ్యావని ఆపిల్లే గదిలో పెట్టెమీదనుంచి దిగి ప్రత్యక్షం మయేది.

ఏలాగైతేనేమి నాకు పిల్లిమీద కోపానికి మా అమ్మే కారణం. ఇంక మా పిల్లిసంగతి. మా అమ్మ బతికి వున్న న్నాళ్ళూ మా యింట్లో పిల్లి కాలుపెట్టలేదు. దరిమిలాని ఒక పిల్లి-పాపము చూలాలు-మా యింటికివచ్చి యిల్లంతా సోదా చూచి వెళ్ళింది. కొన్నాళ్లు పోయాక, ఒక తెల్లపిల్లి పిల్లని మా యింటి దగ్గిర వప్పగించింది. దాన్ని పూర్వపు అలవాటును బట్టి తరిమివెయ్యడానికి ప్రయత్నం చేశాము. ఎంత చేసినా, మాయిల్లు మాత్రం అది వదిలీదికాదు. ఇల్లంతా కర్రతీసుకు తరిమి, ఇంట్లోంచి వెళ్ళిపోయిందని అను కుంటూంటే, ఏబుట్టలోంచో, ఏపొయ్యి పెడలోంచో, ఏ అలమారు లోంచో మ్యావు అనేది. దాన్ని తరిమేమార్గం దొరక్క, పోనీ మా అమ్మ లేదుగదా పిల్లి వుంటే ఏమి పోయిందని వూరుకున్నాం. ఊరుకోవడానికి యింకోకారణం కూడా వుంది. మా చంటమ్మాయికీ, యీపిల్లిపిల్లకీ, ఒకవిధ మైన స్నేహం కుదిరింది. మా అమ్మాయి దగ్గిరకు వెళ్ళి తోక లాగినా, చెవులు పీకినా, ఊరుకునేది ఈపిల్లి. మేమెవరమేనా దగ్గిరకు వెళ్లితే మాత్రం పారిపోయేది. కొత్తలో మా

అమ్మాయి, పిల్లిని వింతగా చూచేది కాని దగ్గరకువెళ్ళేది కాదు. రానురాను దానిదగ్గరగా వెళ్ళి దానితో ఆడుకొనేది ఒక ఆటబొమ్మతో ఆడుకొన్నట్లు. అంటే జ్ఞాపకంవచ్చింది- ఒకనాడు ఒక ఇల్లాలు చంటిపిల్లను చంకబెట్టుకొని, చుట్టపు చూపుకు వచ్చింది మాయింటికి. చంటిపిల్లను నడవలో వదలి, ఆవిడ మాఅమ్మాయి తల్లితో గుమ్మంముందర కూచుని కబుర్లు చెప్తూతోంది. మా అమ్మాయి చంటిపిల్లను చూచి దగ్గరగా వెళ్ళింది.

ఇద్దరూ కొంచెం ఎడంగా కూచుని ఒకరినొకరు పరకా యించి కొంత సేపు చూచుకున్నారు. ఒకరి నొకరు కొంత సేపైనతరువాత తాకినారు. తరువాత ఒకరినొకరు లాగి చూచుకున్నారు. చివరకు ఒకరినొకరు ఒకబొమ్మగా నిశ్చ యం చేసుకున్నారు. చేసుకుని ఒకరిజుట్టు ఒకళ్లు పట్టుకుని లాగుకోవడం ప్రారంభించారు.

"ఉాఁ"

"ఉాఁ"

"ఉాఁ ఉాఁ"

"ఉాఁ ఉాఁ"

తరువాత రోదనాలధ్వని విని ఇద్దరు పిల్లలనీ, తల్లులు విడి పించారు. ఆ చంటిపిల్లలాగ యీపిల్లిపిల్ల, మాఅమ్మాయితో కలియబడి దెబ్బలాడలేదు. అందుచేత ఆపిల్లిపిల్ల దగ్గిర మాఅమ్మాయికి చనువు.

ఈ పిల్లిపిల్లను యింట్లో వుంచడానికి ఇంకో కారణంకూడా వుద్దు. మా అబ్బాయికి కూడా ఈపిల్లిపిల్లంటే ఎంతో సరదా.

## మా యింట్లో పిల్లి

పిల్లిపిల్లకు మాత్రం మావాడంటే అతిభయం. పిల్లిపిల్ల నెమ్మదిగా ఒకమూల కూచుని, హాయిగా కళ్లుమూసుకొని, ప్రపంచాన్ని మరిచిపోతూన్న సమయంలో, మావాడు నెమ్మదిగా దానివెనకాలే వెళ్ళి తోక లాగుతాడు. అది ఏమి జరిగిందో గ్రహించలేక దిక్కుతోచకుండా పరుగెత్తుతుంది. మావాడు గంతువేసి నవ్వుతాడు. ఒక్కొక్కప్పుడు పిల్లిపిల్లను కర్రపుచ్చుకొని యిల్లంతా తరుముతాడు. కూడాను. మావాడికి పిల్లిమీద ఎంత అభిమానం అంటే—

ఒకనాడు "ఒరే అబ్బాయీ, వంటింట్లో ఎవరూ లేరు. పిల్లివచ్చి ఏమేనా ముట్టుకోగలదు చూస్తూండు" అన్నాను.

కొంతసేపు వంటింట్లోకూచోనిఉండి తరవాత మావాడు వచ్చి "నాన్నా, నాన్నా, పెద్దపిల్లా? చిన్నపిల్లా?" అన్నాడు. చిన్నపిల్లి అంటే వాడి కంత ప్రేమ.

ఒకనాడు మావాడు పిల్లిపిల్లతో ఆడుకుంటున్నాడు. మేము చూసీ చూడకుండా ఊరుకున్నాము. కొంతసేపటికి మావాడు మాదగ్గిరకు వచ్చి నవ్వడం మొదలు పెట్టేడు. మాకు అర్థమయిందికాదు. "ఎందుకురానవ్వుతా" వంటే మాట్లాడడు. అప్పుడు అక్కడ వారెవరో "పిల్లేదిరా" అన్నారు. మావాడు గట్టిగా నవ్వి "నూతులోపడవేశాను" అన్నాడు. ఎక్కడ పిల్లిబ్రమ్మత్య వస్తుందో అనిదాన్ని కష్టపడి పయికి తీశాము. తీసినందుకు విశ్వాసమేనా చూపకుండా, అది పారిపోయింది. మావాడు చేసినపని చెడ్డపనిఅని యిడిచదివేవాళ్లందరూ అనుకుంటున్నారని నాకు అనుమానంగా వుంది. మావాడి మనస్సులో వున్నవూహాలే వాళ్లందరకూ వుంటే, మావాడికి వున్న

ఉత్సాహము, జంతువులమీద ప్రేమా, చదువు సంధ్యలుమాని పిల్లిపిల్లలతోటీ కుక్కపిల్లలతోటీ ఆడుకుందామనే ఆసక్తి వాళ్ళందరకూ ఉన్నట్లయితే, మావాడికివలెనే వారందరూ కూడా ప్రత్యేకంగా ఒకపిల్లిపిల్లను సంపాదించి నూతులో పడ వేస్తారనే నానమ్మకం. అట్లా పడవెయ్యక పోయినట్లయితే, అథమపక్షం ఆలాగ పడవెయ్యడానికి యిచ్ఛయేనా లేకున్న ట్లయితే వారియెడ నాకుగల సదభిప్రాయము మార్చుకో వలసి వస్తుందని వినయ పూర్వకంగా మనవిచేస్తున్నాను.

ఎన్నికారణాలువున్నా ఈపిల్లి యింట్లో వుండడం నాకు మట్టుకు చాలా అయిష్టంగావుంది. ఏమంటే, తెల్లవారగానే కళ్ళు నులుపుకొని, శ్రీరాముని తలచుకొని, కళ్లు తెరిచేటప్ప టికి—ఎదూరుగా సిద్ధం యీపిల్లి. ఏదైనా తొందరపనిమీద వెళ్లవలె నని గడప దాటి గుమ్మాలు దిగుతూవుంటే—ఎదూ రుగా సిద్ధం యీపాడుపిల్లి. నేనిలాగంటే యిదంతా మూఢ విశ్వాసం అంటారు దొరలు. ఆమాటకువస్తే దొరలకి మాత్రం లేవా మూఢవిశ్వాసాలు ? "దీనిమొహం ఈడ్వా, తెల్లారకుండావచ్చి నామొహం ఎదట పడింది, ఈపాడుపిల్లి" అని మనం అఘోరిస్తే, వాళ్లు—అంటేఇంగ్లీషు దొరలు—తెల్లారీ టప్పటికి నల్లపిల్లిగానే కళ్లముందర పడ్డట్లయితే ఆవేళ ఏదో చక్రవర్తిత్వం వచ్చినట్లు సంతోషిస్తారు.

ఇదిమాత్రం మూఢవిశ్వాసం కాదూ ? వట్టిగడ్డిబండి ఎదురుపడ్డట్లయితే తక్షణం కళ్లు మూసుకొని, ఒకకోరిక కోరుకొని, బండి పోయేదాకా కళ్లుతెరవకుండా వున్నట్లయితే ఆకోరిక తప్పకుండా సిద్ధిస్తుం దని వాళ్ల నమ్మకం—బండి

మాత్రం కళ్లు మూసుకున్నప్పుడు మీాదనుంచి పోకుండా వుంటే సరి.

గుండుసూది దొరికితే లాభం ఆరోజున. కత్తిర విడదీసి వున్నది చూస్తే ఆనోజున కలహం. ఎవరేనా తుమ్మినప్పుడు మనము 'చిరంజీవ' అన్నట్లే, వాళ్లు "భగవంతుడు నిన్ను రక్షించుగాక," అంటారు. సోమవారం తుమ్మితే అపాయం. మంగళవారం తుమ్మితే కొత్తవాళ్లవుపిస్తారు. బుధవారం వుత్తరం వస్తుంది. గురువారం మంచిది. శుక్రవారపుతుమ్ము దుఃఖావహము. శనివారపు తుమ్ము వలన మరునాడు ప్రేయసి లభ్యమవుతుంది. లేవకముందు ఆదివారం తుమ్మినట్లయితే భోజనానికి ముందే నీమనోహారిణి దర్శన మవ్వుతుంది. ఇవి వాళ్ల కొన్ని నమ్మకాలు. వాళ్లమాటెందుకు మనకు ? ఇంక మనపిల్లిసంగతి.

చిన్నతనంలో మాఅమ్మ జోలలుపాడేటప్పుడు నాకు పిల్లి మీాద గొప్ప అభిప్రాయం వుండేది. ఆ అభిప్రాయానికి కారణము పిల్లియొక్క గొప్పతనమో పాట గొప్పతనమో నేను నిర్ణయించలేక పోతున్నాను. ఆపాటలు యిక్కడ రాస్తాను. మీారు నిర్ణయించగలరేమో చూచుకోండి.

౧. ఉళళ ........హాయీా

హాయివారమ్మాయి నీళ్ల కెళ్లింది,
పాలైన యివ్వవా ఓ కుక్క పిల్లా ?
ఉళళ ........పిల్లీ
పిల్లమ్మ వెళ్లింది పల్లెల్లు దాటి,
అబ్బాయి వెళ్లేడు రచ్చల్లు దాటి.

౨. ఉళళ........పిల్లీ
పిల్లిరావే తల్లి పిల్లల్లమ్రీ,
మ్రరికిందా వాడు తొ్రరి నాగన్న!
తొ్రరినాగన్నకూ తోడెవ్వరమ్మా ?
గు్రరాలు కాసేటి గురవడే తోడు.

౩. పిల్లి వారింటికీ చల్ల కెడితేను,
అల్లవారీకుక్క భొంయి మన్నాది;
నా కాళ్ల గజ్జెల్లు ఘల్లుమన్నాయి;
నాచంకలో బిడ్డ కేరు మన్నాడు.

౪. హాయి హాయీ హాయి ఆపదలుకాయి
చిన్నవాళ్లను కాయి శ్రీవెంకటేశా
పిల్లమ్మ కన్నుల్లు బీరపువ్వుల్లూ,
అబ్బాయి కన్నుల్లు కలవరేకుల్లూ;
చిన్నారి పొన్నారి చిరుతవే నీవు,
చిగురుమామిడికింద చిన్నకోవిలవు॥ హా.

నిర్ణయించలేకపోయినా యీ గొప్పతనం పాటదీకాదు. పిల్లిదీకాదు. మాఅమ్మదని నాదృఢాభిప్రాయం.

పిల్లిమీద అభిమానం వున్నా, లేకపోయినా, మా యింట్లో పిల్లికి మాత్రం నేను అన్నం తినేటప్పుడు ఒక్కమెతుకైనా విదపలేదు. మాకుర్రాడుమాత్రం కొంచెం అన్నం పెట్టేవాడు. నేను చూచి వూరుకునేవాణ్ణి. ఒకనాడు ఎంచేతనో కోపం వచ్చి, ఒకమెతుకేనా యింట్లో దొరకనివ్వనుకాను. ఎలాగైనా రెండుమెతుకులు పొట్టలోవేసుకోవాలని పిల్లి ప్రయత్నించింది గాని లాభం లేకపోయింది.

అది వెళ్లిపోయి కొంతసేపటికి వాళ్లమ్మను తీసుకువచ్చింది. వాళ్లమ్మతో వీళ్లు అన్నం పెట్టడంలేదని ఫిర్యాదుచేసింది కాబోలు. అది సంగతిసందర్భాలు కనుక్కుందా మని వచ్చి వుంటుంది. వాళ్లమ్మతో ఫిర్యాదుచెయ్యడం యిది మొదటి పర్యాయం కాదు. వాళ్లమ్మ మా యింట్లో దాన్ని ప్రవేశ పెట్టిన కొత్త ప్రియాన్ని పిల్లిపిల్ల మా పరుపుచుట్టలమీద పండుకునేది. వాళ్లమ్మ మా యిల్లు అంతా సోదాచూచి యిక్కడ పండుకుంటూవుండు, యిప్పుడిప్పుడు యీయీ వస్తువులు తింటూవుండు. అని నీతిబోధలుచేసి వెళ్లిపోయింది. ఆ రీతిగా అది పండుకుంటూవుండేది. ఒకనాడు నేను పరుపు తీసుకోవలసివచ్చి పరుపుచుట్టమీద చెయ్యివేతును గదా వెచ్చగా మెత్తగా ఏమిటో తగిలింది. ఇదేమిటి చెప్మా అని, దీపం తీసుకువచ్చి చూసేసరికి యీవేధవపిల్లి ముడిచిపెట్టుకు పండుకుంది. చాలకోపం వచ్చిందినాకు. కఱ్ఱ చేత్తోపుచ్చుకు తరమడం మొదలుపెట్టేను. హోరున వాన కురుస్తోంది బయట. ఎలాగైతేనేమి యింట్లోంచి వానలోకి కొట్టేశాను. మరునాడు తగవుతీర్చడానికి వాళ్లమ్మ వచ్చింది పిల్లను వెంట బెట్టుకుని. రెండుపిల్లులూ యిల్లంతా చూచుకున్నాయి. వాళ్లమ్మ వెళ్లిపోయింది.

ఇంకోమారు ఏమి జరిగిందంటే.—

సాయంకాలం అవడంతోటే పాలవాడు చిన్నచెంబుతో పాలిచ్చి వెళ్లిపోయాడు. ఆ చెంబుతోనే పాలుకాచి అవి భోజనానంతరం తాగి. మేమంతా విశ్రమిస్తున్నాము. ఇంతట్లోకే ఏమూలనుంచో పిల్లిపిల్లవచ్చి చెంబును సమీపించింది.

అంచులు, ప్రక్కలూ జాగ్రత్తగా నాకింది. ఒకకాలు చెంబు మీద పెట్టి లోపలచూచి నెమ్మదిగా తలదూర్చి, లోపల కూడా నాకడం ప్రారంభించింది. పూర్తిగా నాకివేసిన తర వాత తలతీసుకోవడానికి తల యెత్తింది. తలతోకూడా చెంబు లేచింది. చెంబు నేలనుకొట్టింది. మళ్లీ తలయెత్తింది. చెంబు మళ్లీ లేచింది. పిల్లికి గాభరాపుట్టింది. రంయి రంయి మని చెంబు నేలను కొట్టుతూ యిల్లంతా పరుగెత్తడం ప్రారం భించింది పిల్లి. మా అమ్మాయి కేరుమని ఏడవడం ప్రారం భించింది. మా అబ్బాయీ, తల్లీ మంచంమీద కెక్కి నిల బడ్డారు. వుమ్మడిరావులవంటి మొగాళ్లము మేమిద్దరం దాని వెనక పరుగు దొరకించుకున్నాం. మాకు దొరికితేనా అది. అది ముందూ మేం వెనకాను. "తలుపులేనా తీసేయ్యండి బయటికి పోతుందేమో" అంది, నాభార్య. "చెంబుమాటే మిటి?" అన్నాను నేను. "పిల్లి బ్రహ్మహత్య వస్తుందేమో!" అంది నాభార్య. టక్కు టక్కున నేలమీద చెంబు కొట్టుతూ ముందరకు వెనక్కు, పక్కలకి, ఎగరడం, దూకడం, గెంత డం—ఇల్లంతా అల్లకల్లోలం ఐంది. పట్టుకుని తీసేద్దామంటె మాకు దొరకడంలేదు. ఏమిసాధనం? "అయ్యో అయ్యో! లాంతరు దీపం పడగొట్టింది. చెంబు దాన్నేసి కొడుతోంది. చూస్తూ వూరుకుంటారేం?" వూరుకోక ఏమిటిచేసేది?

వెనకటికి ఒకయిల్లాలు యింట్లోకి తేలువస్తే "చూస్తూ వూరుకుంటా రేమిటి? మొగాళ్లనేనా పిలుచురాకూడదా" అందిట భర్తతో! "నాన్నా, నాన్నా, నాపలకనేసి కొడు తోంది చెంబు" అన్నాడు మా వాడు. మాఅమ్మాయి

ఏడుపు విడవడం లేదు. పిల్లికి గాభరా ఎక్కువైపోతోంది. దాని మనస్సులో ఏమేమి వ్యూహాలు పరుగువాఱుతున్నాయో గ్రహించటం కష్టం. మగవాళ్లం మేమిద్దరమూ పంచకట్టు బిగుంచుకున్నాం. రెండువేపులా కాసేము.

"పట్టుకో"

"పట్టుకో"

మమ్మల్ని తప్పించుకొని చెంబుముఖంతో పిల్లి నడవలోకి వెళ్లింది. మేము నడవలోకి వెళ్లేము. "ఈమాటు అలా కాదోయి, జంబుకానా తీసుకురా" అన్నాను.

జంబుకానా తీసుకు వచ్చి రెండువేపులా యిద్దరమూ పట్టుకొని దానిమీద ఒకమారు కప్పినాము. పిల్లికి కొత్త గాభరా పుట్టింది. చెంబు తీవ్రంగా నేలను పెట్టికొట్టుతోంది. గోళ్లన్నీ బయటకు తీసి బరుకుతోంది.

జంబుకానామీద చేతులువేసి దానిని అదిమిపట్టినాను నేను. మావాడు నెమ్మదిగా జంబుకానా ఎత్తుతూ—చెంబు ఒక్కమారు లాగినాడు. చెంబు జారిపోయింది. మళ్లీ చెంబు నెమ్మదిగా పట్టుకుని చుట్టూరా తిప్పి లాగినాడు. లాగి చెంబుతో కూడా ఒక్కమాటు మంచం ఎక్కేడు. పిల్లి ఒక్కగంతువేసి పారిపోయింది. పోయి తల్లితో ఫిర్యాదు చేసింది.

మరునాడు తల్లీ పిల్లా మళ్లీవచ్చారు. మావల్ల ఏమీతప్పు లేదుకదా, అని తల్లి గ్రహించింది కాబోలు, మమ్మ

ఏమీ అడగకుండా యిటూ అటూ తిరిగి పోయింది. పోయి పిల్లిపిల్లకు నీతి వుపదేశం చేసివుంటుంది.

"అన్నం లేదని వాళ్లమీద ఫిర్యాదుచేసే బదులు—ఎలక పిల్లన్ని పట్టుకుపోరాదా" అనీ – "పరుపుచుట్టమీద పండుకో నియ్యకపోతే వెచ్చగా వుంటుంది పొయ్యిపెడలో పడుకో కూడదా, యీమాత్రం దానికి నాతో ఫిర్యాదు చెయ్యాలా, ఎప్పటికప్పుడు యిలాగ నేను నీతులు చెప్పుతూ వుంటేనే ప్రపంచంలో నెగ్గలేకుండావున్నావు. నేను లేకపోతే ఏమి చేద్దువో" అనీ– "వెధవసంత వచ్చింది, ఎంతవరకని సర్దుకురా"ననీ ఏమోమో అనివుంటుంది. బహుశా మమ్మలందరినీ అది తిట్టిందేమో అనికూడా నా అనుమానం. చెంబు విషయంలో ఏమి నీతి వుపదేశించిందో తెలియలేదు. ఎంచేతనంటే మరునాటినుంచీ యథాప్రకారం పాలచెంబు నాకడం అది ప్రారంభించిందికాని దాని తలమాత్రం మళ్లీ చెంబులో చిక్కుకోలేదు.

ఇంతకే, యింత అనుభవమైన తరువాత మళ్లీ, నీతివున్న పిల్లైతే, మాయింటికి రాదనుకున్నాను. ఈ పిల్లివిషయమై నాకు మంచి అభిప్రాయం పోయింది. నీతిలేకపోయాక ఇంక బతకడం ఎందుకు? చెంబుగొడవ తలచుకొని మాయింటికి యీపిల్లి రాదుగదా, అనుకుంటూంటే నాకు ఆశాభంగమైంది. పిల్లిమళ్లీ యింటికిరాకుండా చెయ్యడానికి ఒకవుపాయం వుందని నాస్నేహితు డొకడు నాతో రహస్యంగా చెప్పినాడు. జాగ్రత్తగా పిల్లిని పట్టుకొని దానిని ఒక కుండలో పెట్టవలెనట. ఆకుండమూతి కట్టివెయ్యవలెను. తరవాత జాగ్రత్తగా

ఆకుండను యింటికప్పుమీాదకు తీసుకవెళ్లవలెను. ఆ కుండను ఆ కప్పుమీాదనుంచి దొర్లించవలెను. కుండ దొర్లిదొర్లి ఒక్క-మారు రంయిమని కిందబడి ధమ్మ్మని పగులుతుంది. పిల్లి మళ్లీయింటికిరాదు. ఈవుపాయం చాలామంచి దని నాకు తోచింది. ఏమంటారా?—మొదట చీకటికుండలో కదలలేక మెదలలేక కూచోవడం—తరవాత కుండ దొర్లుతూన్నప్పుడు, భూకంపం వచ్చి భూమి అల్లల్లాడిపోతున్నట్లు గొడవా, ధ్వనీ, గిర్రుగిర్రున కుండలో పిల్లి మంత్రాలూ,—తరవాత గాలి లోంచి పడడం—అలాగ పడేటప్పుడు, శబ్దమూ, దొర్లడంఆగి, ఒక్క-మారు శబ్దంగా, అప్రయత్నంగా, ఎక్క-డకో పాతాళ లోకానికి పోతూన్నట్లుండడమూ—తరవాత పిడుగు పడ్డట్లు ఘామ్మ్మని శబ్దమూ,—కుండ పెంకులూ, చీకటిలోంచి ఒక్క-మారు వెల్తురూ——ఈ అనుభవాలన్నిటివల్లా పిల్లికి మతిపోయి తీరుతుంది. మళ్లీ ఎప్పుడు మీాయింట్లో అది కాలుపెట్టదు.

ఈ సలహాప్రకారం చెయ్యవలె నని నేను తీవ్రంగా ఆలోచిస్తున్నాను. కాని ఏనాటికానాడు, మాయింట్లోపిల్లి పెద్దదై మమ్మల్నందరినీ నిర్లక్ష్యభావంతో చూడడమున్నూ పట్టుకోబోతే తిరగబడి కరవబోవడమున్నూ — చేస్తూవుండడంవల్ల దానిని పట్టుకోవడం మాత్రం చాలాకష్టంగావుంది. పిల్లికి విశ్వాసం లేదు మొత్తంమీాద. పుట్టినప్పటినుంచి మా యింట్లో అన్నం తిని బతుకుతూ, మా యింట్లో ఎలకలను తిని పెరుగుతూ, మేము పట్టుకోవాలంటే దొరక్క పోవడం కన్న అవిశ్వాస మేమిటి?

కుక్కపిల్ల అలాగ కాదు. ఎప్పుడు పట్టుకోవాలంటే అప్పుడు దొరుకుతుంది పాపము. ఈ ప్రయోగం కుక్కపిల్ల విషయంలో చేద్దును కాని—కుక్కలనుచూస్తే నాకు కోపమని చెప్పనే చెప్పేను మొదట.

1924

*P*rinted at Kalyani *P*ress, Tenali. Q. H. G 79 A
For Navya Sahitya *P*arishat, Guntur Q. H. No. G. 80
Cat. D., 19-5-46—Copies 1000.